సాహిత్య
ప్రస్థానం
సెప్టెంబర్ 2018

సంపుటి : 17 సంపాదకీయం సంచిక : 9

# ఆందోళనకరం.. అనుచితం

ప్రధాని నరేంద్ర మోడీ హత్యకు కుట్ర చేశారనే ఆరోపణతో దేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన సుధాభరద్వాజ్, గౌతమ్ నవలఖ్, వరవరరావు, వెర్నన్ గోంజాల్వెజ్, అరుణ్ ఫెరీరాలను అరెస్టు చేసిన తీరును అత్యున్నత న్యాయస్థానం తప్పు పట్టింది. ప్రభుత్వ విధానాలపై విమర్శ, అసమ్మతి ప్రజాస్వామిక హక్కులనీ వాటిని తొక్కిపట్టడం వల్ల దేశానికి ముప్పు అని హెచ్చరించింది. సుప్రీం కోర్టే ఇంత తీవ్ర వ్యాఖ్యలు చేసినప్పుడు ఇక మిగిలిన వాళ్లం పెద్దగా చెప్పాల్సిందేముంటుంది? 2018 జనవరి 1న మహారాష్ట్రలోని భీమ్ కోరెగావ్‌లో ఒక చారిత్రిక సందర్భంలో దళిత సంఘాలు ఈల్గార్ పరిషత్ గా ఏర్పడి విజయోత్సవం తలపెట్టాయి. దాన్ని విఫలం చేయాలని కొన్ని హిందూ చాందస సంస్థలు కూటమిగా ఏర్పడి అడ్డుకున్నాయి. దళిత నాయకులను అరెస్టు చేసి దేశద్రోహం వంటి ఆరోపణలు ముందుకు తెచ్చారు. దీనిపై అంబేద్కర్ మనవడు ప్రకాశ్ అంబేద్కర్‌తో సహా నిరసనోద్యమం నడిపారు. దాంతో పాలకులు ఈ ఘటనలను మరో మలుపు తిప్పి ఈ హింసాకాండ వెనక మావోయిస్టు హస్తమున్నదనే దుమారం లేవదీశారు. అలాటి వారిని జులైలో అరెస్టు చేసినప్పుడు దొరికిన లేఖల్లో ప్రస్తుత ప్రధానిని గతంలో రాజీవ్ గాంధీని హత్య చేసినట్టే అంతమొందించాలని సూచించినట్టు కథనాలు విడుదల చేశారు. ఆ సందర్భంగానే వివి అంటూ వరవరరావు పేరు ప్రస్తావనకు వచ్చిందంటారు. ఇవన్నీ కల్పిత సాక్ష్యాలనీ కట్టుకథలనీ భావించడానికి చాలా కారణాలున్నాయి. ఎందుకంటే వాస్తవంగా రెచ్చగొట్టిన మతతత్వవాదులపై ఎలాటి చర్యలూ తీసుకున్నది లేదు. అంతకు ముందు మహారాష్ట్రలోనే నరేంద్ర దబోల్కర్, గోవింద పన్సారే వంటివారి హత్యలు జరిగాయి. కర్ణాటకలో కల్బుర్గి, గౌరీ లంకేశ్ హత్యచేయబడ్డారు. ఈ సంస్థలు వాటిపై ఎలాటి దర్యాప్తు జరిపింది లేదు. ఇంత బలమైన ప్రభుత్వం ఏదో లేఖలో పేర్కొన్న దానికి కంగారు పడాల్సిన అవసరమే కనిపించదు. అదొక సాకు మాత్రమే. మావోయిస్టుల భావాలతో చర్యలతో ఎవరికైనా అనంగీకారం వుండొచ్చు గాని ఆ పేరిట రచయితలు, మేధావులపై దేశద్రోహం, హత్యాకుట్ర వంటివి మోపి ఇళ్లపై దాడి చేయడం అప్రజాస్వామికం. రొమిల్లాథాపర్, ప్రభాత్ పట్నాయక్, దేవకి జైన్, సతీష్ దేశ్‌పాండే, మజా ధరువాలా వంటి మేధావులు అక్రమ అరెస్టులపై అదేరోజు పిటిషన్ వేయడంతో సుప్రీం కోర్టు జోక్యం చేసుకుని వారిని గృహ నిర్బంధానికి పరిమితం చేసింది. అంటే ఇప్పటికీ అరెస్టులోనే వున్నారు. ఇంత తీవ్ర ఆరోపణలు చేసిన పూనే పోలీసులు అభియోగపత్రం దాఖలు చేయడానికి మాత్రం మూడు నెలల కాలవ్యవధి అడగటం ఆశ్చర్యకరం. దాన్నిబట్టే డొల్లతనం తెలిసిపోతుంది. ప్రజా ఉద్యమాలపై దాడికి దళితులలో వస్తున్న నూతన చైతన్యానికి మావోయిస్టు ముద్ర వేసి వేటాడటం దారుణం. గతంలో జెఎన్‌యు, హెచ్‌సియులలో జరిగిన దాని కొనసాగింపే ఇది. అందుకే ఈ నిర్బంధాన్ని, అరెస్టులనూ వేధింపులను ప్రతివారూ ఖండించాలి. రచయితల, మేధావుల, సామాజిక కార్యకర్తల భావస్వేచ్ఛను కాపాడుకోవాలి. మోడీ పాలనలోనూ ఇక్కడ తెలుగు రాష్ట్రాలలోనూ ఇదే తరహాలో ఉద్యమాలపైన మీడియాపైన దాడులు, ఆంక్షలు పెరుగుతున్నాయి. మరోవైపున కులమత శక్తుల అసహనం పరాకాష్టకు చేరుతున్నది. ఈ నిర్బంధకాండనూ విద్వేష ప్రచారాలను అడ్డుకోవడం ద్వారానే ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోగలం. ◆

సంపాదకవర్గం:
తెలకపల్లి రవి ప్రధాన సంపాదకుడు
వొరప్రసాద్ వర్కింగ్ ఎడిటర్
కె. సత్యరంజన్ • చీకటి దివాకర్
గనారా • శమంతకమణి
కెంగార మోహన్
కె.లక్ష్మయ్య, మేనేజర్

బొమ్మలు:
తుంబలి శివాజి
గంగాధర్ వీర్ల
చిదంబరం

రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి,
గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com

## కథలు



## కవితలు



## వ్యాసాలు



## కవిత

## నానీలు

- కె.ఎ.ఎల్.సత్యవతి
9440210103



*నా కలం ప్రసవ వేదన*
*పడుతోంది*
*మంచి కవితే*
*పుడుతుంది*

*నగరం మంచుదుప్పటి*
*కప్పుకుంది*
*వెచ్చదనం*
*నిద్రాదేవి ఒడిలో*

*చెప్పాపెట్టకుండా*
*నువ్వెళ్ళిపోయావు*
*తిరునాళ్ళలో పిల్లాడు*
*తప్పిపోయాడు*

*పల్లకీ ఎదురు*
*చూస్తోంది*
*బోయీని మోసి*
*ఋణం తీర్చుకోవాలని*

*చెట్టు*
*భయపడుతోంది*
*మట్టి అంటుందేమోనని*
*మరో చోటికి పొమ్మని*



# తులసి మొక్కలు

- శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

"ఇక్కడ మునగడమూ గుండువారి రేవులో తేలడమూనూ; అక్కడికి ముందెవరు వెడితే వాడికి తక్కిన వాళు వందరూపాయలివ్వడం. ఏమంటారు?" అని ప్రకాశము నిక్కచ్చిగా నడుగగా 'నేనంటే నేనూ నూ' అని నలుగురైదుగురు విద్యార్థులు సిద్ధపడిరి; గాని యందొకడు "రూపాయల పందెం యేమిటిరా! ఓడి పోయినవాళ్లు పోతగట్టుమీద యెక్కడా నుంచోకుండా మైలుదూరం పరుగెత్తడం. ఏం చెబుతావు?" అని యడిగి తక్కినవారు అంగీకరింపకపోగా నేను తగ్గేను.

మొత్తము నలుగురు ముందుకు వచ్చిరి. "సంయే" అంటే "సంయే" అనుకున్న తరువాత పైవారిలో నొకడు చప్పటులు చరువగా ఆ నలుగురును ఒక్కసారి బుడుంగున మునిగిరి. తక్కినవారందరును ఒడ్డెక్కి గుండువారిరేవు నకు పరుగెత్తుకొనిపోయిరి.

పదిబారలలో నొకడు తేలి "నావాటా ముప్పయి మూడు రూపాయలవుతాయి. పారేస్తాను" అని పలుకుచు నొడ్డెక్కెను. మరి పది బారలలో నింకొక్కడును, అరఫర్లాంగులో మరియొక్కడును తేరి ఒడ్డెక్కిరి.

అది మాఘమానము. నాడు ఆదివారము మార్కండేయస్వామిని సేవింపవచ్చి అనేక జాతుల స్త్రీలు గుండువారిరేవులో స్నానములు చేయుచుండిరి. నీటి కాసు బ్రాహ్మణులపని చాలా తారీ త్రొక్కుడుగా నుండెను. తక్కువ జాతి మగపిల్లలు కొందరు ఈతలాడుచు నడుమ నడుమ బ్రాహ్మణులచే నదలింపబడుచుండిరి.

సాహసము గల విద్యార్థులు కొందరు మెట్లు దిగి నీటి చెంతకు బోగా స్త్రీల శీలనైశిత్యము నెరిగిన మరి కొందరు ఒడ్డుమీదనే యుండిపోయిరి. అందరును ప్రకాశము రాకను గమనించుచు గోదావరి దెసకు చూచుచుండిరి. "మునిగి యెదురు రావడమూ ఫర్లాంగుపైగానూ. ప్రకాశం మాత్రం వూడిపడ్డాడా యేమిటి మనకంటే?" అని మొదట తేలినవాడనగా "మనం యింతదూరం వచ్చాముగాని వాడూ అక్కడే తేలి వుంటాడు" అని రెండవాడనియెను. "వాడు గూడా అక్కడే తేలితే మరి రూపాయలు యెవరికీ యివ్వడం?" అని మూడవ వాడడుగగా "కాఫీహోటలు వాళ్లకి" అని చప్పటులు కొట్టినయాతడనియెను.

పైని యిట్లుండగా నీటిలో నొక కుఱ్ఱవాడు "బాబోయి యెంతచేసో" యని యులికిపడెను. నీటికాసు బ్రాహ్మణుడు దొకడు "మొసలి" అని యెగసిపడెను. ఒక బ్రాహ్మణుడు సంకల్పము చెప్పుచుండగా స్నానము చేయుచున్న యొక బాలిక "అమ్మోయి" అని యెగిరిపడి నీటిలో మునిగెను. కంగారుపడి యిద్దరు ముగ్గురు యువతులామెను లేవదీయునంతలో ప్రకాశ మామెయెదుట తేలి నిలిచెను.

తోడనే పెద్ద గందరగోళమైనది. "నువ్వు మనిషి కాదూ?" అని యెగసిపడిన బ్రాహ్మణుడు మండిపడెను. చాలమంది స్త్రీలు చుట్టుకొనిరి. "చిన్నాడవాచితకాడవా? పైగా బ్రాహ్మడవు కూడానూ. ఇలాంటి పనే చెయ్యడం?" అని యొక ప్రౌఢ కసరుకొనగా" ఆడతోడున పుట్టలేదూ నువ్వూ? ములిగివచ్చి మా పిల్లని పట్టుకుంటావా? చూడుమరి" అని చురచుర తీరము దెసచూచుచు "మీ బావని తీసుగురా తమ్ముడూ" అని యొక యువతి పలికెను. అక్కడనేయున్న యామె తమ్ముడు మండిపడుచు బూతులు ప్రారంభించెను. బాలికయింకను గడగడ వణికిపోవుచునే యుండెను. ప్రకాశము ఏమియు చెప్పలేక స్థాణువువలె నిలిచియుండెను. అప్పుడు పైనున్న విద్యార్థులలో నొకడు వచ్చి జరిగిన సంగతి యంతయు చెప్పి ఈ పొరపాటు మన్నింపవలసినదని కోరెను; కాని లాభము లేకపోయినది.

ఇంతలో నొకపురుషుడు ముగ్గురు పోలీసులను దీసికొనివచ్చి "అరదండాలు తగిలించం డయ్యోరికి" అనియెను. పోలీసులు "ఏంపని చేశావయ్యా?" అని ముంగోపముతో నడుగగా "అలా మొద్దులాగ వూరుకుంటావేం మాట్లాడకా?" అని యెగిరిపడిన బ్రాహ్మణుడు వీపుమీద పొడిచెను. అప్పుడు ప్రకాశము "నేను చేసిన పని చాలా తప్పే; కాని యిది బుద్ధిపూర్వకంగా చెయ్యలేదు. ఈ సమయంలో యిక్కడ యింతమంది స్త్రీలు స్నానం చేస్తూ వుంటారన్న వూహే నాకు కలగలేదు. ఇక జరిగిపోయిన దానిని గురించి యేమనుకున్నా ప్రయోజనం లేదు, కనుక, నేను నెగ్గిన నూరు రూపాయలూ నీకిచ్చేస్తాను. క్షమించు" అని చేతులు జోడించుకొని పలుకగా బాలిక బిడియపడి మొగము ప్రక్కకు త్రిప్పికొనియెను. ఆమెతల్లి అంగీకరింపబోయెను. గాని ఆమెయన్న వంద రూపాయలా? ఎవడి క్కావాలీ? బంకోలు పంపించేస్తా జూడు నిన్ను. ఇంకా చూస్తారేమయ్యా?" అని పోలీసులను హెచ్చరించెను. కేసు లేకుండా చేసుకోవాలంటే పిల్ల కయిదువందలిచ్చి పోలీసోనికి సమాధానం చెప్పుకో'' అని పోలీసులను తెచ్చిన యువకుడనియెను? "అయిదు వందలు కాదు. వెయ్యి రూపాయలు పుచ్చుకొని పైగా ఖైదుచేయించినా పాపంలేదు వీడికి, ఆ పిల్లకి నూరు రూపాయలిస్తాననన్నావు. రెండు గంటలనుంచి సంపాదించుకున్న డబ్బులు అయిదు రూపాయలకు పైగా చేతులోవుండగా నీమూలాన్ని గోదావరిలో పడిపోయాయి, మరి నామాట యేమంటావు?' అని యాబ్రాహ్మణుడు తారాజువవలె లేచెను.

విచారణ చేయగా ఆ బాలిక వేశ్యయని తెలినది. పైనున్న విద్యార్థులలో నొకడు "నూరురూపాయలిస్తానంటుండగా యింకా వెక్కివెక్కి యేడుస్తుందేమిరా బోగంపిల్లా?" అనియెను. దానిమీద నామెయన్న మండిపడి "పనికిరాదు. స్టేషనుకి తీసుకుపదండి" అని పట్టుపట్టెను.

రాజీ కుదరలేదు. "నీపేరే" మని యొక పోలీసడిగెను. "జంధ్యాల ప్రకాశం. జూపూడి వారి కొట్లలో బస. బి.యే. సీనియరుక్లాసు" అని ప్రకాశము చెప్పెను. పోలీసులాతనిని వెంటనిడుకొని స్టేషనుకు వెడలిపోయిరి. ఆ బాలిక అన్నయగు మాధవరావును, తక్కిన విద్యార్థులందరును, పోలీసులను దెచ్చిన యువకుడును వారివెంట వెడలిరి. ఆ బాలికయు, అక్కలు, తల్లి మున్నగుస్త్రీలు గుడికి పోయిరి. ఇదియంతయు చూచుచున్న యొక వృద్ధ బ్రాహ్మణ వితంతువు "బోగందైతే మాత్రం! ఎదిగినబిడ్డ; తప్పుకాదూ?" అని తన దారిని బోయెను. ఆ మాట ఆ బాలిక నల్లగుండెకు చివాలున తగిలెను.

2

రంగనాయిక–ఆ బాలిక తనవాళ్లతో యిల్లుచేరి పొడిబట్టలు కట్టుకొనునప్పటికి సానులు చాలమంది చేరిరి. ఆమెతల్లియగు రాజామణి జరిగినదంతయు చెప్పెను. పెద్దక్క "రంగమ్మ బేజారైపోయిందే. దాని గుండె లింకాకొట్టుకుంటూనే వున్నాయి" అనగా పోలీసులను తెమ్మనిన రెండవ యక్క "అంతా బ్రమ్మలే. కోనసీమ జట్టులావుంది. లేకపోతే అంతపని చెయ్యరు" అనియెను. మూడవయక్క "వక బాపనోడు బోగంపిల్ల యెగిసెగిసిపడుతోం"దన్నాడు. చూశావా? అసలు ములిగి వచ్చినవాడు అణిగేవుండగా పైనున్న వాళ్లే యెగిరి పడ్డారు. అందర్నీ ఖైదు చేయిస్తే మంచిది." అనగా నాల్గవయక్క "కేసూవద్దు గీసూవద్దూ. రౌడీల నప్పగిస్తే సరీ బాజాపడుతారు" అనియెను. అందరు నన్నివిధ ములననిరి. రుసరుసలు, విసవిసలు ప్రగల్భవచనములు, చెలరేగెను, రంగనాయికకు "బోగందైతే మాత్రం? ఎదిగిన బిడ్డ. తప్పుకాదూ?" అనుమాట ఖంగు ఖంగున వినబడి నట్లయ్యెను. ఈ స్థితిలో మాధవ రావు వచ్చి "వాడెవడైతే నాకేం? ఖైదులో పెట్టించేస్తా చూడు" మని యూరడించెను. "ఏమయిన" దని యొక సాని యనగా "బసా,

పేరూ, అన్నీ రాసుగుని విడిచి పెట్టేరు. రేపు కేసు పెడతారు" అని యాతడు బదులు చెప్పెను.

ఎవరియింటికి వారు వెడలిపోయిరి. భోజనము లగునప్పటికి రంగనాయిక అక్కల సరసులు - ఒక బ్రాహ్మణుడు, ఇరువురు వైశ్యులు, ఒక చౌదరి వచ్చిరి. అందరును దూరముగా నుండియే జరిగినదానికి నొచ్చుకొనిరి; గాని పోలీసులను తెచ్చిన వైశ్య యువకుడు "నేనెంతపని చేశానో చూశావా?" అని రంగనాయిక చేయిపట్టుకోబోయెను.

చేతిమీద చేయిపడినది; అంతే, ఇంకను పట్టుకొనలేదు. వెంటనే యామె త్రాచుపిల్లవలె "భోగం దాన్నయితేమాత్రం? చెయ్యి పట్టుకోవడమే?" అని కస్సుమనియెను. రాజామణి అసంతుష్టయై యూరకుండగా పెద్దక్క "యిప్పుడా మరిదిగారూ వేళాకోళం?" అని బొమలు ముడుచుకొనియెను.

"మీరు చెయ్యి చేసుకుంటారండీ మాట్లాడితేనా" అనియాతనిసాని వినుగుకొనియెను. బ్రాహ్మణుడు "తొందరపడ్డావు" అనగా చౌదరి "అసలే రంగం ఉడికి పోతూవుంది పాపం" అనియెను.

రాజామణి బ్రాహ్మణునితో ఏదో చెప్పబోవుచుండగా రంగనాయిక "సానయితే యింత లోకువా? నాకక్కరలేదు సానరికం" అని చివాలున లోపలకు పోయెను. అందరును మొగమొగములు చూచుకొనిరి. దోషిస్తబ్ధుడై తనగదికి పోయెను. తక్కినవారందరును కొంతసేపు రంగనాయిక శౌర్యమును గురించి మాట్లాడుకొని వెడలిపోయిరి.

రాజామణి శయ్యమీద బోరగిలపడి పడుకొనియున్న బిడ్డను "రంగా" యని పలుకరించెను; కాని యామె పలుకలేదు. "ఇంత శౌర్యం అయితే యెలాగే తల్లీ?" అనుచు రాజామణి ప్రక్కలో పరుండగా రంగనాయిక మొగముమాత్ర మివ్వలకు త్రిప్పుకొని "నేను చెయ్యలేనమ్మా సానరికం. నాకు పెళ్ళిచేసెయ్యి అని మరల యథారీతిగ పరుండెను. ఆ మాటవిని యామె ఉలికిపడి ఆలోచనాధీన యయ్యెను.

రంగనాయిక పదునాలుగేండ్ల బాలిక. రజస్వలయై యూరుమాసములైనది. ఇంకను కన్నెరికము కాలేదు. వీణావాదనము నేర్చుకొనుచున్నది. అక్కల సరసులామె కొకవరునికుదుర్చుటలో వ్యగ్రులైయుండిరి. కన్నెరికము చేయుట కొకవర్తకుడు అంగీకరించెను. గాని అయిదువందలా ఎనిమిదివందలా యని వ్యవహారం నడుచుచుండెను. రాజామణి తన యీకడసారపు ఓడ్డకు ఒక వైష్ణవునిచే కన్నెరికము చేయింప గోరుచుండెను; కూతుళ్ళు ఆ యాలోచనమును ప్రత్యాఖ్యానములు చేయుచుండిరి.

కాని అయితే పదునారేండ్ల బాలికయే. అయినను సానులతోడను, సరసుల నడుమను మసులుచున్న దగుటచే నామెకు కొంత ప్రౌఢిమ అబ్బియుండెను. ఈ కారణములవలన ఆమె వృద్ధబ్రాహ్మణ వితంతువు మాటను చక్కగ బోధపరుచుకొనగలిగెను. సహజముగ నామ మోస్తరు వేరు. ముక్తసరు మనిషి, అక్కలనైన రాసికొనుచు తిరుగదు. అందుచేత వారప్పుడప్పుడామెను "ఇలా అయితే సరసుణ్ణిబాగానే మెప్పిస్తావు" అనీ, "బువ్వ బాగానే వస్తుందనీ" యనుచుందురు. అప్పుడెల్ల నామె "పోనీలెండి, వచ్చినంతలోనే గడుపుకుంటాను. నా గుణాలు నచ్చిన సరసుడే వుంటాడు. అసలు నేను మంచి బ్రాహ్మణ్ణి చూసి కూడా వెళ్ళిపోయి వారింట్లో చాకిరీ చేస్తూ బతుకుతాను" అనుచుండెను.

3

మరునాడు పోలీసులు ప్రకాశము మీద కేసు పెట్టిరి. మాధవరావు వెంటవచ్చి ప్రకాశము కాలేజీలో తరగతిలో నుండగా నోటీసు ఇప్పించెను. దొర'యేమి"టని యడుగగా ప్రకాశము జరిగినదంతయు చెప్పెను. మరి యొకచో పాఠములు చెప్పుచున్న వీరేశలింగము పంతులును బిలిచి దొరయంతయు చెప్పను. ఇద్దరును ఒక్క క్షణము నిశ్శబ్దముగా నుండిరి. "నాతో చెప్పావు కాదేమీ?" అని పంతులడుగగా ప్రకాశము "ఇంత వరకూ వస్తుందనుకోలేదు" అనియెను. దొర గంభీరముగా చూడగా పంతులు ఆ చూపుల నందుకొని వెడలిపోయెను.

వాయిదా రేపనగా ప్రకాశము పబ్లికు ప్రాసిక్యూటరగు రామదీక్షితుని యింటికరిగెను. అప్పటికప్పుడే వీరేశలింగము పంతులు వచ్చియుండెను. ప్రకాశము నమస్కరించి యిట్లు మాట్లాడెను.

"వేశ్యా బాలికపక్షంగా తమరు దాఖలు చేసిన కేసులో నేను ముద్దాయిని".

"అలాంటి పని చేశావేమి అబ్బాయీ?"

"నేను చేశానా అని నాకేం సందేహం; కాని జరిగి పోయింది మాత్రం తప్పులోనే చేరుతుంది"

"ఇంకా నింపాదిగా అంటున్నావా? పెద్దసెక్షనే పడింది"

"అది మీ చేతిలో వుంది. నేనిక్కడ బి.యే. సీనియరు తరగతి చదువుతున్నాను. ఈ కేసులో మీరు దాఖలు చేసిన ప్లయింటు చూడగా నా భవిష్యజ్జీవితాన్ని గురించి చాలా భయం కలుగుతూ వుంది. నాలుగో తరగతి మొదలు యింతవరకూ అపజయమనేది లేకుండా యెకాయిటాకీని పైకివచ్చాను. చాలా మాట్లు తమరు గూడా నాకు చందాలిచ్చి వున్నారు కనుక నా బీదతనాన్ని గురించి మళ్ళీ చెప్పవలసిన పనిలేదు."

"తప్పుచెయ్యడానికి బీదాసాదా భేదం వుందా?"

"అదిగాదు నేను మనవి చేసుకునేది. నేను అల్లరి జట్టులోనివాణ్ణి కానని నావిశ్వాసం. వీరేశలింగం పంతులుగారు నాగురువులు-"

"బాగుపడతావు?"

"కాని మీరు దాఖలుచేసిన కేసు-"

"నన్నేం చెయ్యమంటావు. నువ్వలా ప్రవర్తించావు"

నా వుద్దేశాన్ని తమరు విమర్శించాలని కోరుతున్నాను. స్టీమరురేవులో మునిగి గుండువారిరేవులో తేలడానికి మా క్లాసువాళ్లం పోటీలు పడ్డాము. అందుకు యౌవనం యొక్క వ్యగ్రోత్సాహంతప్ప వేరేమీ కారణాలు లేవు"

"అది వ్యగ్రోత్సాహం అని నువ్వు చెప్పేటప్పుడు దానివల్ల యిలాంటివి సంభవిస్తాయని నేనింక చెప్పడం"-

అంతటా ఫలం అలా వుండకపోయినా ఆ సమయంలో నా విషయంలో అలాగే జరిగింది.

"మునిగివెళ్లి తేలడంలో స్త్రీసంఘంలో అలా జరిగిందంటావు. ఇంతేనా నువ్వు చెప్పేది?"

"సరిగా అంతేనండీ. ఆ సమయంలో అక్కడ అంతమంది స్త్రీలు వుంటారని వూహించలేకపోయాను.

"స్త్రీలు కాకపోతే పురుషులుంటారు. కాకపోతే పడవ వుంటుంది. ఎలాగయినా ఆ రేవులో తేలేటట్లు పందెం వేసుకోవడం తప్పే"

"తప్పే అయింది. కనుకనే పశ్చాత్తాపం"

"విప్రా: పశ్చిమబుద్ధయ:"

"అది జాతికంతకీ చెందిన కళంకం"

"ఇంతకీ నువ్వు చెప్పే దేమిటీ?"

"జరిగిపోయిన సంగతికి మూలం యేమిటో, యెలా జరిగిపోయిందో మనవిచేశాను. నా స్థితి మనవి చేశాను. నాప్రార్థన యేమంటే? ఆ పందెంలో నేను నూరు రూపాయలు గెలిచాను. అవి ఆ బాలికకు దాఖలు చేస్తాను. కేసుతప్పించి నన్ను కటాక్షించాలి తమరు"

"కోరిక మంచిదే. కేసులు రాజీకావడమే నా వుద్దేశం"

"ప్రయత్నిస్తే తమకు వ్యతిరేకం జరగదు. కళంకం రికార్డయిపోవడం వకటీ, నా భవిష్యత్తు ధ్వంసం కావడం వకటీనీ, తమరు బాగా యోచించాలి"

దీక్షితులు దీనికి సమాధాన మాలోచించుచుండగా వీరేశలింగముపంతు లందుకొనియెను.

"దీనికి పర్యవసానం యేమిటో?"

"రెండు వేలదాకా జరిమానా రెండేళ్లదాకా వరకమూనూ. అధికారి తన యిష్టాన్ననుసరించి యిందులోయేదో వకటిగాని, రెండూగాని విధించవచ్చు."

"ముందు రుజువు కావాలన్నమాట."

"అంటే?"

"ముద్దాయి యేవుద్దేశంతో వుండగా ఆ పని జరిగిందో ఆ విషయం తేలవద్దూ?"

"జరిగిపోయిన దానికేమో రేవంతా సాక్ష్యమే"

ఈ సమయమున ప్రకాశ మందుకొని "నేను జరిగిన సంగతంతా యిందాకనే మనవిచేశాను. కోర్టులో గూడా ఇలాగే చెబుతాను. దీనికి సాక్ష్యమే అక్కరలేదూ. ఇది జరగలేదని వాదించను. క్షమించవలసిందనే మొదటినుంచీ నా ప్రార్థన" అని చెప్పెను.

"కష్టసుఖాలూ, లాభనష్టాలూ, మంచిచెడ్డలూ వివరించి చెబుతాను. ఆ యింట్లో తల్లిపెత్తనం వుంటే మాత్రం రాజీ జరుగుతుంది. కాని ఆ పిల్ల అన్న చాలా పట్టుదలగా వున్నాడు. అప్పుడు నీ వాళ్లేమో బోగం జాతిని నిందించారట. పంతులుగారూ! అతనొక్కమాట చెప్పాడు. అది మీతో చెప్పడం నాకు యిష్టంలేదు; దానికి నేనూ అంగీకరించలేదు. రాజీకి అదొక్కటే మార్గం కాదు. ఆ పిల్లాడు-"

"ఏమన్నాడూ?"

"చెప్పమంటారా?"

"వచ్చిన కేసు సవ్యమైనదికాదు. దానికి సంబంధించిన ఆలోచనలు తగినట్టుగానే వుంటాయి. అయినా వినడానికి కేమీ?"

"మీ శిష్యుడు ఆ పిల్లకి కన్నెరికం -"

ఈ శబ్దము వినుటయే తడవుగా ప్రకాశము శ్రీహరీ యని చెవులు మూసికొనియెను. పంతులు ఉలికి పడెను.

"అందుకోసమే నేను చెప్పనన్నాను"

"ఆ పిల్లాడు అలా అన్నాడా?"

"అవును, రాజీకావాలంటే అదొక్కటే మార్గం అంటాడు"

"అందు కింకెవ్వరూ దొరకరూ?"

"లోటా? పిల్ల దీపంలా వుంది. చాలా తెలివైనది. శీలం చాలా నిశితమైనదని తలుస్తాను."

"ఏమన్నారూ?"

"పరపురుషుడు తను తాకినందుకు ఆ పిల్ల చాలా కించపడుతోంది"

"అయితే వకపనిచేస్తారా?"

"ఏమిటది?"

"ఆ పిల్లతల్లిని మా తోటలోకి వకమాటు పంపించ గలరా?"

"దానికేమీ?"

"అయితే సరే"

ఇట్లు చెప్పి పంతులు సెలవు పుచ్చుకొని బయలు దేరెను. ప్రకాశము గూడ దీక్షితునకు నమస్కరించి బయలుదేరెను. రాత్రి పదిగంటలకు రమ్మని ప్రకాశమును పంపివేసి పంతులు తనతోటకు వెడలిపోయెను.

4

దీక్షితుని వర్తమానమును విని సానులందరును తెల్లపోయిరి. పంతులుకు వేశ్యలనిన బద్ధవైరమని అందరు నెరుగుదురు ఎందుకో యెవరికి నేమియు తోచలేదు. రాజామణి బయలుదేరగా పెద్దకూతురుగూడ వెంటబడెను.

రాత్రి యెనిమిదిగంటలైనది. అప్పుడే భుజించి వచ్చి పంతులు వెన్నెలలో పడకకుర్చీమీద కూర్చుండెను. సానులు వచ్చి నమస్కరించగా అతడు కూర్చుండగోరెను; గాని ఆ తల్లీకూతుళ్లు ఇద్దరును వినియమును జూపి నిలిచియే యుండిరి. అందుకు పంతులు "లోకంలో జరిగే సంగతులు నాకు బాగా తెలుసును. ఎటు వంటివాళ్ళూ గూడా మిమ్మల్ని కూచోమనడం తమకు అగౌరవమని భావిస్తారు. కాని నా వుద్దేశం అదికాదు. నా యెదుట మీరు ఆ కుర్చీలమీద కూచోడం నాకు అమర్యాద కాదు. ప్రస్తుతం హిందూసంఘం స్త్రీల గౌరవాన్ని మరిచిపోయి వుంది. అందుచేతనే దేశం యివ్వాడిలా వుంది. ఇంగ్లీషుదొరతనం రాబట్టిగాని లేకపోతే మనం యింకా అధోగతిపాలై వుందుము. నోరుమాలిన వయస్సులో మీరీపాడు వృత్తిలో ప్రవేశపెట్టబడ్డారు. మీ వృత్తిని నేనసహ్యించుకుంటాను; కాని మంచి వుద్దేశంతో కబురుపంపించారు. గనుక మిమ్మల్ని గౌరవించడం నావిధి. ఒక్క నాభార్యతప్ప తక్కిన స్త్రీలంతా నాకు తల్లులూ, తోడబుట్టుపడుచులునూ. కనక మీరా కుర్చీలమీద కూచోండి" అని చెప్పెను. చేయునదిలేక సానులు కూర్చుండిరి. "వీరేశలింగం పంతులు గారు యిలాంటి వారా?" అని సానులు ఆశ్చర్యపడిరి. పంతులడుగగా రాజామణి తన కుటుంబపు సంగతులన్నియు చెప్పెను. పంతులు యిట్లు చెప్పెను.

"నేనిప్పుడొక సంగతి చెబుతున్నాను. ఉలికి పడకండి. రాజామణీ! నువ్వు పెద్దదానవు. నీకు సంగతులన్నీ తెలుసును. నలుగురు కూతుళ్లని సానరికంలో దింపి కష్టమో, సుఖమో, లాభమో, నష్టమో అనుభవిస్తూ వున్నావు. కనక రంగనాయికకు పెళ్లి చేయకూడదూ? అప్రయత్నంగా వక పురుషుడు తన్ను తాకినందుకు ఆమె విచారిస్తోందని చెబుతున్నావు. సంసారిణికి వుండవలసిన శీలనైశిత్యం ఆమెకు పూర్తిగా వున్నట్లు నాకుతోస్తూవుంది."

"మా పిల్ల సానిగా వుండడానికే ముచ్చట పడుతూ వుందండి."

"అది శుద్ధాబద్ధం. యిప్పుడడిగి చూడు".

"ఇప్పటికీ దానికదే అభిప్రాయమండి. కాదంటే తమరుగూడా అడిగిచూడవచ్చు."

"నువ్వు నాకలాంటి అవకాశం యిస్తే యికలేని దేమిటి? రంగనాయిక నిప్పుడిక్కడికి రప్పించగలవా?"

రాజామణి చెప్పగా పెద్దకూతురు బండియెక్కి వెడలిపోయెను. ఈ ప్రస్తానము ఆమె చెప్పగా యింటనందరును తెల్లవోయిరి. రంగనాయిక మాత్రము యింకను వినుటకాత్రము చూపెను. ఆమెకు "భోగందైతే మాత్రం? ఎదిగిన బిడ్డ. తప్పుకాదూ?" అనుమాట స్ఫురణకు వచ్చెను. తోడనే ఆమె బయలుదేరెను. అది చూచి తక్కిన అక్కలు ముగ్గురును గూడ బయలుదేరిరి. అందుకు వారి సరసులు తొలుత నసమ్మతిని జూపిరి; గాని తుద కంగీకరించిరి.

వీరు వచ్చులోపల పంతులు రాజామణి కనేక విషయములు చెప్పెను. రాజామణిగూడ చాలసేపు వాదించినది. "సానులు వుండడమూ, మానడమా అంటే మానడానికి నేనేకాదు సంఘమే వప్పుకోదు; కాని నా బిడ్డకి మీరు పెళ్లిచేస్తాననంటే మీరు చెప్పిన కారణాలవల్ల వప్పుకుంటాను. సాధ్యమైతే మీరు ప్రయత్నించవచ్చునని యామె చెప్పినది. ఆమె యీ మాటలు ముగించుచుండగా అందరును వచ్చిరి. అందరికంటెను ముందుగా రంగనాయిక పంతులుకు నమస్కరించి తల్లిచెంత నిలిచి పంతులు పిలువగా యెదుటికిబోయెను. అందు కానందించి పంతులు లేచి నిలిచి, రాజామణిని జూచి "మీరు చూస్తూనే వుండవచ్చును నీ కూతుర్ని. మామాటలు మీకు వినబడకుండా వుండేటంత దూరంగా తీసుకుపోయి కొన్ని మాటలు చెప్పవలసివున్నాయి. ఏమంటావు?" అనియెను. రాజామణి యందు కంగీకరింపగా పంతులు బయలుదేరెను. పిలువకుండనే రంగనాయిక పంతులు వెంట వెళ్లెను.

పంతులొకచెట్టు క్రింద కూర్చుండగా రంగనాయిక గూడ కూర్చుండెను. పిదప నిరువురును సంభాషణ ప్రారంభించిరి; గాని అది యెవరికిని వినబడనిది.

అక్కడ యేకాంతసంభాషణ జరుగుచుండగా యిక్కడ గుసగుసలు ప్రారంభమయ్యెను. "రంగమ్మకి పెళ్లి చెయ్యగూడదటే?" అని తల్లి యడుగగా పిల్ల

లందరునందుకొనిరి. "కన్నెరికం తరవాయిగా సానియ వుండగా యిప్పుడెవరు పెళ్ళాడుతారూ?" అని యొకతె యడిగెను. "అదికూడా సానయితే మనమేళంలోకి యిత పరాయి సాని పనివుండదు" అని యొకతె పలికెను." "కేసు యేమవుతుందో తేలేదాకా యేమాటా చెప్పలే" నని యింకొకతె యనియెను. "సానిరికంలో వుండే లాభనష్టాలు మనం చూస్తూనే వున్నాము. పంతులుగారు చెప్పే మాటలు గూడా బాగానే వున్నాయి" అని పెద్ద పిల్ల చెప్పెను. ఒక్క అరగంట గడచిన తరువాత పంతులు వచ్చి కుర్చీమీద కూర్చుండగా రంగనాయిక వచ్చి తల్లి చెంత నిలిచెను. "ఇప్పుడడగండి యేం చెపుతుందో." అని పంతులనగా అందురును ఒక్కమారే "రంగా! పెళ్లాడతావా?" అని యడిగిరి. వెంటనే ఆ బాలిక ముక్తకంఠముతో "ఆడతాను" అని చెప్పెను. పంతులుకు ఆనందము వెల్లివిరిసిపోయెను. సానులకు విద్యుదాఘాతము తగిలినట్లయినది.

" నా ప్రయత్నం చాలావరకు ఫలించింది. ఇక మీరేమంటారూ?"

"చెప్పడానికేంవుందీ? మా రంగమ్మ పద్ధతి మొదటినుంచీ వేరే. అది యిదివర కప్పుడప్పుడు "పెళ్లాడతాను" అంటూనే వచ్చింది గాని ఆ కోరిక యింత దృఢంగా వుంటుందని మేము అనుకోలేదు"

"సరే"

"ఇలాంటి వుద్దేశం గల పిల్ల సానిగావుండి నెగ్గలేదు. తరవాత దాన్ని యేడిపించడం మంచిదిగా తోచదు".

"బాగుంది"

"నేనప్పుడప్పుడనుకుంటూ వుంటాను, ఏమనీ? సానులలో కులస్త్రీలువుంటారనీ, కులస్త్రీలలో సానులు వుంటారనీనీ"

"యథార్థం"

"స్త్రీకి పదహారేళ్లేనా వస్తేగాని యీ విషయం తేలదు. కనుక అందాకా పెళ్ళిచెయ్యకుండా వుంటే మంచిదనుకుంటాను"

"నువ్వు పెద్ద విషయాలు ప్రస్తావిస్తూ వున్నావు. నువ్వు చెప్పే మాటల్ని పట్టి చూస్తే శీలనైశిత్యము ఉన్న వాళ్లకే పెళ్లిచేస్తే మంచిదని తేలుతుంది".

"అవునండి."

"అయితే అసలు పెళ్లియొక్క వుద్దేశం యేమిటి? ధర్మప్రజాసంపత్తి అని ఆపస్తంబాదులు చెప్పేరు. ప్రజోత్పత్తి కులటలలో గూడా వుంది. కనుక ధర్మమే ఆ రెంటిలో ప్రధానం. అనగా స్త్రీ గాని పురుషుడు గాని ఏకచారత్వాన్ని విడిచిపెడితే వారి వివాహం భ్రష్టమైపోయిందన్నమాట."

"అందుకు సందేహం వుందాండి?"

"ఉందని యెవరు చెప్పగలరూ? దీనివల్ల వివాహం అనేది స్త్రీకి పురుషుడికి గూడా ఐచ్ఛికం అని తేలుతూ వుంది. హిందువులు పురుషుడు బ్రహ్మచారిగా వుండిపోతే అంగీకరిస్తారు; కాని స్త్రీ కన్యగా వుంటే గోల పెడతారు. పురుషుడు ఎన్ని పెళ్లిళ్ళు చేసుకున్నా వూరుకుంటారు; కాని స్త్రీ పునర్వివాహం చేసుకుంటానంటే మండిపడతారు; పురుషుడు వక భార్యని విడిచి పెట్టి అంటే ఆమె జీవితాన్ని నాశనం చేసి -యింకో స్త్రీని పెళ్లాడితే యెవరూ యేమీ అనరుగాని స్త్రీకి అలాంటి అధికారం లేదంటారు. మొత్తానికి హిందూ సంఘం అంతా యిలాంటి దోషాలతో నిండివుండడం చేతనే యింతగా కూలిపోయింది."

"చిత్తం"

"పొరపాట్లు అంతటా వుండవచ్చును. మూఢవిశ్వాసాలు అన్ని మతాల్లోను వుండవచ్చు; గాని హిందూ జాతిలాంటి మూఢజాతి ప్రపంచకంలో లేదు. ఈ జాతిలోకూడా పెద్దపెద్ద మహానుభావులు ద్భవించారు గాని అందరుకూడా అనాలోచితంగా వర్ణవ్యవస్థకి కట్టుపడడంచేత సంఘం కుళ్లిపోయింది."

"చిత్తం"

"ఇది యిలా వుండనియ్యి. ప్రస్తుతాంశానికి వద్దాము. నా ప్రయత్నం చాలావరకు ఫలించింది. పర్యవసానం రేపు సాయంత్రం చెబుతాను. రంగనాయిక స్త్రీ రత్నం. ఆమెకి తగిన పురుషరత్నం నా దృష్టిలో వున్నాడు. అతనంగీకరిస్తే రేపురాత్రి అతనూ నేనూ మీయింటికి వస్తాము. అంతనంగీకరించపోతే నేను మీతో యిక మాట్లాడను. ఎవణ్నో వకణ్ణి తీసుగు వచ్చి రంగనాయికకు పెళ్లిచేయడం నాకిష్టం లేదు. మేము వచ్చినా రాకపోయినా రేపు రాత్రి పదిగంటలు మొదలు పదకొండు గంటలదాకా మీయింటో నువ్వూ, నీ కూతుళ్లయిదుగురూ తప్ప మరివక స్త్రీగాని పురుషుడు గాని వుండకూడదు. ఈలోపుగాగాని తరువాతగాని – అంటే అయిపోయీదాకా రంగనాయిక పెళ్లి సంగతి యెవరికీ – నీ అల్లుళ్లకీ, కొడుక్కీ కూడా – తెలవకూడదు."

"నా కొడుక్కి తెలవకపోతే యెలాగండి?"

"అంత:కలహాలు–"

"అవునవును. ఈ రహస్యం సంగతి ముందతనితో గట్టిగా చెప్పు. రహస్యభేదనం అయిందంటే కొన్ని చిక్కులు వున్నాయి."

"చిత్తం"

"మరి మీరిక వెళ్లండి"

"దణ్ణాలు"

"శుభం. మీ మంచిబుద్ధికి నేను చాలా సంతోషించాను. ఈశ్వరుడు మిమ్మల్ని రక్షిస్తాడు. రంగనాయిక పెళ్లిచేయగలిగితినా అది నా జీవితానికంతా ప్రకాశం కలిగిస్తుంది. మరి వెళ్లండి."

సానులందరును పంతులుకు నమస్కరించి బయలుదేరిరి. పంతులు "రంగా!" అని పిలువగా ఆమె నిలిచి పోయెను. పంతులులేచి ఆమెచెంతకు వచ్చి "అమ్మా! నీకు చెప్పవలసిందేమీ లేదు. నీ మూలంగా మీజాతి బాగుపడుతుంది. దేశం బాగుపడుతుంది. నీకు చెప్పిన మాటలు మరిచిపోకు. తల్లీ! రేపు రాత్రిదాకా నేను చెప్పిన రహస్యాన్ని కాపాడు" అని చెప్పెను. రంగనాయిక శిరమువంచుకొని ''చిత్త''మని పలికి మరియొకమారు నమస్కరించి తన వారిని కలిసికొనియెను. పంతులు బ్రహ్మానందపరవశుడయ్యెను.

5

చెప్పిన చొప్పున మరునాటి రాత్రి తొమ్మిదిగంటలకు పంతులు రాజామణి యింటికి వచ్చెను. రాజామణి స్వాగతమిచ్చి చూడగా పంతులు వెనుక ప్రకాశముండెను. రంగనాయిక సిగ్గుపడెను. ఆమెయక్కలు తెల్లపోయిరి.

పంతులు కుర్చీమీద కూర్చుండగా ప్రకాశమాత నిపాదముల సన్నిధిని కూర్చుండెను. సానులందరును యెదుట కూర్చుండిరి. పంతులు పిలువగా రంగనాయిక అతని కుడిప్రక్కన నిలిచెను.

"వరుణ్ణి తీసుకొనివస్తానని నిన్న రాత్రి చెప్పేను. ఈశ్వరానుగ్రహంచేత ఈవాళ అలారాగలిగేను. ఇతణ్ణి మీరు చూసేవున్నారు. ఇతనిమీద కసిగాకూడా వున్నారు. అయినా రంగనాయికని పెళ్లాడడానికి యింతకంటే మంచి వరుడు పృథివి మీదలేడు. ఇతను స్వచ్ఛమైన వెలనాటి కుటుంబంలో పుట్టిపెరిగాడు. కాని బీదవాడు. 'మా' అన్న శబ్దంలేదు. తల్లీదండ్రీ కూడా లేరు. ఒక్క సోదరి మాత్రం వుంది. ఆమె భర్తతో కాపురం చేసుకుంటూవుంది. ఇతను ప్రైమరీ మొదలుకొని పక్కతరగతిలో నైనా అపజయం అనేది లేకుండా పైకి వచ్చాడు. ఈ యేటితో – అంటే వచ్చే మార్చితో బి.యే. అయిపోతాడు. ఇతనికున్న ధనంఅంతా అదే. నాలుగు సంవత్సరాల నుంచి నా శిష్యుడుగా వున్నాడు. సంవత్సరం క్రిందట వితంతువుని పెళ్లాడడానికి నిశ్చయించుకున్నాడు. అయితే యిప్పుడు బ్రహ్మసమాజంలో కలవదలచి నా దగ్గిరేవున్న వినయవతీ, గుణవతీ, రూపవతీ అయిన కమ్మ వితంతువును పెళ్లాడాలనుకుంటున్నాడు. కనుకనే మీ పిల్లని పెళ్ళాడడానికి అంగీకరించాను. ఇతను మీ పిల్లని గోదావరిలో పట్టుకున్నాడని మీకు కోపం గదా? మీ పిల్లని పట్టుకన్నవాడే ఆమెను పెళ్లాడుతున్నాడు. ఇంకేమీ?"

"బాగానే వుందండి. ప్రస్తుతం మా జాతిని గురించి కొంచెం చెబుతాను. మంచోచెడో యీజాతి యిలా నడుస్తోంది. మాలో పెళ్ళిళ్లు కూడా జరుగుతూనే వున్నాయి. కాని మంచి వరులు దొరకడం కష్టం. ఈ కారణం చేతగూడా కొందరు తమ బిడ్డల్ని సానులుగా చేస్తున్నారు. అగ్రజాతులవా రెవరేనా పెళ్లాడడానికి సిద్ధపడితేనూ పిల్లలో అనేకమంది కులస్త్రీలు అవుతారు."

"నువ్వన్నమాట చాలా మంచిదే. ఇందులో రెండు కష్టాలు వున్నాయి; పెళ్లిచెయ్యడానికి సానులు అంగీకరించడం వకకష్టం; సానికూతుర్ని పెళ్లాడడానికి అగ్ర కులాల యువకులు సిద్ధపడడం అంతకంటె కష్టం. రంగనాయకి పుణ్యం మంచిది కనుక నువ్వూ మా ప్రకాశమూ గూడా చటుక్కున అంగీకరించారు"

మీరు తెచ్చిన వరుడు నాకిష్టమే. మరి నా బిడ్డ యేమంటుందో?"

"తక్కిన నీకూతుళ్లేమంటారు?"

"ఏమర్రా?"

"నాకిష్టమే"

"నాకంగీకారమే"

"నాకు వప్పుదలే".

"నాకూ సంతోషమే"

"సెబాస్! ఇక రంగనాయిక సంగతా? ఆమె నిన్న రాత్రే అంగీకరించింది. లేకపోతే నేను ప్రకాశాన్ని యిక్కడికి తీసుకురాకనే పోదును. అయినా మీరు కూడా వినవలసిందే. అమ్మా! రంగనాయికా? నీ వుద్దేశం చెప్పు."

"నేను వారినే పెళ్లాడతాను"

రాజామణి తటాలున ఆమెను కౌగిలించుకొనియెను. అక్కలందరును చుట్టుకొని లాలించిరి.

పిదప పంతులు రంగనాయికను, ప్రకాశమును ఒక బల్లమీద కూర్చుండజేసి ఒకరిచేతనొకరికి తాంబూలాలిప్పించి దీవించెను. సానులు గూడ దీవించిరి. పంతులు పౌర్ణమివెళ్లిన రెండవదినమున (ఆరుదినముల గడువు) వివాహమని చెప్పి బయలుదేరెను.

వెళ్లుచు వెళ్లుచు నాతడు సానులనందరిని సంబోధించి "మీకు తెలవవందేమీలేదు. అనేక కారణాలచేత యీ వివాహ విషయం మీ రతిరహస్యంగా వుంచాలి. మీ సరసులికిగూడ తెలవనివ్వగూడదు. పెళ్లినాటి మధ్యాహ్నం మీకు కావలసినవాళ్ల

నందరినీ పిలుచుకోండి. అప్పుడేనా వరుడు ఫలానా అని చెప్పవద్దు. ఈ వివాహం చూడడానికీ, దంపతుల్ని ఆశీర్వదించడానికీ నాతోగూడా పెద్దలనేకులు వస్తారు. అందర్నీ మీరు గౌరవించాలి. పీటలమీద కూచునేటప్పుడు మాత్రమే వరుడెవరో అందరికీ తెలివాలి" అని చెప్పి వెడలిపోయెను.

పిమ్మట ఆ తల్లీకూతుళ్లందరును వరవర్ణనము ప్రారంభించిరి. పెద్దపిల్ల "శాంతమైనవాడు" అనియెను. పోలీసులను తెప్పించిన పిల్ల "ఆ వేళ గోదావరిలో నేను మొగం సరిగా చూడనే లేదూ. చామనచాయ అయినా రంగమ్మకి తగినవాడే. పక్కపాపిడి క్రాపింగుచేత మొగం యెంతో బాగుంది. కళ్లల్లో నిదానమూ, గాంభీర్యము వున్నాయి. మొగం కలకల్లాడుతుంది'' అనియెను. మూడవయామె. "ఇరవైయేళ్లకంటే ఎక్కువ వుండవు. నూగు మీసాలతో యెంతో చక్కదనం వున్నది" అనియెను. నాల్గవపిల్ల "పొడుగూ పొట్టీ కాదు, లావూ సన్నమూ కూడా కాదూ. అన్ని విధాలా చెల్లాయికి తగినవాడూ." అనగా రాజామణి "బి.యే. అయిపోతాడుట. పెద్ద ఉద్యోగం అవుతుంది. రంగం అదృష్టం" అనియెను. ఇట్లు కొంతతడవైన తరువాత "పెళ్లికొడుకు సంగతి జాగ్రత్త" అని చెప్పి రాజామణి పోయి శయనించెను. సినీమాకు పోయిన సరసులు వచ్చు నంతవరకు ఆ యక్కచెల్లెండ్రు ప్రకాశము సంగతియే చెప్పుకొనుచుండిరి.

## 6

అటు కన్నెరికపు బేరములు జరుగుచుండగా ఇటు వివాహ నిశ్చయము వేశ్యావాటిక అంతయు గందరగోళముగా నుండెను. సానులకంటె విటులే ఆశ్చర్యపడసాగిరి. ఎవరి నడిగినను, ఎట్లు ప్రయత్నించినను వరుని సంగతి తేలలేదు. మాధవరావు గూడ "చెప్పలే"ననియెను.

అంతవరకును రహస్యముగ కన్నెరికపు బేరాలు చేసిన షాహుకారు ఇప్పుడు బయలుపడెను. ఎనిమిది వందలకే అంగీకరింపని యాతడిప్పుడు వేయిన్నూట పదారులిచ్చెదననియెను. అయినను ఆ యాశవదులు కొమ్మని జవాబు వచ్చెను. రంగనాయికను చూసినను చాలునని రెండుసార్లు వచ్చెను; గాని లాభము లేక పోయెను. ఎంతో ప్రాథేయపడగా "మరివకని భార్యని నీవెందుకు చూడాలయ్యా?" అని ప్రత్యుత్తరము వచ్చెను. "పెళ్లికొడుకెవరో చెప్పండి" అని యడుగగా రాజామణి "మీ కేమిపని?" యని కచ్చితముగా నడిగెను.

కచేరీలో రామదీక్షితుడే విచారణకు వాయిదా కోరెను. "పిల్లకి పెళ్లిచేస్తారుటే" యని పోలీసులడుగగా దీక్షితుడు "దానివల్ల మనకి వచ్చిన బాధ యేమిటీ?" అని యడిగెను. "మీ కేసుకోసం మమ్మల్ని పెళ్లిమానుకోంటారుటండీ?" యని రాజామణి యడిగెను. "పెళ్లికీ కేసుకీ సంబంధం యేమిటీ? మీ ప్రయత్నాలు మీరు మానవద్దు. ఇంట్లో నా పెత్తనం యేమీ సాగదు. నా మట్టుకు నేను మీరెలా చెయ్యమంటే అలాచేస్తాను" అని మాధవరావు చెప్పెను. "కేసు తీసేసుకుంటాం మాకు ప్రజంటు ముట్టచెప్పు" అని ప్రకాశము నడుగగా నాతడు "మళ్లీ యీ ప్రస్తావన తెచ్చారంటే మీసంగతి దొరకి రిపోర్టు చేస్తా"ననియెను. వారిని పిలిచికొని వచ్చిన వైశ్యయువకుడు "ఆవేళ మిమ్మల్ని పిలవమంటే పిలిచాను. ఇందులో నా పూచీ యేమివుందీ?" అనియెను. వివాహము సంగతి డిప్టీసూపరెంటికి చెప్పగా "పెళ్లి నిలుపుచెయ్యడానికి మనకేమైనా అధికారం వుందా?" అనియెను. చేయునది లేక సబినస్పెక్టరు మొగము దిగాలు వేసికొనియెను. సర్కిలు ఇనస్పెక్టరు "పెళ్లికొడుకెవరో తెలుసుకోండి" అని చెప్పెను. గాని యెవరును ఆ ప్రయత్నము చేయలేదు.

వివాహదినము వచ్చినది. మాధవరావు గృహాలంకారమున చాలా నైపుణ్యము చూపెను. సరసులు అవసరవస్తువుల నన్నిటిని సమకూర్చిరి. రాజామణి మధ్యాహ్నము బయలుదేరి ఇద్దరు కూతుళ్లతో వెళ్లి బంధువుల నందరిని పెళ్లికి పిలిచెను. అందరును "పెళ్లికొడుకెవరూ" అని యడిగిరి. గాని యామె "చూస్తారుగాదూ?" అని మాత్రమే ప్రత్యుత్తరమిచ్చెను. వీరేశలింగము పంతులుగూడ రావలసినవారి నందరిని ఆహ్వానించెను. దీనితో పట్టణమంతయు నుడికిపోయెను. "మాయచేసి యే అమాయిక శిష్యుడికో బోగందాన్ని కట్టిపెడుతున్నాడు పంతులు" అని సంస్కార విముఖులు గోల ప్రారంభించిరి. "వితంతువులకు మళ్లీ పెళ్లి చెయ్యడం బాగానే వుంది. వర్ణసాంకర్యం కూడా చేస్తారు పంతులుగారు' అని సంస్కారాభిమానులు చెప్పుకొనసాగిరి. "అసహనం వున్నా, ద్వేషాలువున్నా, హెచ్చు తగ్గులువున్నా , అవన్నీ మనలో వర్ణవ్యవస్థలవల్లనే వచ్చిపడ్డాయి. ఈ కులపద్ధతి యెంతత్వరగా నాశనమైతే దేశం అంత త్వరలో బాగుపడు"నని బ్రహ్మసమాజ సభ్యులు చెప్పసాగిరి.

సాయంత్రమైనది. అనుచరవర్గముతో పంతులు రాజామణి యింటికి వచ్చెను. ఆయనుచరులయందొకడైయున్న ప్రకాశమును వదినెలు జలకమాడించి అలంకరించి యెక్కడ

పెండ్లిపీట వేయుదురో అక్కడికి సమీపమున నున్న గదిలో నుంచిరి. పంతులు వీధిగుమ్మమున నిలిచి వచ్చిన పెద్దల కందరికి స్వాగతమిచ్చెను.

జిల్లా జడ్జీ, సబుకలెక్టరు, కాలేజీప్రిన్సిపలు, తహాస్సీలుదారు, మాజిస్ట్రీటు, కోర్టుమున్సబులు, సబుజడ్జీ, పోలీసుపెద్దదొర, చిన్నదొర, సర్కిల్ ఇనస్పెక్టరు, కొందరు ప్లీడర్లు, రామదీక్షితుడు, పెద్దల సంపాదనతో తగుమనుష్య లనిపించుకొనుచున్న నిర్వ్యాపారులు, మున్నగువారనేకులు వచ్చిరి. నాలుగిండ్లభవంతి కనుక నది సరిపోయెను; గాని లేకున్న అందరును వీధిలో నిలువవలసినదే.

ఏడున్నరయైనది. పంతులు బ్రహ్మపీఠము నధిష్ఠించెను. రాజామణి రంగనాయికను తెచ్చి పీటమీద కూర్చుండబెట్టెను. పంతులు కనుసన్నమీద రాజామణి పెద్దకూతురు తలుపు తీయగా ముసిముసి నగవులతో ప్రకాశమువచ్చి రంగనాయిక చెంత కూర్చుండెను. కరతాళధ్వనులు మిన్నుముట్టెను. మంగళవాద్యములు భోరుకలంగెను. కొందరు "సెబాస్" అనిరి, కొందరు నిర్విణ్ణులైరి. కొందరు ఆశ్చర్యపడిరి. కొందరు "కలికాలం" అనిరి. కొందరు చకితులైరి. దొరలు, సంస్కార ప్రియులు పంతులు పట్టుదలను కొనియాడిరి. అందరు ననేకవిధముల చెప్పుకొనిరి.

యుక్తసమయమున యుక్తరీతిని వివాహకృత్యము లన్నియు ముగిసెను. సానులు కంఠములెత్తి పాడి మంగళహారతి యిచ్చిన పిదప పంతులు వధూవరులను లేవదీసి సభలో నున్నతాసనములమీద కూర్చుండజేసి జరిగిని దంతయు నుపన్యసించెను. పిదప ప్రిన్సిపలు లేచియిట్లు చెప్పెను.

"ఆంధ్రదేశచరిత్రలో ఈ విషయం ప్రత్యేకప్రకరణంలో వర్ణించతగ్గది. ఈ వివాహంవల్ల ఈ పట్టణానికి చాలా శోభ కలిగింది. ఈ వివాహం యొక్క పూర్వచరిత్ర అంతా పంతులుగారు బాగా చెప్పేవున్నారు. యుక్త సమయములో వారు పూనుకొనక పోయినచో వేశ్యజాతిలో నూతనాధ్యాయాన్ని ప్రారంభింపచేసిన యీ బాలిక కుంభీపాకనరకంలో కూలిపోయివుండును. తల్లుల యొక్క అవివేకం వల్ల యీ జాతిలో యింకా యిలాటి బాలికలు చాలామంది చెడిపోతున్నారు. సంగతులన్నీ బాగా బోధిస్తే యేవేశ్యా కూడా తనబిడ్డల్ని పాడుచేసుకోడానికి సాహిసించలేదు. దీనికంతకీ అగ్రజాతుల స్వార్థం కొంతా, ఔదాసీన్యం కొంతా కారణాలైవున్నాయి. మీ సంఘంలో వుండే ఆచారాలు యిప్పుడు చాలామట్టుకు మీ శాస్త్రానికీ, ప్రపంచ సభ్యతకీ గూడా దూరంగానే వున్నాయి. మంచిదారిలో నడపబూనుకోవడం వకయెత్తూను. ఈ విషయంలో ఆంధ్రదేశానికల్లా వక్క వీరేశలింగం పంతులుగారే కనబడుతున్నారు. వారికంటే విద్వాంసులూ, ధనంకలవారూ, మంచీచెడ్డా తెలిసిన వారూ, కష్టసుఖాలెరిగివారూ, దేశం యొక్క దుస్థితికి వగచే వారూ, మీలో చాలామంది వుండవచ్చును; గాని యీశ్వర సందేశాన్ని విని, దానిని బాగా బోధపరుచుకుని, ఆచరణలో పెట్టగలవారు పంతులుగారొక్కరే కనబడుతున్నారు. వాస్తవంగా శంకరరామానుజాదుల తరువాత పంతులుగారు మళ్లీ అంతవారని చెప్పడానికి కేమీ సందేహం లేదు. పంతులుగారి వుద్దేశాలను ఖండించే వారు కొందరుండడం నిజమే. పంతులుగారు సంఘాన్ని పాడుచేస్తున్నారనడమే కాని తాము నమ్మిన ధర్మాన్ని పునరుద్ధరించడం కోసం వారేమీ ప్రయత్నించడం లేదు. చెడిపోయిన సంఘాలని బాగుచెయ్యాలన్నప్పుడు పూర్వశాస్త్రానుసరణం యెప్పుడూ, యెవరికీ సాధ్యంకాదు. పూర్వం యెప్పుడో నిర్ణయింపబడ్డ సంఘ నియమాలలో కొన్ని కాలాన్ని బట్టీ, సంపర్కాన్ని బట్టీ, పాత్రలబట్టీ, ప్రభుత్వాన్ని బట్టీ దిద్దబూనే వారికి అసహ్యంగా కనబడడం ప్రపంచకం అంతటా వున్నదే. ఇంతవరకు సంస్కారాన్ని వడిసిన యే ఆచార్యుడూ కూడా కేవలమూ పూర్వశాస్త్రాలను అనుసరించి మాత్రమే పనిచెయ్యలేదు. అలా చెయ్యలేదుకూడాను. సంతత సాహచర్యం వల్లనైతేనేమి, సంస్కారవైముఖ్యం వల్లనైతేనేమి, పంతులుగారి ఘనతని ఈ పట్టణంలోని వారనేకులు గ్రహింపలేకపోవచ్చును; గాని వారు ఉపాధ్యాయుగులా వుండడం వల్ల నా కాలేజీ చాలా పవిత్రమైనదని నేను నమ్ముతున్నాను. వారిస్నేహం వల్ల నా గౌరవం పెరుగుతూ వుందని నేను చాలా ఆనందిస్తున్నాను. అయితే నేటివరకూ వారి అనుచరులలో వారికి తగినవారు లేకపోయినందుకు నేను చాలా విచారించుతున్నాను. తలుచుకుంటే శ్రద్ధచేస్తే మా ప్రకాశం అంతవాడు కావచ్చును. ప్రకాశం నా ప్రియశిష్యుడు. నా కాలేజీకంతకీ దీపం వంటివాడు. నేను అతడు ఒక పతిత సంఘంలోని పిల్లని పెళ్ళాడడంలో తన విద్యాధికతకు తగిన ఔన్నత్యాన్నీ, జ్ఞానానికి తగిన విచక్షణతనీ, తన అభిజాత్యానికి తగిన ఔదార్యాన్నీ వెల్లడించి స్తుతిపాత్రుడైనాడు. ఈ సాహసకృత్యం వల్ల అతడు ఇప్పటి శిథిలసంఘానికి కొంచెం దూరం అయినా ఈ బాలికారత్నం యొక్క సాహచర్యం వల్ల అతని జీవితం ప్రకాశమానమై అనేకులకు ఆదర్శం కాగలదు. ఇప్పుడిప్పుడు హిందువులలో కొందరు వేశ్యావృత్తిని తగ్గింప బూనుకొని వుండడం మంచిదే; గాని వుపన్యాసాల వల్లా, వ్యాసాల వల్లా తగినంత ప్రయోజనం

## కవిత

# భావమొక్కటే


- అమూల్యాచందు
9059824800




ఎన్ని రణగొణ ధ్వనులు చెవుల్ని బద్దలు
కొడుతున్నా
అవి నన్నంటుకోవడం లేదు...
ఎన్ని శబ్దాలు నాలో
ప్రవహించాలనుకుంటున్నా
ఇనుప కచ్చడాలేవో నాలోకి రానివ్వడం
లేదు...
పరధ్యానాన్నంతా పోగేసుకుని చేతుల్లోకి
చేరిన
టీ తాగుతున్నాను...
చాలా తెలివిగలది కదా ఆ కప్పు
నెమ్మదిగా నా నిశ్శబ్దాన్ని తాగుతోంది...
నా పెదాలను తాకిన పంచదార
ఎప్పుడు ఆత్మహత్య చేసుకుందో
గమనించనేలేదు...
ఉన్నట్టుండి నా నాలుక చేదుకు
బానిసైపోయింది...
నా నిర్జీవ ముద్దులకు కప్పు కూడా
ముడుచుకుపోయింది...
చప్పరింతల మధ్య ఎన్నో ప్రశ్నల్ని
గొంతులో ఘాటుగా ఒంపుతోంది...
తన ఒంటి చివర్లను నిమిరే వేళ్ల కన్నీళ్లు
చదివిందేమో...
అప్పటి వరకూ సెగలు, పొగలు కక్కిన
టీ చప్పున చల్లారిపోయింది....
బుగ్గ మీద ఆరిన కన్నీటి చార...
కప్పు అడుగున ఎండిపోయిన
టీ చుక్క చార...
భాషలు వేరైనా...భావాలొక్కటే ◆

---

కలగదు. నేడు అనేక కారణాలవల్ల వేశ్యాకులంలో వున్న కన్యలకు ఆ కులంలో తగిన వరులు లేరు. అంచేత సంస్కారం ప్రారంభం కావలసిన ఈ సందిగ్ధసమయంలో అగ్రజాతుల యువకులు ఆ బాలికలను పెళ్లాడడానికి ముందుకు రావలసి వుంది. అగ్రజాతులు ఆ జాతికి చేసిన ద్రోహం యిట్టి పనుల వల్లనే తీరుతుంది; గాని మాటలవల్లా, సానుభూతి వల్లా కాదు. ఈ సందర్భంలో యీ బాలిక యొక్క తల్లిని గురించి కొంచెం చెప్పవలసివుంది. నలుగురు కూతుళ్లని కులవృత్తిలో దింపిన ఆమె ఈ బాలిక విషయంలో చాలా మంచిపని చేసింది. ఈశ్వరుడు ఆమెని పాపాలనుంచి విముక్తి కలిగించడానికి ఈ పని వక్కటే చాలు. ఆమెనీ, ఈ కుటుంబంలోని తక్కిన వారినీ నేను చాలా ప్రశంసిస్తూ ఈ దంపతులను రక్షించవలసినదని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను".

ఈ యుపన్యాసము ముగిసిన తరువాత పోలీసు పెద్దదొరలేచి వివాహమునకు సంబంధించినవారి నందరిని వినుతించి "ఈ వరుని మీద మేము పెట్టిన కేసు రేపే తగ్గించుకుంటా"మని చెప్పెను. రామదీక్షితుడు లేచి తనకు తెలిసిన సంగతులన్నీ తెలిపి, "కన్నెరికం ప్రస్తావన చేసిన మాధవరావు నేడు ఈ వివాహ సందర్భంలో చాలా హడావుడిగా వున్నందుకు ఆనందిస్తూ వధూవరులను ఆశీర్వదిస్తున్నా"నని చెప్పెను. ఇంకను మరికొందరు ప్రస్తావించిరి. చివర రాజామణి సమయోచితముగా కొంచెము చెప్పి వచ్చినవారందరికీ తన కృతజ్ఞతను తెలిపి వధూవరుల నాశీర్వదించవలెనని కోరెను.

ఈ సంభాషణలన్నియు విని అచ్చట నున్న వారందరును ఉద్రిక్తులైరి. అనేకులు వధూవరులకు వెలగల పారితోషికము లిచ్చిరి, ప్రిన్సిపలు వధువునకొక వెండిగిన్నెను, వరునకొక రిస్టువాచీని ఇచ్చి "నా శిష్యుడైన ప్రకాశం ఉన్నతిని గురించి నేనెప్పుడూ శ్రద్ధచేస్తూ వుంటా"నని మాట యిచ్చెను.

అంతయు నైన తరువాత మాధవరావును, మరి కొందరాతని బంధువులును వచ్చినవారికి చందన తాంబూలము లిచ్చి సత్కరించిరి. ఆ రాత్రి వంతులు కోరికమీద ఆక్షేపణలేనివారు అచ్చట సర్వవర్ణ భోజనమున పాల్గొనిరి. చిత్రవిచిత్రములగు బాణాసంచాలతో రాత్రి గొప్ప యూరేగింపు జరిగెను.

ఈ వివాహమును గురించి అనేక పత్రికలు తమ యామోదమును వెల్లడించినవి. దేశభక్తులనేకులు తమ సంతసమును ప్రకటించిరి. గుహలలోని అంధకారమున ఆయానందసందోహమును దవుదవ్వుల మూర్ఖాచార పరాయణుల దుర్విమర్శనములు గూడ ఉండినవి.

- నవంబరు, 1926, భారతి మాసపత్రిక. ◆

# లిబర్టీ స్టాచూ

- డా॥ ఎన్. గోపి

ప్రతి దేశానికీ
సరిహద్దులుంటాయి
కాని ఫెన్సింగులు
హృదయాలను ఆపలేవు.

ఫైళ్ళ మీద సంతకాలు చేస్తే
జీవితాలు మారవు
కాలం మీద గదా చెయ్యాలి!

ఎవరికైనా సరే
'ఇది నా దేశం కాద'నిపిస్తే
ఏం ఒరిగింది నీ పాలన వలన!
ఓట్లు గాలి దుమారంలా పడొచ్చు
అధికారం పరిమళంలా వ్యాపించాలి.



రక్త వర్షంలో
అన్నీ చెదిరిన చిత్రాలే
ఇప్పుడు
నీ ముఖాన్ని గుర్తుపట్టు చూద్దాం!

నువ్వెగరేసే పతంగులు
సీతాకోకల్లా అందంగానే
వుంటాయి
కాని దారాలు నీ చేతిలోనే!

ఆశ్చర్యం!
ఇవాళ అమెరికాలోని లిబర్టీ
స్టాచూ
స్వాతంత్ర్యం
ఘనీభవించినట్టుగా వుంది. ◆

---

# గర్భశోకం

- మార్ని జానికిరామ్ చౌదరి
9440338303

పచ్చిరెక్కల తడారకుండానే
పరాయిదేశం వలసపోయిన బిడ్డ
'మందుబిళ్ళేసుకున్నావా నాన్నా'
అన్న పలకరింతకు
ఆ తండ్రి ఆయుషు
మరో ఏడాది పెరుగుతుంది.
ప్రతిరోజూ పలకరించే
సెల్‌ఫోను రింగుటోను శబ్దానికి
మురళీరవం విన్న యశోదలా
ఆ తల్లి మనసు పులకిస్తుంది.
ఎండిన గుండెల్ని చిత్తడి చేసే
రెండు మెత్తని మాటలు కోసం
ఒళ్ళంతా చెవులు చేసుకొన్న
ఆ ముసలి జీవాలు రెండూ..
కరకుబోయ విసిరిన
'జాతి వివక్ష' తూటా కాటుకు
'పేగుబంధం' బలైందన్న వార్తతో
మండుతున్న కొలిమిలో పడ్డ
కపోతాల్లా కొట్టుకుంటున్నాయ్.
కాలుతున్న చితిలో
సజీవ సమిధలై మండుతున్నాయ్.



కోయిల కూతకూ తీతువు రోదనకూ
తేడా తెలియని అమాయకపు బిడ్డ
ఏదోరోజు రెక్కలు కట్టుకునొస్తాడని
తనరెక్కల మాటున
పొదువుకుంటాడన్న ఆశ
ఉద్దీపనా శక్తిలా పనిచేస్తుంటే..
అందివచ్చిన కొడుకు
హత్యాఘాతుకానికి బలయ్యాడన్న వార్త
పిరంగి గుండులా గుండెల్ని తాకింది.
ఎక్కానికొచ్చిన పళ్ళకంటే ముందు
వసరికాయ రాలినట్టు
ఊతమిచ్చి నడిపించాల్సిన ఊతకర్ర

పుటుక్కున విరిగితే
గుండెలో గునపం దిగినట్టయింది.
బద్దలైన గుండె శకలాల్లో
అశ్రుకణాలు ఆవిరయ్యాయి
ఒంట్లో ఉన్న నాలుగు రక్తపు చుక్కలూ
కంట్లో నుండి బయటపడ్డాయి.
బృందావనం లాంటి ఆ గూడు కాస్తా
ఉప్పెన ముంచెత్తిన వల్లకాడైంది.

**(7 జూలై 2018న అమెరికాలో దుండగుడి కాల్పులకు బలైన వరంగల్ విద్యార్థి శరత్ కొప్పుల మృతికి నివాళిగా)** ◆

# అరవై ఆకాశాల విస్ఫోటనం



- ఎమ్వీ రామిరెడ్డి
9866777870

కవిత్వమొక తీరని దాహంగా జీవితాన్ని శ్వాసిస్తున్న వ్యక్తి దర్భశయనం శ్రీనివాసాచార్య. తన కవితలతో పుస్తకాలు ప్రచురించుకుని, నాలుగో అయిదో అవార్డులతో సంతృప్తి పడొచ్చు. కానీ అంతమాత్రాన కవితా వ్యవసాయం సారవంతం కాదని ఆయన ఉద్దేశం. అందుకే, ఏటా వెలువడే వేల కవితల్లోంచి ఆణిముత్యాలను వడగట్టి, కవిత్వం గొప్పతనాన్ని రేపటి తరానికి అందిస్తున్నారు.

మూడేళ్లుగా అన్నీ తానై, 'కవిత్వం' వార్షిక సంకలనాలను వెలువరిస్తున్నారు. ఆ సిరీస్‌లో భాగంగా వెలువడిందే 'కవిత్వం-2017'. పుస్తకం చేతికి అందగానే ఆసాంతం చదివాను. ప్రతి కవితా కదిలించింది. నా అభిప్రాయం నాలుగు ముక్కలు రాద్దామని మళ్లీ చదివాను. కొత్త లోతులు కనిపించాయి. కవితల్ని అంశాలవారీగా విభజించి, ఆ దృక్కోణాల్లోంచి చిన్న సమీక్షా వ్యాసం రాద్దామనుకున్నాను.

ఏ కవిత నుంచీ మొదలు పెట్టాలి? దేన్ని హైలైట్ చేయాలి? బాగున్న కవితలేవి? చాలా బాగున్న కవితలేవి? ఎంతకూ తేలని సందేహాల చిక్కుముళ్లు.

'ఫలానా కవిత స్థాయి తక్కువ లేదా ఎక్కువ అని చెప్పడానికి వీల్లేదు' అనే నిర్ణయానికి వచ్చాను. 'గరిటెడైనను చాలు'నని ప్రతి కవితనూ ఏదో ఒక రూపంలో స్పృశించడానికి శక్తివంచన లేకుండా ప్రయత్నించాను.

♦♦♦

'నీ దేవుడు పాడుగాను/ ఆని గుడి గుండంగాను, ఆని గుల్లె మన్నువడ/ నీ కులాలు కూలిపోను మతాలు మన్నుగాను' అంటూ జోగినీ వ్యవస్థపై జూపాక సుభద్ర సంధించిన అస్త్రం "జోలే.. తలరాతైన జోగమ్మను..".

అన్నమ్మెతుకు గురించి అఫ్సర్ రాసిన "నిర్వాణం"లో ఆకలి తాలూకు లోకాలే కాకుండా, లోపల ఇంకా యేమున్నాయో తెలుసుకోవాలంటే... కవితను బాగా జీర్ణం చేసుకోవాలి.

మృత్యువు కపటకాంక్షను ముందే పసిగట్టిన సినారె 'జీవితం రూప సహితం/ మృతి ఆకృతి రహితం' అంటూ అద్భుత నిర్వచనాన్ని మంచి కవిత రూపంలో మనకు మిగిల్చిపోయారు.

ఉద్యమాల త్యాగాల తడి ఆరని జ్ఞాపకాల కూడలి

"కూడవెల్లి"ని 'ఊరు ఊరంతా/ నీ అంచు మీద ఆరవేసిన/ ఆకుపచ్చ చీర'గా అభివర్ణిస్తారు కొండి మల్లారెడ్డి.

బెల్లి యాదయ్య "అట్లా... ఆ నది మీద" పద్యమనే పడవలో ప్రయాణిస్తూ శుభోదయాన్నీ, నిగూఢ సంగీతాన్నీ, వెన్నెలనీ, భజన బృందాలనీ గుర్తు చేసుకుంటూ 'నది పక్కన ఊరన్నా ఉండాలి/ ఊరు పక్కన నదైనా ఉండాలి' అని తీర్మానిస్తారు.

'తెగిపడిన వృత్తాలన్నీ/ ఒకటిగా చేరిన/ మహా వృత్తానికి' అమ్మను కేంద్రంగా చేసి 'వంటిల్లు'ను కొత్త కోణంలో కలగంటారు ఆకెళ్ల రవిప్రకాష్.

'మానవావతరణని/ ప్రత్యక్షంగా చూసిన చేపలున్నది' ఎందుకని నదులంత సముద్రాలంత తాత్విక విస్తృతితో ప్రశ్నిస్తారు దేవిప్రియ.

"గులాబీలు" గుదిగుచ్చి 'పూలమొక్కకు దాని రెక్కలకు/ విశాల ఉద్యానవనాన్ని ఎలా' నిర్మించాలో చెబుతారు అరసవిల్లి కృష్ణ. 'ఏదో ఒక రోజున/ కాలం తలుపుల్ని మూయక తప్పదు/ దేహం తన దీపాన్ని ఆర్పకా మానదు' అంటూ మనిషి "చివరాఖరికి" చేసే ప్రయాణం గురించి మృత్యుస్వరంతో హెచ్చరిస్తారు ఖాదర్ షరీఫ్.

'ఋతువు మారడం గమనించే తీరిక ఉంటే తప్ప/ వసంతం, శిశిరం అని కబుర్లు చెప్పకు' అంటూ మనం సమాధిలో ఉన్న సంగతి గుర్తు చేస్తారు నందకిషోర్. గుప్పెడు రంగేదో చల్లిపోయిన "హోళిని" జీవితానికి ఒడుపుగా అద్దిన చతురత 'సుపర్ణమహి'ది.

'వ్రాసే కొద్దీ పెరిగే బరువుని మోయడానికి కూడా మనసు సిద్ధపడాలి' కాబట్టి "రాధామనోహరాలు" పద్యాన్ని జీవన ఛందోబద్ధంగా వినిపిస్తారు ప్రసూన రవీంద్రన్.

'రక్తమాంసాలు ధారపోసే నేలబిడ్డ నెత్తి మీద/ రాబందులెందుకు వాలా'లని మిరప రైతుపక్షం వహించి ఘాటుగా ప్రశ్నిస్తారు పాపినేని శివశంకర్ "మిరప కోరులో".

వఝల శివకుమార్ "నవ్వులనది"లో మునకలేసి మనం కూడా 'ఒక్కసారి వాడి నీలాల కంటిపాపల్లో/ మన ప్రతిబింబాల్ని కడిగేసుకోవాలంతే'. ఇంత "చోటు" కోసం శిఖామణితో పాటు మనం కూడా గిరగిరా తిరుగుతాం.

అశోక్ అవారి "చివరి పాదం" పూర్తి చేసేసరికి మనలో చైతన్య స్వేదం ధార కడుతుంది.

'వెలుతురు లేసుల మాటున/ చీకటి చువ్వల చాటున/ అందమైన దేదయినా 'టచ్ మీ నాటే" అంటూ ఏ దృశ్యమూ అస్పృశ్యం కాదన్న నగ్నసత్యాన్ని పదునైన కవిత్వ గొంతుకతో ఘోషిస్తారు సతీష్ చందర్. రైతు ఆత్మహత్యను శక్తిమంతమైన శిల్పంతో ఆవిష్కరించిన కవిత బొల్లోజు బాబా రాసిన "ఒక దు:ఖానికి కొంచెం ముందు...".

'అగడు పడ్డట్టు వెలుగునదుక్కునే కంటిచిప్పల్ని మూలకు బోర్లించి' రవి వీరెల్లి కురిపించిన కవితా "వర్షం"లో తడిస్తే మన దేహాలు కాయితప్పడవలై లొంగిపోతాయి.

విజయ్ కోగంటి రాసిన "సగమే పూర్తయిన ఓ కవిత" 'మౌనమో మాటలో కన్నీరో నవ్వులో/ ఏదో లీలగా ఒక అలికిడి చేసన్తూ' మనల్ని అలజడికి గురి చేస్తుంది. 'రాళ్లకూ హృదయాలుంటాయి, అవి మాట్లాడతాయి' అని వైవిధ్య నిర్మాణంతో "దేజా వూ"ను పలికిస్తారు శ్రీకాంత్.

అడవి గాయపడి 'పచ్చదనం పోయి ఆకులన్నింటికీ/ వెచ్చటి రక్తం పులుముకుంటున్న' హృదయ విదారక దృశ్యాన్ని "నిరంతరం" కళ్లకు కడతారు వారాల ఆనంద్.

'బతుకువైపున్న కవి/ బతుకోసం పోరాడేవారి వైపు ఉండాలి/ అటువంటి వాళ్ల/ మరణాల్ని ప్రేమించాలి మరి' అని నెత్తుటితో తడుస్తున్న వార్తల్ని వరవరరావు "అడవి నెత్తావి"లో సుదీర్ఘంగా స్పృశించారు. పర్యావరణ స్పృహకు అద్దం పట్టిన పద్యం "కిటికీ పక్క ఆకాశం" (అనూరాధ నాదెళ్ల).

'పంటలు పండించడమే పరమ తపస్సు/ లోకుల ఆకలి తీర్చడమే "వ్యవసాయ శాస్త్రం"' (అన్నవరం దేవేందర్). "యుద్ధమంటే" 'ఆయుధాలనిచ్చి ప్రాణాల్ని తీసుకొని పర్సులో పెట్టుకునే/ చావులెక్కల వ్యాపారమే' (అరణ్యకృష్ణ). "ధర్నాచౌక్" అంటే 'గుడ్డల్నే కాదు గుండెల్నీ చీల్చుకు బయటపడే/ జనం గుండెల చప్పుడు!' (వడ్డెబోయిన శ్రీనివాస్).

'కావాలని సకలాన్ని ముకుళం/ చేసుకుంటున్న వట్టి పరికిపందల బలం' (సకలం ముకుళం) అంటూ ప్రశ్నించే తత్వాన్ని కోల్పోతున్న వ్యవస్థను తీవ్రంగా నిరసిస్తారు జూకంటి జగన్నాథం. కదలకుండా ఓ దారిలా పడున్న ఒక వాక్యం వలయాకారంలో వానలాంటి సంపూర్ణ తడిదనాన్ని సంతరించుకుని "మరో వాక్యం" దారిని మింగేసే నదిలా మారుతున్న దృశ్యాన్ని సత్యగోపి దర్శిస్తారు.

'అడవులు కూలుతూ చేసిన ఆర్తనాదాలు' మళ్లీ మొగ్గలేసి,

కలల విత్తనాలు మొలకెత్తి, "పూలు వికసించే వేళ"ను లోకం కోసం కవిత్వీకరించారు విమల. ఆకుపచ్చని గాలి, ఉదారంగు సూర్యుడు, ఉరికొయ్యలు, రక్తమలిన పద్యశిలలు, మలిన పెదవులు, మకిలి ఆత్మల మీదుగా "అనిశ్చితి"లో నరేష్ కుమార్ రాసిన పద్యం చివరికి మన ఊపిరికి సంకెళ్లు బిగిస్తుంది.

'బద్దకపు మధ్యాహ్నాలు నింపాది నీడల్లోకి వాలుతున్నప్పుడో/ నిదురించే ఆకుల మధ్య వెన్నెల విరిగిపడుతున్న సమయాల్లోనో' నిషిగంధ వినిపించిన "పాట ఒకటి..." నిస్సందేహంగా మన మనసుల మీద చెరగని ముద్ర వేస్తుంది.

వానాకాలం ఊరెళ్లి వర్షాన్ని ముందేసుకుని వరండాలో కూచుంటే 'వీధి మొగలో గేదె ఒకటి వొళ్లు విదిలిస్తే/ ఇంటి పక్క చెరువు/ కాస్త పక్కకు తప్పుకొనే' అద్భుత దృశ్యాలతో ప్రసాదమూర్తి "ఊరూ వానా" మనల్ని నిలువెల్లా తడిపేస్తుంది.

'నక్సల్బరి మరణించదు/ వొకటి కాదు వేల ప్రాణాలున్న వొక శరీరమది' అంటూ శ్రుతి, వివేక్, జార్జి, జంపాలల ఎన్‌కౌంటర్లను ప్రస్తావిస్తూ ఉద్యమాల ఆవశ్యకతను పునర్లిఖిస్తారు హెచ్చార్కె (అడవి వెన్నెల). బతుకులోని "పూలతనం" వెనక రహస్యాల్ని విప్పుతారు వేముగంటి మురళి.

పూలమొక్కలతో నాట్యం చేయించే, చదివి పక్కన పెట్టిన కవిత్వ పుస్తకాన్ని గబగబా తిరగేసే, వేణువులో దూరి సంగీతంలా బయటికొచ్చే "గాలి కళలు" వెంకటేష్ పైడికొండల రాసిన విభిన్న కవిత.

అద్భుత చిత్రకారుడు మోహన్‌ను "మహా చిత్రకార మానవుడు"గా దర్శిస్తూ సిద్ధార్థ రాసిన కవిత విశిష్టమైనది. గౌరీ లంకేష్ హత్యను నిరసిస్తూ 'ఒక చావు ఇన్ని గొంతులుగా/ నినదించడం కొత్త ఆశ కదా!' అంటారు కెక్యూబ్ వర్మ (ఇప్పుడు మొదలయ్యింది). ఇల్లు వాకిలి వదిలిపెట్టి, ఊరును మనుషుల్ని ఇడ్చిపెట్టి బతుకును వెతుక్కుంటూ పోయిన వలసపిట్ట మనసు పడే గుంజాటన "హోమ్ సిక్" (బండారి రాజ్‌కుమార్).

అక్షరాల మధ్య పెరిగిపోతున్న ఎడం, ఎక్కువవుతున్న ఆత్మస్తుతి, తప్పనిసరైన ఆత్మవంచన; వాక్యాల మధ్య మారిపోయిన వ్యాకరణం, వేరయిన వ్యవహారం, కొడిగడుతున్న ధైర్యవచనం కారణంగా ఇవాళ 'అక్షరాలెందుకో భయంతో విలవిలలాడుతున్నయి/ వాక్యాలెందుకో విదూషక వేషం విప్పనంటున్నాయి' అంటూ ''సామూహిక విదూషకత్వం''పై కన్నెర్ర జేస్తారు దేశరాజు.

ఇక్కడ పసిపిల్లలు నవ్వినప్పుడు ఆకాశానికవతల ఉన్న ఊరిలో పూలు పూస్తాయని, ఇప్పుడిక్కడ ఆనందబాష్పాలు ఆవిరైన కాలంలో అక్కడ దుర్భిక్షం రాజ్యమేలుతోందంటూ వైవిధ్యభరితమైన గొంతును వినిపిస్తారు భగవంతం (అంత దూరం ఎంత దగ్గర).

మహాసముద్రాలను మానవజాతి కన్నీళ్లుగా, మహాఖండాలను నరతోట మొండేలుగా వర్ణిస్తూ సిరికి స్వామినాయుడు రాసిన మంచి కవిత "చరిత్ర చీకటి తీరం మీద". 'నేలపైకి దిగేటప్పుడు/ రెక్కల్లో బొద్దింక దుమికినట్లు దిగాలుగా కూలిపోతాను/ చేతిలో మిగిలిపోయిన టిక్కెట్ ముక్కను/ చించి పోగులు పెడతాను' అంటారు తుల్లిమల్లి విల్సన్ సుధాకర్ (నిత్య లోకసంచారిని నేను).

"బైపాస్" 'అంటే ఏమీ లేదు/ నువ్వు లేనప్పుడు నీ శరీరాన్ని తెరవడం/ కాలిదారిని కత్తిరించి/ చెట్లు కూలిన రహదారికి అతికించడం'... తన అనుభవాన్ని అద్భుత పద్యంగా అలంకరించారు రమణజీవి. కోడి కూసింది మొదలు కాయకష్టం చేసి, కడుపు నింపుకోడానికే నానా తంటాలు పడే ఆడోళ్లకి 'ఏపీ టు బ్లీడంటేనూ, నో బ్రా డే అంటేనూ, అంతా మై సాయిస్ అంటేనూ/ అర్థమవ్వద్దా సెప్పండి' అంటూ బలమైన దళిత స్వరాన్ని వినిపించారు అరుణ గోగులమంద (నీడ్స్ వర్సెస్ ఛాయిస్).

ముత్యాలు వర్షించడం తెలిసిన ఆకాశం ఎప్పటికైనా తిరిగొచ్చి 'నీ దగ్గర దాచుకున్న నా కథ ఏది?' అనే ఆశకు అక్షరరూపం "ఆమె" (రేఖా జ్యోతి). రెండు హృదయాల మధ్య డిజిటల్ ఎడారులు విస్తరిస్తున్న వర్తమాన వైకల్యం "కలవని వేళలు" (ఎమ్వీ రామిరెడ్డి). ప్రశ్నల్ని కూల్చివేస్తున్న సందర్భంలో "నిశ్శబ్దంగానో, నిర్మాణంగానో"/ నా రక్తనాళాలను/ నేను పేనుకోకపోతే/ అంతే నిశ్శబ్దంగా/ అంతమైపోవాలి" అంటారు బాలసుధాకర మౌళి.

'దేహాలను తూట్లు పొడుస్తున్న/ ఆయుధాలను ప్రశ్నించినందుకు/ ఒక్క చేయి తప్ప తక్కిన దేహం అచేతనమైన' సాయిబాబా ఉత్తరంపై కోడూరి విజయకుమార్ రాసిన విలువైన కవిత "అచేతనం". "చాలాసార్లు" మనం నమ్మే, వినుగుల్ని మోసే, ముసుగుల్ని భరించే పాత చింతకాయల తొక్కు ఒలుస్తారు మోహన్ రుషి. మూసధోరణిని

# సాహిత్య ప్రస్థానం ఆగస్టు నెల పురస్కారాలు

| బతుకు తెరువు | రాయలసీమ అస్తిత్వ గాథ -శప్తభూమి | అజ్ఞాతవాసి |
|---|---|---|
| కథకు: రూ.700/- | వ్యాసం: రూ.500/- | కవితకు: రూ.500/- |
| రచయిత: గుళ్ళ తిరుపతి రావు | రచయిత: చెన్నా రామమూర్తి | రచయిత: బంగార్రాజు కంఠ |

■■■

*కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి*

■■■

*పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.*

**- ఎడిటర్**

ఛేదించుకుని, రొడ్డకొట్టుడు భావాల్ని తృణీకరించి, కొత్తదనంతో మత్తెక్కించేలా "నాకు ఇంత ఆశ్చర్యం కావాలి" అంటారు పూదూరి రాజిరెడ్డి.

పువ్వులాగా, చిన్నపిల్ల పాదాల్లాగా, హరితవనంలాగా ఉండాల్సిన ఉదయం మరుగుతున్న రక్తపు వాసన కొడుతున్న సందర్భాన్ని పదునైన ఆయుధంలా చెక్కారు కె.శివారెడ్డి (యివ్వాళ కూడా).

"పాత పద్యం" మీద తెలియని ఆపేక్షను ఆసక్తికరంగా వ్యక్తీకరించారు విన్నకోట రవిశంకర్.

'ఒక కన్ను చెమ్మతో/ ఒక కన్ను అగ్నితో/ తప్పలేదు' అంటూ "తెలంగాణ" పట్ల చెమ్మనూ అగ్నినీ వదులుకోరు దర్భశయనం శ్రీనివాసాచార్య. ఊరిని వదిలేసినా 'జీవితం మాత్రం అక్కడే పాతేసిన గుంజలా మిగుల్తుంది' కాబట్టే "ష్..!" గప్‌చుప్ అంటారు యాకూబ్. స్మృతితంత్రుల్ని మీటుతూ తలుక్కుమనే గతవర్తమానాల దృశ్యం నిఖిలేశ్వర్ "పల్కరించిన పాట".

ఇచ్ఛాప్రేయసిలాంటి, అన్నం పెట్టే అమ్మలాంటి చెరువును పదాల అలలతో బొమ్మ కట్టిస్తారు ఎన్.గోపి (చెరువు నా చిరునామా). చార్మినార్, మూసీనది, గోల్కొండ, శాలిబండ, బతుకమ్మ, బోనాల సాక్షిగా నగరం మీది ప్రేమను ఆశారాజు వర్ణిస్తారు (ముత్యాల నగరం).

'కొన్ని సీతాకోక చిలుకలు, తూనీగలూ/ ఒక పక్షి సమూహం'తో చిత్తలూరి తన కళ్లల్లో పెంచుకున్న కవితా పూలతోట "అతను-ఆమె-ఒక పూలతోట". 'తూట్లుపడ్డ కాలంలో/ తాను కాసిన స్వప్నాలన్నీ/ ఒడగట్టబడి'న దురదృష్టకర చిత్రం "గాయపడ్డ విత్తనం" (ఈ.రాఘవేంద్ర).

♦♦♦

ఇవాళ సమాజాన్ని కవి దర్శించే కోణం పదునెక్కింది. కొత్త కవులు బలమైన గొంతుక వినిపిస్తున్నారు. అనుభవజ్ఞులు సరికొత్త సామగ్రితో ప్రత్యేకతను చాటుకుంటున్నారు.

తన దృష్టికొచ్చే ఏ అంశాన్నీ తెలుగు కవి వదలడం లేదు. వర్తమాన సమస్యలు, మానవీయ సంబంధాలు, శాశ్వత విలువలు, సాంకేతిక దుష్ప్రభావాలు, రకరకాల ముసుగులు... అన్నిటినీ పదునుగా అక్షరీకరిస్తున్నారు. డొల్లతనాన్ని బట్టబయలు చేస్తున్నారు. చాలామంది కవులు మూసధోరణికి దూరం జరిగి, ప్రయోగాలు చేస్తున్నారు. వీటన్నిటి ప్రతిఫలనమే కవిత్వం 2017.

ఈ నేపథ్యంలో వేల కవితల్లోంచి సామాజిక చలనాలను ప్రతిబింబించే ప్రభావశీల పద్యాలను ఎన్నిక చేయడం అంత తేలికైన పనికాదు. ఆ పనిని నిర్వహించడంలో దర్భశయనం శక్తివంచన లేని విజయం సాధించారు. ఈ విజయం వచ్చే యేడు తెచ్చే సంకలనానికి మరింత బలాన్నిస్తుందని నా నమ్మకం. ♦

# కవిత

## నానీలు

- పాలపర్తి ధనరాజ్
9550593901



నీతి నిజాయితీ
కాలం చెల్లిన కాణీ
అవినీతి లంచం
కాకినాడ కాజా

పెళ్లా నాకా
నేనొప్పుకోను
సహజీవనమా
అయితే ఓకే!

స్వదేశీ సంస్కృతి
విదేశీ సంస్కృతి
రుబ్బితే
నేటి మన సంస్కృతి

పొరుగింటి
పుల్లకూర
అవతలి సేల్స్‌మాన్
చూపిస్తున్న చీరలు

మాటలవాదోడు
పెరిగింది
చేతల చేదోడు
తరిగింది

డ్రగ్గు పెగ్గు
పబ్బు క్లబ్బు
సెల్లో నెట్టు
టీనేజర్ల బ్రాడ్‌గేజీ

ఇడ్లీ సాంబారు
పెసరట్టు ఉప్మా
చపాతీ కుర్మ
మనమూ సెల్లూ

విదేశాల్లో
ఎదురయ్యే
వింత ప్రశ్న
మీదెన్నో పెళ్లి!

రోడ్ల రద్దీలో
అంబులెన్స్
కే లేదా
క్లియరెన్స్

అరేంజ్డ్ మ్యారేజీ
పాత చింతకాయ
లవ్ మ్యారేజీ
కొత్త ఆవకాయ

స్వంత ఫ్లాటు
యజమానైనా
అపార్ట్‌మెంటులో
అద్దెకున్న వాడి వెబ్బే!

బార్లలో
'బీర్'బలులు
రెస్టారెంట్లలో
'విస్కో'డిగామాలు!

---

## రాజ్యం

- గిరిప్రసాద్ చెలమల్లు
9493388201



అక్షరాలు
సిగ్గుపడంగ
విలువల
క్షవరం
రాలే కన్నీటిబొట్ల సాక్ష్యంగా

లుకలుకలు
రాజ్యం పోకడలో
క్షమ కానరాక
అరణ్యరోదనల వెల్లువ

ఆగమాగం
వనరుల అన్యాక్రాంతం
సగటు మనిషికి
దక్కని ఫలం
ఎదుర్కొంటే
బొక్కలిరగొట్టి
ద్రోహి బిరుదు

ఆకలి
రుచెరుగక
తునకలు దండెంపై నుండి
కడాయిలో పడంగానే
సుయ్యిమంటే
భక్తుల వీరంగం
ఒళ్ళు పొట్టుపొట్టు
కుళ్ళబొడిచే

మనసొమ్ము
పరాయి బ్యాంకులల్ల
కనీసనిల్వ
లేని ఖాతాలల్ల రుసుం
ఎగవేత బొక్కసం పూడ్చే
అర్థశాస్త్ర నీతి
నల్లధనం
తెల్లగా హద్దులుదాటొచ్చే

వడ్డించేటోడు మనోడైతే
యాదున్నా బియ్య కంచంల

లఘుకోణం గురుకోణం
లంబకోణం
ఎరుక
కుంభకోణం విమానాల
ప్రక్షేపక
శాస్త్రాన్వేషణలో
కొసమెరుపు

దైవం మూలం
మనిషి భయం
సొమ్ముచేసుకునే హక్కుదారులకి
ఊతం
చట్టం చుట్టం

అరాచకం ఆధ్యాత్మికత
ముసుగు
తేటతెల్లం
అడ్డమో నిలువో
బొట్లు
శీలమో మానమో పేరేదైనా
దోపిడి స్థూలంగా

మనదే
మనకోసమే
మనచే పరిఢవిల్లే
ప్రజాస్వామ్యం
వాడిదే వాడికోసమే వాడిచే
కనుసైగల్లో
రాజ్యం నడక
నడత తప్పి
వికటాట్టహాసం






# అణచివేతపై ధిక్కార రంగస్థలం

- అనిల్ డ్యాని
9703336688

"తూర్పు తూర్పే పడమర పడమరే" ఆ రెండు ఎన్నటికి కలవవు" అంటాడో ఆంగ్లకవి. అతి ప్రాచీన నాగరికత కలిగిన దేశాల్లో భారతదేశం ఒకటి. అనేక కులాలు, మతాలు, దశాబ్దానికో సిద్దాంతం ఈ నేల మీద పురుడు పోసుకున్నాయి. ఎన్నో యేళ్లుగా భారతదేశం వర్ణవివక్ష అనే ఒక వాస్తవాన్ని మోస్తూ బతుకుతోంది. రాజ్యాంగం రాక ముందు వందేళ్ల వెనక్కి వెళితే ఆంగ్లేయుల ఇనపనాడాల కింద దేశం నలిగిపోతున్న రోజుల్లో ప్రజల్లో ఉత్తేజం నింపడానికి ఒక ఐకమత్యం తేవడానికి మాట, పాట ఎంతగానో ఉపయోగపడ్డాయి. అప్పటికి ముఖానికి రంగు అప్లయ్ చేసుకొని నటించే సాంప్రదాయం లేదు కాబట్టి వారంతా తమ తమ నిజమైన స్వరూపాలతోనే, రాజప్రసాదాల్లోనూ, కచేరీల్లోనూ, చానళ్లలోనూ తమ ప్రదర్శనలు ఇచ్చేవారు. క్రమంగా ఇలా చేసే వారందరని సమాజం అంటరాని వారుగా చూసింది. వీరంతా పైకి మాత్రమే కళాకారులు, ఆకలి తీరని పంచములు. సూతులు.

*"బ్రహ్మణోస్యముఖమాసీత్*

*బాహూరాజ్యన్యకృత:*

*ఊరు తిదశ్య యద్వైశ్య:*

*పదా భ్యామ్ శుద్రా అజాయత:"*

ఇది భారతదేశ ప్రధాన రిజర్వేషన్. సూత తరాల నుంచి అంతరాలని పెంచడానికి దోహదపడిన రుగ్వేద సూత్రం. అనాదిగా బ్రహ్మ తల నుంచి జనించిన బ్రాహ్మలు చదువు పరమైన అంశాలన్నింటిని వారే తమ అధీనంలోకి తీసుకొని, వర్ణాల వ్యవస్థని ఆధారంగా చేసుకొని శూద్రులని అంటరానివారుగా చేసింది. ఆనాటి కులవ్యవస్థ రాచరిక వ్యవస్థ నుంచి బ్రాహ్మణులు భగవంతులకి ప్రతినిధులుగా నియమించప బడినామని చెప్పుకున్నారు. ఎలాగూ ఆ తరువాత రెండు వర్ణాలు కాస్త ఆర్థికంగా నిలదొక్కుకున్నవారే కాబట్టి సామాన్యంగా అధికారానికి దగ్గరగా ఉంటారు. ఇంక నాల్గోవర్ణం ఆది నుండి అలాగే అణచివేతకి గురై అటు సామాజికంగా, ఆర్థికంగా ఎటూ ఎదగలేక ఒక నిస్తేజమైన సందర్భంలో చాలా మంది శూద్రులు, చేతివృత్తులని ఆశ్రయించారు, రానురానూ వారు ఉత్పత్తిని పెంచి ఆర్థికంగా సమాజాన్ని పరిపుష్టం చేశారు.

ఈ క్రమంలో రోజంతా కష్టపడి సాయంత్రానికి శరీరాన్ని మెదడుని చల్లబరచ డానికి శూద్రవర్ణ ప్రజలు తమకి తెల్సిన కథల్ని, సంఘటనలని పాటల రూపంలో పాడుకునేవారు. అలా చాలా గ్రామాల్లో అనేక నాటక సమాజాలు వెలిశాయి. నిజానికి ఈ చర్య ఈ నాటిది కాదు. పురాణాలన్నీ బట్టీయం వేసిన "సూతుడు". దాన్ని కథలు కథలుగా ప్రచారం చేశాడు. అయితే శూద్రుడికి ఆ రోజుల్లో వేదాన్ని, లేదా పురాణాలని చదివే ఆస్కారం లేనప్పటికీ కొంత మంది ఆనాడే ఒక విప్లవ చర్యగా దీన్ని సాధన చేశారు. ఆ తరువాత అందులోని చాలా అంశాలు నాటకాలుగా హరికథలుగా, బుఱ్ఱకథలుగా ప్రాచుర్యంలోకి వచ్చాయి. నిజానికి వీటన్నిటి వెనుక శూద్రుల పాత్ర అనన్య సామాన్యం. ఏవైతే ఇక్కడ భారతీయ సంగీత పరికరాల్ని జంతు చర్మాలతో శూద్రులే తయారు చేసుకుని సాధన చేసుకునే వారు. ఆ రకంగా వారు సంగీతానికి ఎనలేని ఆస్తిని సమకూర్చారని చెప్పవచ్చు.

నిజానికి శూద్రులు రంగస్థలం మీద తమ కథలే చెప్పుకున్నారు. అరుంధతి కథ, జాంబవంతుని కథ, రాముడి చేతిలో కూలిన రావణకథ, శంభుకునివధ వంటి వంచితుల గాథల్ని పాడుతున్నారు. కానీ రానురాను సమాజంలో వింతపోకడలు వచ్చి నాటకరంగాన్ని ఆక్రమించిన మరికొంత మంది పెద్దలు ఆయా కథలకు సమూల మార్పులు చేసి మరలా ప్రదర్శించడం వలన అణగారిన ప్రజలు, వారి తాలూకా యోధుల కథలు వెలుగులోకి రాలేదు, ఇదొక అన్యాయమైన వివక్ష. రాజ్యాంగం వచ్చిన తరువాత మనుధర్మ శాస్త్రం అమలు పూర్తిగా కాకపోయినా పాక్షికంగా తగ్గింది. అయితే చాలా కాలం వరకూ శంకరుని ఢమరుకం నుంచి ఉద్భవించిన అక్షరాలు నేర్చుకోవడానికే దళితులకు చాలా యేళ్ళు పట్టింది.

నేటికీ నిలిచి ఉన్న ఒక ఉత్తమమైన మాట "కావ్యేషు నాటకం రమ్యం" అంటే కావ్యాలన్నింటిలో అనగా సాహిత్య ప్రక్రియల్లో నాటకం చాలా ఉత్తమమైనది అని ఈ రచయిత తన సిద్ధాంత వ్యాసంలో ఏమి చెబుతున్నారో ఒక్కసారి చూద్దాం.

*"ఎనలేని భారతీయ సంస్కృతికి, దాని ఔన్నత్యాన్ని, ఆధ్యాత్మిక భావ సంపదను గౌరవిస్తూనే కుల వ్యవస్థ ద్వారా సమాజంలో పేరుకుపోయిన అసమానతలను ఎత్తిచూపుతూ వాటిని సరిదిద్దడం కోసం రంగస్థలం ఉద్యమం కొనసాగిస్తుంది.*

*శాస్త్ర విజ్ఞానాలు వెలుగు ప్రసరిస్తుం డగానే ఆ వెలుగులోని ఆధ్యాత్మిక అరాచకం ఒకవైపు, రాజకీయ విధ్వంసం మరొక వైపు సమాజాన్ని కుదిపేస్తున్న ఈ తరుణంలో సూత రంగస్థలి ఈ విషయం పట్ల ప్రజల్ని చైతన్య పరుస్తుంది.*

*కులతత్వం భావజాలం నివురుకప్పిన నిప్పులా, వెలుగును ఆవరించిన మబ్బులా వ్యాపిస్తోంది. రిజర్వేషన్ సదుపాయాల మీద అగ్రవర్ణాల సమీకృత దాడిని తద్వారా జరగబోయే పరిణామాల్ని అందుకు నివారణా మార్గాల్ని అన్వేషిస్తుంది.*

*శూద్ర, అతిశూద్ర వృత్తులు, కళల వెనుక దాగిన కళాత్మక విలువల విశేషాల్ని వెలికితీసి, వాటి సాంస్కృతిక పునాదులను తాత్విక ఔన్నత్యాన్ని విశదపరుస్తూ, కొత్త కళాచేతుల్ని "సూతరంగస్థలి" నిర్మిస్తుంది.*

*సూతరంగస్థలి పేద, బలహీన వర్గా లకు బాసటగా నిలుస్తుంది. తరాల సామాజిక విషవలయ చట్రంలో చిక్కుకుని చారిత్రక పేదరికం అనుభవిస్తున్న వారి పక్షాన పోరాడు తుంది."*

ఇలా అనేకానేక ప్రతిపాదనల్లో ఒక కళతో కూడిన సమాజాన్ని సూతరంగస్థలం ఆశిస్తుంది. అయితే ఇందు కోసం ఇంతకు ముందు నుంచి కృషిసలుపుతున్న వారిని మనం విశేషంగా గుర్తు చేసుకోవాలి, గబ్బిలం రాసిన జాషువా నుంచి కొత్త గబ్బిలం రాసిన ఎండ్లూరి సుధాకర్ వంటి నవతరం కవులని" అలాగే శూద్ర కులాల కోసం పనిచేసిన అనేక మంది నాయకులను పెరియార్ కరుణానిధి, త్రిపురనేని రామస్వామి వంటి హేతువాద, ద్రావిడ సిద్ధాంత కర్తలను మనం స్మరించాలి. అందుకు సూత రంగస్థలం వేదిక కావాలి. ఎప్పుడో కొలకలూరి ఇనాక్‌గారు నాటకంగా మార్చబడిన మునివాహన సేవ, నేటికి రూపాంతరం చెంది వాస్తవ రూపం దాల్చింది. అయితే అంతటితే ఆగిపోతే కష్టం ఏనాటి నుంచే అంటుకుని ఉన్న జాడ్యం పోవాలంటే శూద్రవర్ణాలన్నీ ఒక్కటి కావాలి.

రచయిత ఒకచోట అన్నట్లుగా నాలుగు వర్ణాలలో పై మూడూ ఎప్పుడు కావాలంటే అప్పుడు ఒకటి కాగలవుగానీ శూద్రులు కావాలంటే మనుధర్మం ఒప్పుకోదు. నిప్పు రాజేస్తుంది. రాకాసి మంట పెడుతుంది. ఉత్పత్తి కులాల

# కవిత

# హెచ్చరిక

- తేళ్లపురి సుధీర్ కుమార్
9885632727



పురుడు పోసుకున్న పుడమి పైనే
గుప్పెడు మెతుకులు కరువౌతున్నప్పుడు
మట్టితల్లినే నమ్ముకున్న బతుకులు
చివరకు ఆ మట్టిలోనే కలసి పోతున్నప్పుడు
జన్మనిచ్చిన నేలమీదే జానెడు పొట్టకూడా నింపుకోలేని
దౌర్భాగ్య పరిస్థితి దాపురించినప్పుడు
అందరికీ అన్నంపెట్టే రైతన్నకు ఆత్మహత్యే దిక్కవుతోంది -

కదలిపోతున్న మేఘాన్ని ఆపలేక
దిగులు నిండిన కళ్లతో నిసహాయంగా నింగికేసి చూస్తాడు
-
వరుణుడు కరుణించి వారిధారై దిగిరాగానే
దాహార్తితో పరితపిస్తున్న నేలమ్మ గొంతు తడవగానే
పాలు తాగిన పసిపాప కేరింతలు చూసి
తనివితీరా మురిసిపోయే కన్నతల్లిలా
పట్టలేని సంతోషంతో పరవశించి పోతాడు -
ఆకలిని సైతం అవతలికి నెట్టి
నాట్యమాడుతూ నాగలివైపు అడుగులు వేస్తాడు -

నేలతల్లి కాయానికి అరకతో గాయం అవుతోందని తెలిసినా
పచ్చటి పైరుపాప నవ్వులకోసమే కదా అని
తనను తానే అనునయించుకుంటాడు -
రత్నాల్లా మెరుస్తున్న విత్తనాలను
పొలమంతా చల్లుతూ తన్మయత్వం చెందుతాడు -
చిగురించిన మొక్కల్లోని చిరునవ్వులు చూసి
ఆకలి దప్పులుకూడా మరచిపోయి
ఆప్యాయంగా ముద్దాడుతూ ఉండిపోతాడు -

గుక్కపట్టి రోదిస్తున్న కన్నబిడ్డకన్నా
చీడపట్టి పీడిస్తున్న పంటను చూడగానే
అర్థంకాని ఆవేదనతో అశ్రుధారై ప్రవహిస్తాడు -
కోతకొచ్చిన పంటను రక్షించుకోడానికై
దేశ సరిహద్దుల్లో పహారా కాస్తున్న సైనికుడిలా
అలసత్వం దరిచేరనీక అహర్నిశలూ కాపలా కాస్తాడు -

కష్టాలన్నీ దాటుకొని - చేతికొచ్చిన పంటను అమ్మడానికి
సిద్ధమైతే
గిట్టుబాటు ధర లేదని ఒక్కమాటలో తేల్చేస్తే
ఆలిసూత్రాలు బ్యాంకు లాకర్లో దూరిపోయి
పీకలదాకా అప్పుల ఊబిలో కూరుకుపోయి
కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్న రైతన్న
ఇంకేం చేస్తాడు ?

దర్జాగా బతుకుతున్న వారి బతుకులమీద ఉమ్మేసి
చేనుగట్టుమీద చెట్టుకు నిర్జీవంగా వేలాడుతూ కనిపిస్తాడు -

దుక్కిదున్నే రైతన్నే లేకపోతే
అన్నం పెట్టే దిక్కులేక చస్తారని హెచ్చరిస్తూ! ◆

---

మూలాలను దెబ్బగొట్టి సాంకేతికతను సాయం తెచ్చుకుంటుంది. నిజానికి ఇది సంధి సమయం. ఓటమి భయపెడుతున్నా ఎక్కుపెట్టి విడిచిన శరంలాగా దూసుకుపోవడమే. అందుకు సూత రంగస్థలం ఒక వేదిక కావాలి.

ఒక అత్యున్నత స్థాయిలో ఉన్న అధికారి క్షణం తీరిక లేకుండా ఉన్న కళాకారుని అంతర్మ..నం ఈ సిద్ధాంతం. ..ధారణంగా ఉద్యోగం రాగానే అమ్మయ్య చాలని విశ్రాంతి కోసం ఆలోచించకుండా నవ్యాంధ్రప్రదేశ్‌లో కళని సజీవంగా బతికించడానికి కృషి సలుపుతున్న వ్యక్తి సాంస్కృతిక శాఖా సంచాలకులు, నాటక కర్త డాక్టర్ దీర్ఘాసి విజయ్‌భాస్కర్ గారు. ఇలాంటి ఒక చర్చ చేయడానికి చదువు ఒక్కటే అర్హత చాలదు. దానికి అవసరమైన ధైర్యం కావాలి. అణగారిపోతున్న ప్రజలపట్ల, వారి చైతన్యం పట్ల తపన ఉండాలి. అలాంటి వ్యక్తులకే ఇలాంటి ఆలోచలు వస్తాయి. మార్పును తన ఇంటి నుంచి ఆశించే వ్యక్తి కాబట్టే ఈ పుస్తకాన్ని తానే ముందుగా తెచ్చి ఒక సూత్రీకరణ చేశారు. ఈ సూత్రం కాలగమనంలో భారతదేశ యవనిక మీద చైతన్య కళా కుసుమాలు విరబూయాలని మన:పూర్వకంగా కోరుకుందాం. ◆

## కవిత

## జ్ఞాపకాలు

- శ్రీదేవి సురేష్ కుసుమంచి
7032760484

అవి ఏ పుట్ట తేనేతో
లిఖించబడిన జ్ఞాపకాలో గాని
నా మనసున తడిమినప్పుడల్లా
నా కష్టాలు సృష్టించిన కన్నీళ్ళు
క్షణములో...
చల్లగాలికి ఆరిన స్వేదంలా
మాయమైపోతాయి.,
బహుశ అవి నవనీతంలా
కరిగిపోయే
నా బాల్యపు జ్ఞాపకాలనుకుంటాను!

ప్రకృతి ఎంత చమత్కారో గాని
కనురెప్పల సయ్యాటలతోనే
గతాన్ని నెమరేయిస్తుంది!



నిజంగా ఆ బాల్యపు
గురుతులు నేటికి
నా మనసును తాకినప్పుడల్లా
మాయమర్మమెరగని
ఓ అద్భుతలోకంలో
ఓ స్వేచ్ఛావిహంగాన్నై
ఎగిరినట్టునిపిస్తుంది!

కాని నేటి తరానికి
ఆ గురుతులు అన్నీ
ఆధునికరణానికి
బంధీ అయి...
మనసుని తాకని
యంత్రముద్రలై
ఆ క్షణానే డిలీట్
అవుతున్నట్టున్నాయి
విలువలు మరుపుతో!

---

## బ్రతుకు ఎజెండా

- కాట్రాజు లావణ్యసైదీశ్వర్
9848763293

యుద్ధం ఆపేందుకు ఇప్పుడు
ఎవరూ సిద్ధంగా లేరు
ఇన్నాళ్ళుగా ఉప్పుకయ్యల్లో చిక్కుకుపోయిన
చెకుముకి చూపుల నుండి ఇప్పుడిప్పుడే
నిప్పురవ్వలు రాజుకుంటున్నాయి..

చిరిగిన విస్తర్లలోంచి  ఏరుకున్న
ఆ మెతుకులే వడిసెల రాళ్ళై వడిగా
గురిచూసుకుంటున్నాయి..
గుక్కెడు దాహం కోసం మోచేతుల కిందే
ఉడిగిన వెన్నులకు ఎండిన డొక్కల్లోని
పేగులిప్పుడు పేనుకుంటున్నాయి..
ఇప్పుడిక యుద్ధం ఆపడం అసాధ్యం..



ఇంతకాలం కమిలిన గాయాలతో
కడుపునింపుకుంటూ
నీడలను నిదురపుచ్చి,
చీకటి రాస్తాల్లో ఒకే ఒక్క వెలుగు రేఖ కోసం
సరిహద్దుల వెంబడి కావలి కాస్తూనేవున్నాం..
ఇప్పుడిప్పుడే మూగబోయిన గొంతుల నుండి
బెదరని బందూకుల తూటాలు పేలుతున్నాయి..

లొంగని ఆగ్రహం చూపుడువేలై
దారి చూపెడుతుంది..
బేరసారాలిప్పుడు కాలం చెల్లిన పోకడలు..
ఏరులై పారేందుకే సిద్ధపడ్డ నెత్తుటిముద్దలతో
ఇప్పుడిక్కడ యుద్ధం అనివార్యం..
ఈ ఎజెండా మార్చడం ఇక అసాధ్యం...

# భారతీయ సాంస్కృతిక వైవిధ్యం - సవాళ్ళు



- తెలకపల్లి రవి

భారతదేశంలో సాంస్కృతిక వైవిధ్యం – సవాళ్ళు– ఈ రెండూ చాలా విస్తృతమైనవి. భారతదేశంలో ఉన్న సాంస్కృతిక వైవిధ్యాన్ని, భిన్నత్వాన్ని చెప్పాలంటే వింధ్య హిమాచల యమునా గంగా ఉత్సల జలధితరంగ పంజాబ సింధు, గుజరాత, మరాఠ, ద్రావిడ, ఉత్కళవంగ ఇన్ని భాషలున్న ఈ దేశానికి ఒక్క బెంగాలి గీతాన్ని జాతీయ గీతంగా పెట్టుకోవడంలోనే ఈ దేశం యొక్క సాంస్కృతిక ఔన్నత్యం, వైవిధ్యం కనపడుతుంది మనకు. అనుకోకుండా బెంగాలి కవి వ్రాసిన గీతాన్నే బంగ్లాదేశ్‌కు కూడా వారు జాతీయ గీతంగా పెట్టుకున్నారు. ప్రపంచంలో రెండు దేశాలకు జాతీయ గీతాన్ని రాసిన ఒకే ఒక కవి భారతదేశంలో ఉండటం కూడా యాదృశ్చికం కాదు. అందుకనే భారతదేశం ఒక దేశం కాదిది ఒక ఉపఖండం అన్నారు. ఆ సేతు హిమాచలం అంటే అపారమైన వైవిధ్యానికిది నిలయం.

భారతదేశమనేది భిన్నత్వంలో ఏకత్వంగా మనం చూస్తా ఉన్నాం. ఏకత్వంలో భిన్నత్వం మనం చూస్తామా అనేది ఇక్కడ ప్రశ్న. భిన్నత్వంలో ఏకత్వం అనే మాటకి ప్రాధాన్యత ఇచ్చేట్లయితే అన్ని కలిసిపోయే దానికి మనం ప్రాధాన్యత ఇవ్వాలి. ఏకత్వంలో భిన్నత్వం అంటే అది ఇంకొకటి. నా దేశం భగవద్గీత, నా దేశం అగ్ని పునీత సీత, నా దేశం కరుణాంతరంగ, నా దేశం తరంగరంగ గంగా అని నారాయణరెడ్డి అన్నారు. మనది భారతదేశమమ్మ, మనది భారతభూమి తల్లి, బాదరాయణ ఆదిరుషులకు పాదుకొమ్మది చెల్లి అని ఇంకొకాయన అన్నాడు. తక్షశిలా పాటలీపుత్రం హరప్పా, మొహంజదారో రోమాన్యాది బహిర్ముఖాల్లో, చారిత్రకసంధ్యా మానసిక వికాస మెట్టిదని ఒకాయన ప్రశ్నించాడు. సారే జహాసే అచ్చా హిందూ సితారాహమారా ఎందుకన్నాం మనం. ఎందుకన్నా మంటే తోటలో పూలలాగా ఈ దేశంలో రకరకాలైనటువంటి జీవ వైవిధ్యం, పర్యావరణ వైవిధ్యం, మానవ వైవిధ్యం, సాంస్కృతిక వైవిధ్యం, సాంప్రదాయ వైవిధ్యం ఉన్నాయి. ఇంత వైవిధ్యం ఉన్న దేశం మరొకటి లేదు. ఇంకెక్కడో లేదు. లేదు కాబట్టి మనది భారతదేశం అని సగర్వంగా చెప్పుకుంటున్నాం. ఈ దేశంలో కాస్త – అరకు లోయలోకి వెళ్తే ఇప్పటికి కూడా ఆదివాసి సంస్కృతి మనకు కనిపిస్తుంది. ఆదివాసులలో వనవాసులనే వారి సంస్కృతి కూడా మనకు కనిపిస్తుంది. అక్కడ్నుంచి ఇక్కడకు వస్తే విశాఖపట్నంలో చంచల సంస్కృతి కూడా మనకు కనిపిస్తుంది. కాబట్టి మనం అపారమైన ఈ భారత పరంపరను మనం ఎప్పటికి ఒకే దేశం

ఒకే ప్రజ, ఒకే పార్టీ, ఒకే మోడి అంటే కుదరదు. ఈ దేశం చాలా పెద్ద దేశం. ఈ పెద్ద దేశాన్ని మొత్తం కూడా ఒక్క ముక్కలో నిర్వచించగలిగిన వాళ్ళు, ఒక్క ముక్కలో చెప్ప కలిగిన వాళ్ళు లేరు. అందుకనే ఈ వైవిధ్యాన్ని గుర్తించకలగడం మొదటగా మనకు అవసరం.

మనది వేదభూమి. వేదాల్లో కూడా ముందు భాగాలున్నాయి కదా. వేదాల్లో సంహితలున్నాయి. వేదాల్లో అరణ్యకాలున్నాయి. వేదాల్లో ఖర్మ కాండుంది, ఒక మంత్ర కాండ ఉంది. లోకం దైవాదీనం, దైవం మంత్రా ధీనం, మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణా మమ దేవతాయహా! ఇది ఒక మంత్రం. ఇది మన సంస్కృతి. ఇక్కడ సమస్య బ్రాహ్మణ్యకాలు. బ్రాహ్మణులది కాదిది. కాని ఒకే దేశం, ఒకే ప్రజ అనడంలో దానర్థం అదే. ఒకే మతం అని ఒకే దేశం ఒకే ఏంటీ ఒక దేశం ఒకే ప్రజ అంటే ఒకే మతమని. హిందువుగా జీవించు, హిందువుగా గర్వించు. గర్వించితే గర్వించు కాని ప్రక్క వాడిని ఎందుకు నిందిస్తున్నాం అనేది ప్రశ్న. ఇప్పుడు ఎప్పుడైతె మన సంస్కృతి గొప్పది. మన అభిమానం గొప్పది అనే దానితో ఆగకుండా అభిమానం దురభిమానంగా మారుతుందో అది దుష్పరిణామాలకు దారి తీస్తుంది. అందుకని ఇక్కడ ప్రభుత్వాలు, పార్టీలు, సంస్థలు మాత్రమే కాకుండా మొత్తం భారతీయ పౌర సమాజం తన మూలాల గురించి, తన ఉనికిని గురించి ఆలోచించుకోవాల్సిన ఒక విపత్కర పరిస్థితికి మనం వచ్చాము. మొన్నీ మధ్య చాలా చర్చ జరిగింది. కత్తి మహేష్ గారు, పరిపూర్ణానంద స్వాముల వివాదం గురించిందంతా ఇప్పుడు నేనా చర్చలోకి పోను. కాని ఆ సందర్భంగా నాకో వీడియో పంపించారు. ఆ వీడియోలో ఏముందంటే రోజు పొద్దున్నే లేచి చెపుతుంటారు పెద్దగా ఈ చాగంటి కోటేశ్వరరావు గారు, గరికిపాటి నరసింహారావు గారు, చినజియ్యర్ స్వామి గారు వీరంతా ఎక్కడికి పోయారు. రాముడు మీద ఇంత దాడి జరుగుతుంటే అని ప్రశ్నిస్తున్నారు. వాళ్ళను కూడా ఈ ఎలిమినేషన్ ప్రాసెస్, డామినేషన్ ప్రాసెస్ ఒకసారి మొదలైన తర్వాత అది ఒకచోట ఆగదు. అది మనమిప్పుడు చూస్తున్నాం. భారత రాజ్యాంగ విలువలను ఊచకోత కోస్తున్నటువంటి సందర్భం. భారతీయ సంస్కృతి యొక్క మూలాలను సవాల్ చేస్తున్నటువంటి సమయం ఇది.

ఏమిటీ భారతదేశం యొక్క మూలాలు. గ్రీకు డెమోక్రసి గురించి అందరూ చెప్తుంటారు. కాని గ్రీసులో డెమోక్రసి రాకముందే ఇస్లామిక్ పరిపాలనలో ప్రజాస్వామ్యం పరిఢవిల్లిన దశ ఉంది. మీరు చూడండి బెజ్జోని కొండ కెళ్ళండి. బౌద్ధ ఆరామాన్ని చూడండి. అక్కడ మధ్యలో గురువు కూర్చుని ఉంటాడు. చుట్టూ పీఠాలు ఉంటాయి. బౌద్ధారామాల్లో ప్రజాస్వామ్యం సంస్కృతి వర్ధిల్లిందని మనకు చరిత్ర చెపుతూ వుంది. అహింస గాంధీగారు చెప్పడాని కంటే చాలా కాలం క్రిందటే జైనులు చెప్పారని చరిత్ర చెపుతూ వుంది. అందుకని భారతదేశమంటేనే ఒకే మతం ఒకే ఇది అనే ముందు ఈ చరిత్రని ఎవరి కిద్దాం మనం? చరిత్ర 2014 జూన్ 6వ తేదీన మోడీ ప్రమాణస్వీకారంతో మొదలుపెడదామా లేదే! దానికంటే ముందు చరిత్ర ఉంది కదా! కాబట్టి మిత్రులారా ఈ భారతదేశం యొక్క సుదీర్ఘ సంస్కృతిని గమనించినపుడు ఈ దేశంలో జైనులు, బౌద్ధులు ఉన్నారు. శమనులన్నారు. వారిని బ్రాహ్మణుల మతమన్నారు. హిందూ మతం అనలా. అందుకనే హిందూ మతం అనే దానిలో కూడా మూడు దశలున్నాయి. వైదిక దశ, బ్రాహ్మణదశ, హిందూమత దశ. హిందూమత దశ అనేది బౌద్ధమతం తర్వాత వచ్చింది. బౌద్ధమతం వచ్చిన తర్వాత వీళ్ళనందరిని ఆకర్షిస్తున్నారే మన మతం ఏమయిపోతుందని శంకరాచార్య బయల్దేరారు. బయల్దేరితే అప్పుడు ఎందుకు బౌద్ధమతం ఆకర్షిస్తుందంటే బౌద్ధమతం కొంచెం ఆమ్ ఆద్మీ పార్టీలాగుంది. సామాన్యులందర్నీ కలుపుకుంటుంది. వీళ్ళు ఎవర్నయినా గాని చేర్చుకుంటున్నారు. కాబట్టి మనం కూడా ఇలా చేస్తే కాని కుదరదు. అప్పటివరకు ఏంటీ శూద్రులు పూజ చేయకూడదు. శూద్రుడు ఇంట్లో విగ్రహాలు పెట్టుకోకూడదు. గుళ్ళు లేవు. అంతకుముందు మనకు బౌద్ధమతం వికసించి తర్వాత కాస్త దెబ్బ తింది. బౌద్ధమతం ఎందుకు వికసించింది. బౌద్ధమతం దేశ సరిహద్దులు దాటి వెళ్ళింది. మనం బౌద్ధమతం కాదు బోడి మతం అనుకుంటున్నాం. కాని శ్రీలంకలో బౌద్ధమతం ఉంది. చైనాలో వుంది. ఇంకా కొన్ని దేశాలలో కొద్దో గొప్పో బౌద్ధమతం ఉంది. ఇప్పటికి కూడా ప్రపంచంలో వున్న ప్రవక్తల్లో మొట్టమొదటివాడుగా బుద్ధుడు పరిగణించబడుతున్నాడు. బుద్ధుడు చెప్పినటువంటి వివరణ దాదాపు ఊహాజనితం – సోషలిజంకు చాల దగ్గరగా ఉంది. ఏమని చెప్పాడాయన. ఒకప్పుడు మనుషులందరూ సమానంగా ఉండేవాళ్ళు. ఈ సమానంగా ఉండే మనుషుళ్ళో కొంతమంది నెమ్మదిగా ఆస్తిపాస్తులు సంపాదించుకున్నాక ఇతరులను పీడించడం మొదలు పెట్టారు. ఆ విధంగా ఇవన్ని వచ్చాయి అని ఒకమాట

చెప్పాడు బుద్ధుడు. అదే తర్వాత దాటి వచ్చిన వారు ఏమి చెప్పారంటే సురులకు అసురులకు మధ్యలో యుద్ధం జరిగింది అసురుల నుండి కాపాడమని వేడుకుంటే ప్రజాపతి బ్రహ్మ రాజుని నియమించాడు అని. బుద్ధుడు చెప్పిన ప్రకారం రాజు ఎన్నుకోబడతాడు. రాజు కొడుకు మరలా వస్తాడు. ముఖ్యమంత్రి వస్తాడు, ముఖ్యమంత్రి కొడుకు మరలా ఎన్నుకోబడతాడు. ఈ పరంపర ఈ వంశపారంపర్యకు, రాచరికానికి పునాదులు హిందూ మతంగా మారిన తర్వాత వచ్చాయని చరిత్రలో చూస్తే మనకు తెలుస్తుంది. అసలు మత చాందసాన్ని ప్రశ్నించే - అనలు దేవుడున్నాడా? మీరు నేను కాదు. కలడు కలండనువాడు అసలు కలడో లేడో అని పోతనే ప్రశ్నించాడు. ఇప్పుడు పోతన్నను వెళ్ళి కొడతారా సంఘ పరివార్ వాళ్ళు నా కర్థం కాదు.

కనకంబు గృహిణీ లేదనగానే కదలిపోయాడు రాఘువుండు. యిద్ధి లేనివాడు దేవుడెట్లాయరా విశ్వదాభి రామ వినురవేమ అని ప్రశ్నించినటువంటి వేమనను కొడతారా సంఘ పరివార్ వాళ్ళు. కొట్టలేరు. కొట్టడానికి కుదరదు. అందుకే శ్రీశ్రీ అన్నాడు- ఆదికాలంలో తిక్కన, మధ్యకాలంలో వేమన, ఆధునిక కాలంలో గురజాడ మన మహా కవులు అన్నారు. వేమనని ఆవిష్కరించినటువంటి మన రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ అద్భుత ప్రసంగాలు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సి.ఆర్. రెడ్డి ఏర్పాటుచేశారు. వాటిని ప్రచురించడం మనకు చాలా గర్వించదగ్గ విషయం. వేమనను మొదట చాలా తొక్కి ప్రక్కన పెట్టారు. కాని వేమన వచ్చాడు. అంటే మనం బుద్ధుని నుంచి ఆధునిక వేమన వరకు భారతీయ సమాజంలో ఆధిపత్యం, అగ్రవర్ణ తత్వం ఎంతుందో దాన్ని ప్రశ్నించే తత్వం, ఎదురించే తత్వం కూడా అంత ఎక్కువగా ఉంది. చార్వాకులు ప్రశ్నించారు. లోకాయతులు ప్రశ్నించారు. హేతువాదులు ప్రశ్నించారు. శ్రీశ్రీ ఈ ముగ్గురినే కవులు అని ఎందుకన్నారంటే ఈ ముగ్గురు కూడా మానవుడికి పట్టం కట్టారు కాబట్టి. మానవుడు ఏ దైవాన్నైనా పూజించవచ్చు. ఎవరి దేవున్ని ఎవరయినా పూజించుకోవచ్చు. ఎవరి విశ్వాసం ఎవరిదయినా కావచ్చు. కాని మానవుడి కంటే మానవుడి విశ్వాసానికి - మతం అంటే ఏమిటి అనే అభిప్రాయానికి ఎక్కువ విలువిచ్చి నా అభిప్రాయంతో విభేదిస్తే కుదరదు అనే దగ్గర సమస్య వస్తుంది. వీరందరిని మొన్న వచ్చిరి ముసల్మానులు, నిన్న వచ్చిరి ఆంగ్రసులు, నిన్న వచ్చిరి బుడత కీచులు నేడు వచ్చిరి ఎంగిరీసులు అన్నాడు గురజాడ. మొన్న వచ్చిరి ముసల్మానులు, నిన్న వచ్చిరి బుడత కీచులు, బుడత కీచులంటే పోర్చుగీసు వాళ్ళు. నిజానికి భారతదేశ చరిత్రను మలుపు తిప్పినటువంటి బొబ్బిలి యుద్ధం ఫ్రెంచి వాళ్ళకు ఇంగ్లీషు వాళ్ళకు మధ్య ఇక్కడే జరిగింది. మరీ పరిణామ క్రమం- ఈ దేశాన్ని ఫ్రెంచి వాళ్ళు గెలిసుంటే బ్రౌను దొరలు - ఇప్పుడు చంద్రునరేంద్ర దొరలు - దొరలు దొరల కుమారులు, వారిట్వీట్లు, ముసైట్లు ఇదంతా ఒక కథనుకోండి. విదేశీయులు ఇంగ్లీషు వాళ్ళకంటే, అంతకు ముందొచ్చిన ముసల్మానులు - మనం ముసల్మానులను ఎక్కువ వ్యతిరేకించుతాము ఎందుకు? వాళ్ళిక్కడే కలిసిపోయారు కదా! ముస్లింలు లేకపోతే తాజ్‌మహల్ లేదు, ముస్లింలు లేకపోతే మొఘల్ ఏ ఆజం లేదు, ముస్లింలు లేకపోతే చార్మినార్ లేదు - చాలా లేవు, వారన్నట్లు అక్బర్ లేకపోతే కొన్ని లేవు. ఇవన్ని మనం పడగొట్టుకుంటూ పోతే మళ్ళా అవి కట్టడానికి మూడు తరాల వరకు పడుతుంది. సమయం సరిపోదు. కాబట్టి చరిత్ర దృష్టి కాదిది. రెండోది- మాట్లాడితే పాశ్చాత్య నాగరికత అంటారు. మన డెమోక్రసి చాలా విషయాలు మనం తెచ్చుకున్నాం కదా! పెద్దలు చెప్పారు పాశ్చాత్యులు అంటే అదో డైరెక్షన్ కాదు. పశ్చిమ అంటే పాశ్చాత్యులనుకుంటున్నాము. పాశ్చాత్యులు అంటే అనంతరం వచ్చినవాళ్లు. అంటే పనైపోయాకా ఏడవడం. ఎన్నుకున్నాక ఏడవడం లాంటిది. పాశ్చాత్యులకంటే కూడా ఈ దేశంలో ఉండి ఇక్కడే కలిసిపోయిన వారిపై ఎందుకు ద్వేషం. దీనికేమైనా హేతుబద్ధమైన కారణముందా! వాళ్ళలో కబీర్ లేడా! వాళ్ళలో ఇంకొకరు లేరా కాబట్టి ఈ తేడాని కూడా మనం గమనించాల్సి ఉంటుంది.

ఇకమూడోది. భారతదేశంలో ఈ మతాలు ఎలా వున్నా సరే, రాజ్యానికి మతానికీ మధ్యలో ఉండాల్సిన తేడా చాలా స్పష్టంగా వుంది. ఇది పాశ్చాత్య దేశాల కంటే భారతదేశం మెరుగు. ఈ విషయాలలో పాశ్చాత్య దేశాలలో చర్చి చెప్పినట్లే నడిచారు. ఇంగ్లీషు రాకుమారుడు అనుకున్న పెళ్లి చేసుకొనేందుకు చర్చి అడ్డొచ్చే వరకు వారికేమి ఇబ్బందిలేదు. ఆ తర్వాత ప్రొటెస్టెంటు వారు విడిపోయారు. మార్టిన్ లూథర్‌కింగ్ వంటివారు అందరూ తిరుగుబాట్లు చేసినట్లే వాళ్ళు తిరుగుబాటు చేశారు. కాని భారతదేశంలో రాజుకు రాజ గురువుకు మధ్యలో, రాజ్యానికి, మతానికి మధ్యలో ఆ తేడా వుంది. ఇప్పుడు మీరు రామదాసు కథ చూడండి. నా

వుద్దేశ్యంలో రామదాసు అందరికంటే పెద్దరెబెల్. ఏం కులుకుతూ తిరిగేవ్ ఎవడబ్బసొమ్మని రామచంద్రా! అని ప్రశ్నించాడు రాముడిని. ఎవడబ్బా సొమ్మని దేవుడినే అన్నాడు రామదాసు. ఇప్పుడు స్పెషల్ హెలికాప్టర్‌లలో తిరుగుతున్నారు. నీ చుట్టు ఇంతమందితో ఎవడబ్బ సొమ్మని తిరుగుతున్నావని రామదాసు ఆ రోజుల్లోనే ప్రశ్నించాడు. రామదాసు తానిషా తాలుకు కప్పం తీసుకుని రాముడికో గుడికట్టించాడు కదా! గుడి కట్టిస్తే తానీషా ఆయన్ని జైల్లో పెట్టాడు. రాముడు ఏం చేశాడండి. రాముడు ఓం భీం, ఫట్ తానీషా జి అని అన్లేదు. తమ్ముడిని తీసుకువచ్చి తానీషాకి కట్టాల్సిన డబ్బులు కట్టి విడిపించాడు. ఇందులో సందేశం ఏమిటి? రాజులు వేరు, రాజ్యాలు వేరు. రాజుగారికుండాల్సిన ధర్మాలు వేరు, నీ రాజ్యానికి ఉండాల్సిన ఆర్థికనియతి వేరు, భక్తి ప్రవత్తులు వేరని నీ రాముడే చెప్పాడని మీరొకవైపు చెప్పుకుంటారు. ఇక్కడే సాంస్కృతిక వైవిధ్యం కనిపిస్తుంది. అద్వానిగారు హైదరాబాద్ వచ్చినపుడు మీరు భద్రాచలం వెళ్తున్నారా అని అడిగితే ఎందుకు భద్రాచలం, ఏముందక్కడ అన్నాడట. ఇది వాస్తవం. లేదండి అక్కడ రాముడు వుంటాడు – ఆంధ్రజాతికిది అయోధ్య గుడి. ఆ అయోధ్య అంటే అధికారం అక్కడుంది. ఇక్కడ లేదు కదా. ఆయన ఇప్పటికీ చూశారో లేదో కాని నాకు సందేహమే. అద్వాని గారిని ఇంటర్వ్యూ చేయడానికి నా మిత్రులు వెళితే ఎక్కడా రాముడి బొమ్మలు లేవట. ఆ ఇంటర్వ్యూ చేసినవారక్కడ వాళ్ళిది ప్రత్యేకంగా వ్రాశారు. మహమ్మదాలిజిన్నా ఆయన లండన్‌లో బారిష్టర్‌లా చేసి వచ్చిన తర్వాత సన్మానం చేస్తే మీరెందుకు మిడిల్ టెంపుల్ స్కూల్‌లోనే చేశారంటే ఆయన అన్నాడట నేనెందుకు చేశానంటే అక్కడ అల్లా ఫోటోలున్నాయని అని చెప్పాడట. అల్లా ఫోటో ఉందంటే అందరు దంగైపోయారట. ఎందుకని అల్లా ఫోటో ఉండదు. ఇస్లాం ప్రకారం అల్లాకు ఫోటో ఉండదు. కాబట్టి అల్లా ఫోటో ఉండటానికక్కడ అవకాశమే లేదు. కాబట్టి అద్వాని గారు వెళ్ళి పాకిస్థాన్‌కి జిన్నాకి కితాబ్ ఇచ్చి వచ్చారు. ఆయన పాకిస్తాన్ ఏర్పాటుచేస్తే ఈయన ఎన్‌డిఎ సర్కార్ ఏర్పాటు చేశారు. తర్వాత ఆయన్ని బయటకు పంపించారనుకోండి. అంటే సాంస్కృతిక వైవిధ్యానికొస్తే జిన్నా పాకిస్తాన్ ఏర్పడ్డాక చేసినట్టి మొదటి ప్రసంగంలో ఇస్లాం అంటారేమోనని ఇందామని అందరూ వెయ్యి చెవులతో ఎదురుచూస్తుంటే ఒక్కసారి కూడ అనలేదట అతను. ఫర్ హిమ్ మతమనేది రాజకీయాలకొక సాధనం. ఖిలాఫత్ ఉద్యమం మొదలుపెట్టినప్పుడు ఇది మతపరమైనది వద్దని వ్యతిరేకించినవాడు జిన్నా. అటువంటివాడు ఆ మతాన్నే తీసుకుని దేశాన్నే విభజించే వరకు నడిపించాడు. అంటే మతరాజకీయాలకు ఎక్కడైనా సరే అధికారం పరమావధి తప్ప దానికి ప్రజలతో కాని, ఆధ్యాత్మికతతో కాని పనిలేదు. ఆధ్యాత్మిక చింతనకి ఏమాత్రం సంబంధం లేదు. అయోధ్యలో బాబ్రీమసీదుని పడగొట్టినపుడు అక్కడ మీడియావాళ్ళతో పాటు సంత్‌రామదాస్ అని ఎనభై ఏళ్ళాయన పాపం ఆయన్ని కూడా కొట్టారు. ఆయన అడ్డం తిరుగుతున్నాడు. నాదే రామాలయం అంటున్నాడు. కాబట్టి మతపరమైన అసహనానికి భారతదేశం యొక్క పరంపరకు ఏమాత్రం సంబంధం లేదనేది దైవభక్తులైన వారు కూడా గుర్తించవలసిన అవసరముంది. ఎందుకు రామాయణంలో గుహుడున్నాడు – ఎందుకు రామాయణంలో వానరులున్నారు? ఎందుకు రామాయణంలో రావణాసురున్ని కూడా గొప్పగా చెప్పారు. ఈ మధ్య ఒక చర్చ వచ్చింది. వాళ్ళే మన్నారో నేనొదిలేస్తున్నా రావణాసురుడు ఓడిపోతున్నాడు కాని సీత మీద మాత్రమ యాసిడ్ పోయలేదు. మనం ఈ విషయం గుర్తించాలి. కాని శూర్పణఖ ముక్కు చెవులు ఎవరు కోశారు. లక్ష్మణ కుమారుడు కోశాడు. అలాగే రావణాసురుడు పంపిన సీతని అగ్నిలోకి ఎవరు తోశాడు. రాముడు తోశాడు. వాల్మీకి వ్రాసినటువంటి రామాయణంలోని శ్లోకాలు చదివితే చాలు. ఏమన్నాడు సీతొచ్చి నిలబడగానే కొన్ని గిట్టనివి కూడా ఉన్నాయి. కంటి జబ్బు చేసినవాడి ముందు దీపం పెడితే ఎలా ఉంటుందో సీతా నువ్విక్కడ నిలబడితే నాకావిధంగా ఉన్నదన్నాడు. నేను రాజును, పరాక్రమవంతుడినని నిరూపించుకునేందు కోసం నిన్ను విడిపించానుకాని నిన్ను ఏలుకోవడానికి కాదు. నీవు లక్ష్మణుడు దగ్గరికైనా, విభీషణుడి దగ్గరికైనా పోవచ్చు అన్నాడు. ఇంత అందాల రాశివైన నిన్ను చూసి రావణుడు ఊరికినే ఉంటాడంటే నేనమ్మను అంటాడు. ఇవన్ని వాల్మీకి రాశాడు మరెవ్వరూ రాయలా! అంటే మన మతంలో ఆ పురుషాధిక్యత గురించి చర్చిస్తుంటే వాల్మీకి వాటి గురించేమి అనడం లేదు. సీతను రాముడి దగ్గరికి పంపించలేదు వాల్మీకి. మనమీ విషయం గుర్తుపెట్టుకోవాలి. రాముడ్ని పూజించినంత మాత్రానా సీత మీద సానుభూతి చూపించకూడదు అంటే భారతీయ సంస్కృతిలో ఏమి చెప్పినా గాని, భారతీయ సమాజం, పౌరసమాజం స్త్రీల పట్ల నిలబడి వుంది కాబట్టే వాల్మీకి సీత గురించి అలా వ్రాశాడు. లవకుశ సినిమా చాలా

బ్రహ్మాండమైన విజయం సాధించింది. లవకుశులు శ్రీరాముడి చెంతకు వెళ్ళి పాడారు వినుడు వినుడు రామాయణ గాథ అని. రాముడు రామారావు గారు దివ్య మంగళ విగ్రహంతో వచ్చి నిలబడ్డాడు. రాముడ్ని చూడగానే లవకుశులు శ్రీరాఘవం దశరాదాత్మకం - పాపం మహేష్‌కూడా పాడాడు గాని అంత బాగా పాడలేదు లేండి. ఇవన్ని పాడినాక మా జనని సీత ఎక్కడుంది పదండి చూద్దాం అని అడిగారు లవకుశులు. అప్పుడు ఏడ్చింది. వాళ్ళమ్మ కౌసల్య. వెంటనే లవకుశులు తిరుగుబాటుచేసి వాళ్ళమ్మ దగ్గరకు వచ్చారు. కాబట్టి లవకుశులు చేసినట్టి తిరుగుబాటైనా ఇరవై ఒకటో శతాబ్దంలో స్త్రీల తరపున మనం మాట్లాడలేకపోతే మన మాజీ డిజిపి అరవిందరావు చెప్తున్నాడు రాముడు చేసిందే చాలా సరైందని. సరైందో కాదో ఈనాటి మన సంస్కారంతో చూసినప్పుడు ఆయనట్లా చేసుండ కూడదని భారతీయులందరూ అంటారు. మాల్లాది రామకృష్ణ శాస్త్రి గొప్ప కవి,రచయిత. ఆయన రామాయణం అనదు సీతాయణం అంటాడు. అస్సలు అనడమే సీతాయణమంటాడు. మన రాముడి భక్తుడైన బాపు తీసిన ఏ సినిమా అయినా చూడండి. సీతమ్మవారి కష్టాలే చూపిస్తాడు. అది ముత్యాలముగ్గు కావచ్చు - ఇంకొకటి కావచ్చు. కాబట్టి భారతీయ సమాజంలో భిన్నమతాలు ఉండటం హేతుతత్వం ఉండటము, మానవత్వం ఉండటముతో పాటు స్త్రీల పట్ల సానుభూతి చూపించే లక్షణం కూడా వాల్మీకి దగ్గర్నుంచీ ఉన్నదని మనం తెలుసుకోవాలి.

తదుపరి విషయం కులాలు. హిందూమతం ఎట్లుంటదో దాని రూపం ఏమిటో మనకు తెలియదు. బుద్ధుడు దగ్గరకు ఒకరాజు పోతే ఏంటీ రథం మీద వచ్చావా అంటే అవును రాజా అంటే, రథమంటే ఏమిటి గుర్రమా, చక్రమా? ఇంకొకటా అని బుద్ధుడు ఆ రాజుని అడుగుతాడు. అదే విధంగా భారతీయ హిందూ మతం అంటే ఏమిటి? హిందూమత మంటే బ్రాహ్మణ, వైశ్య, శూద్ర అసలు ఇందులో ఎక్కడాలేని అస్పృశ్యులా తెలియదు మనకు. కాబట్టి హిందూమతం కులాల ద్వారానే వ్యక్తీకరించబడింది. కాబట్టి కులాల మధ్య సామాజిక న్యాయం అన్న భావన హిందూ మతానికి చాలా కీలకమైనది. మహాత్మాగాంధీ విదేశీ వస్త్ర దహనం చేసినపుడు ఎందుకు చేస్తున్నావంటే ఇన్ బర్నింగ్ పారిన్ క్లాత్ ఇజ్ దిషేమ్ అన్నాడు. ఇప్పుడు మనం ప్రత్యేకించి విదేశీ వస్త్రాలైతే తప్ప వేసుకోవడం లేదు. ఇక రెండోది ఆయన పూర్ ఆఫ్ ది పూరెస్ట్ అన్నారు. అస్పృశ్యతా నివారణ అనేది ఎందుకు చేపట్టాడాయన. జీవితమంతా రామనామ స్మరణ చేసినవాడు రఘుపతి రాఘవ రాజారాం, పతీత పావన సీతారాం అన్నాడు. అటువంటి మహాత్మగాంధీని 1948 జనవరి 30న హత్య చేయడం కంటే భారతదేశ కల్చరల్ డైవర్సిటీకి అంతకుమించిన చాలెంజ్ ఏమయినా వుందా? దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన ఒక ఏడాదిలోపునే అంటే 1948 జనవరి 30న మనం గాంధీని కోల్పోయాము. అంటే అప్పట్నుంచి ఇప్పటి వరకు ఈ సవాళ్ళు పెరుగుతున్నాయి తప్ప తగ్గడం లేదు. ఆ సమయంలో వున్నవారింకా చాలా చాలా చేశారు. అదింకా వెర్రితలలు వేస్తుంది. వాస్తవానికి తగ్గి ఉండాల్సింది. అయితే గురజాడ అప్పారావు మతములన్ని మాసిపోవును జ్ఞానమొక్కటే నిలిచివెలుగును అన్నాడు. కాని మతం మాసిపోలా? ఎందుకంటే అది రాజకీయాలతో ముడివేసుకుపోయింది. మతాన్ని రాజకీయాలతో పెనవేయడం వలన హిందూమతం స్థానంలో హిందూత్వం అనే మత సిద్ధాంతం ఆక్రమించడం వల్ల అంతర్జాతీయంగా ఒక ఇస్లాం తీవ్రవాదం వంటివి రావడం వల్ల జాతీయస్థాయిలో అంతర్జాతీయంగాకూడా ఇతర మతాలకు కూడా కొంతమంది నన్ను అడుగుతుంటారు మీరు మీ గురించే మాట్లాడుతుంటారు. పొద్దున్నే వారు అన్ని ఛాన్నళ్ళలో మత ప్రచారం చేస్తున్నారు కదా అంటారు. ఛాందసత్వం ఎక్కడున్నా ఖండిస్తాం. కాని అదే సమయంలో వారి ఉనికిని సహించలేనటువంటి ఒక తత్వం, భారతదేశంలో హిందువులు ఎక్కువగాఉన్నారు కాబట్టి హిందువుల దేశం అనే వాదన చాలాచాలా పొరపాటు. ఎందుకంటే ప్రజాస్వామ్యం అంటే మెజారిటీవాదం కాదు. పైగా మెజారిటీ అనేది శాశ్వతంగా కూడా ఉండదు. మెజారిటీ అనేది కూడా మారుతూ ఉంటుంది. దేశ విభజనకు ముందు ముస్లింలు ఎక్కువగా ఉన్న రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది ఎక్కువచోట్ల. పంజాబ్‌లో కాని ఇంకొక చోట. కాబట్టి మెజారిటీ డెమోక్రసీ ఈజ్ నాట్ మెజారిటీ యిజం. డెమోక్రసి ఈజ్ రూల్ ఆఫ్ లా. రోల్ ఆఫ్ లా. ఇక్కడ మనదేశంలో రూల్ ఆఫ్ లా లేదు డ్యూయల్ రోల్ ఆఫ్ లా లేదు. అక్కడ జార్ఖండ్‌లో స్వామి అగ్నివేశ్ పాపం పుట్టినప్పటి నుండి ఆయనా కాషాయ బట్టలేస్తున్నాడు కానీ ఆర్యసమాజ్. ఆరెస్సెస్ సమాజ్ కాదు. ఆర్య సమాజయితే

కుదరదు వారికి. కానీ ఏమయితేనేం దాడి చేశారాయనపై. ఎందుకలాంటి ఘటనలు జరుగుతున్నాయని అందరూ బాధపడ్డారు. కాని ఇటువంటి ఘటనల్లో కోర్టుల్లో శిక్షలు పడ్డవారికి జయంత్ సిన్హాగారు సత్కరించారు. అంటే మనం కేవలం ఇటువంటివి ఖండించకపోవడమొక్కటే కాదు సత్కరించడమనేది కూడా దేశంలో వస్తుంది. ఎవరి నాయకులు వారికి ఉండవచ్చు. ఎవరి పార్టీకి వాళ్ళు ఓట్లేసుకోవచ్చు. అది వేరే విషయం. కాని దేశం అన్ని మతాలకు చెందినవాళ్ళది. అన్ని విశ్వాసాలకు చెందిన వాళ్ళది. ఏమతానికి చెందని వాళ్ళది కూడా. రాజారామ్మోహన్‌రాయ్ దగ్గర్నుంచి గురజాడ అప్పారావు వరకు ఎందరెందరో సంస్కర్తలు, వైతాళికులు నూతనమైనటువంటి భావాలు చెప్పినటువంటి దేశం. హిందూమతంలో కూడా రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, దయానంద సరస్వతి ఇటువంటి వారందరు మతం పరిధిలో కూడా సంస్కరణలు ప్రతిపాదించారు. కాబట్టి ఒకటి హిందూ మతమనేది శిలా సదృశ్యమైనది కాదు. రెండోది భారతదేశం శిలా సదృశ్యమైనది అంతకన్నా కాదు. ఈ రెండింటిని కూడా మనం కలగాపులగం చేసి ఈ దేశంలో ఒకటే రాజకీయ మతం, ఆ ఒకటే మతానికి ఒకటే వ్యాఖ్యానం, ఆ వ్యాఖ్యానికి ఒకటే రాజకీయ ప్రాతినిధ్యం. మిగిలినవి ఏమైనా గాని మేము సహించం అంటే ప్రజాస్వామ్యం కాదు. అది భారత రాజ్యాంగ ధర్మం కాదు. భారత పౌర సమాజం కూడా అటువంటిది ఆమోదించదు. పల్లెల్లో ఉర్సు జరిగితే అన్ని మతాలవారు వెళ్తారు. కడపలోని దర్గాల దగ్గరికి అన్ని మతాలవారు - అగ్రనటులు, పెద్ద పెద్ద నేతలు కూడా వస్తారు. అలాగే రథోత్సవాలలో, తిరణాలలో అన్ని మతాలవారు పాల్గొంటారు. కాబట్టి భారతదేశాన్ని ఇక్బాల్ చెప్పినట్లుగా, వేమన కూడా చెప్పాడు- పశులవెన్న పాలేటివర్ణం పూలవర్ణం వేరు పూవులొక్కటే, దర్శనంబులు వేరు దైవంబు ఒక్కటేరా విశ్వదాభిరామ వినురవేమన్నారు. మీకు నచ్చితే పూజించండి. లేదంటే దీని మీద సమాజాన్ని ఇలా రెండుగా, మూడుగా ఇలా చేస్తూపోతే ఇది మిగిలేటటువంటి వ్యవహారం కాదు. అధికారంలో ఉన్నవాళ్ళుకాని, అధికారంలోకి రావాలనుకుంటున్న వారుకాని, అధికారంలోకి వస్తామనుకుంటున్నవారు గాని ఎవరైనా సరే మతాన్ని మటుకు మీరు సాధనంగా చేసుకోకండి. ప్రజాశేయస్సును, ప్రజాస్వామ్య విలువలను, భారత రాజ్యాంగం చెప్తున్నటువంటి లౌకిక స్ఫూర్తిని, 19వ అధికరణం ఇచ్చినటువంటి ప్రాథమిక హక్కులను వీటన్నింటిని మీరు ఆధారం చేసుకోవాలి. ఎందుకంటే నా నుంచి రాష్ట్రపతి వరకు దేశ ప్రజలలో ఎవరయినా సరే రాజ్యాంగం మీద ఆధారపడాల్సిందే తప్ప రాజ్యాంగేతర శక్తి మీద ఆధారపడే హక్కు ఎవరికి లేదు. భారతదేశం ముమ్మాటికీ లౌకిక రాజ్యాంగం. భారత రాజ్యాంగం ముమ్మాటికి సామాజిక న్యాయాన్ని చెప్పేటటువంటి రాజ్యాంగం, భారత రాజ్యాంగం ముమ్మాటికి సమాఖ్య రాజ్యాంగం. ఎందుకంటే రాజ్యాంగంలో మొదటి అధికరణమే భారతదేశం రాష్ట్రాల సమాఖ్య అని చెప్తుంది. ఇండియా ఈజ్ ఏ యూనియన్ ఆఫ్ స్టేట్స్ అని చెప్తుంది. కాబట్టి రాష్ట్రాల యొక్క వైవిధ్యాన్ని, భాషావైవిధ్యాన్ని గుర్తించాలి. ఇటీవల ఉత్తరం, దక్షిణం వంటి చర్చలు కూడా వస్తున్నాయి. హిందీ సినిమాలు, హిందీ సీరియల్స్‌ని మనం వద్దంటున్నామా లేదు కదా చూస్తున్నాం కదా! డబ్బింగ్ చేసినవి చూస్తున్నాం కదా. తెనాలి రామలింగడు, పెళ్ళికూతురు, ఇలాంటవన్ని కూడా! కాబట్టి భారతీయులకు ఏమిలేదు. బాహుబలి రాజమౌళి సినిమా అన్ని భాషల్లో హిట్టయింది కదా? కాబట్టి కళా సాంస్కృతిక విషయాలలో విశాలత్వం ఈ దేశంలో వుంది. ఉన్నదాన్ని ఇప్పుడు మనం పోగొట్టేసి కొన్ని భాషలే, కొన్ని మతాలే లేక కొన్ని విశ్వాసాలే, కొందరు మనుషులే అనేది తీసుకువస్తే అది మరీ దారుణం. మన ఆంధ్రదేశంలో కుల పైత్యం ఇంకా ఇంకా పెరిగిపోయి, ఈ మతతత్వం, కులపైత్యం కలసిపోయినటువంటి ఒక వికృత పరిస్థితి. ఏ కులమని నన్నివర మడిగితే ఏ కులమని చెప్పుదు లోకులకు, పలు గాకులకు అన్నాడు వీర బ్రహ్మేంద్రస్వామి శిష్యుడు ఎప్పుడో. ఇప్పుడో ఎవరు చూసినా ఇక్కడ- ఆ - తెలకపల్లికి ఎవరయినా బంధువులున్నారా ఇక్కడ అని అడుగుతారు - వాళ్ళు డైరెక్ట్‌గా అడగరన్నమాట. ఈ కుల, మత సంకుచితత్వాలకు, పురుషాధిక్యతకు వీటన్నింటికి అతీతమైనటువంటి ఒక మానవీయ సంస్కృతిని, ప్రజా స్వామ్య సంస్కృతిని, రాజ్యాంగ సంస్కృతిని మనం ప్రతిష్టించుకోవాల్సిన అవసరం ఉంది. ఈ మార్కెట్ కల్చర్, కమ్యూనల్ కల్చర్ బొమ్మా బొరుసుల్లాంటివి. అసలు అగ్రికల్చరల్‌కే దిక్కులేనప్పుడు ఈ కల్చర్ గురించి మాట్లాడే వారెవరున్నారిపుడు. ఎంతసేపు కూడా మనీ కల్చర్, సెమీ కల్చర్, నైట్ కల్చర్, పబ్‌కల్చర్, ఇదంతా

కవిత

# అప్పుడే.. గోడపై

- బి.వి.వి. సత్యనారాయణ
9912233739

అప్పుడే ఆ గోడపై రెక్కీ మొదలైంది
ఆ గోడపై దేగకళ్ళు నిఘా ప్రదర్శన
వంటరిగా, జంటగా, గుంపుగా, గ్రూపులుగా
ఆ గోడ దగ్గర ఒకటే సందడి సందడి
రంగువెలిసి వెలవెలబోయిన ఆ గోడ
రంగురంగుల వర్ణాలతో కళకళలాడుతుంది
నవ్వులు, కేరింతలు, వ్యంగ్యాలు,
వెటకారాలు, చలోక్తులు ఒకప్రక్క
అలుపు సొలుపులు, అలకలు, ఆతృతలు,
ఆరాటాలు పోరాటాలు మరోప్రక్క
ఆ గోడ విశిష్టం వైభోగమేమిటో గాని
బ్రిటిష్ వాడి నాణ్యత, నైపుణ్యాలతో
ఎంత మందెక్కినా చలించని దృఢమైన గోడ
ఫిరంగులు సైతం కూల్చలేని ధారుఢ్యం
నాకు తెలిసి స్వాతంత్ర్యం సంది చెక్కు చెదరని గోడది
ఎన్నికలకు సరిగా సంవత్సరం ముందునుండే
ఆ గోడపై ఎడతెరిపిలేని వత్తిడి, సందడి కలగలిసి
ఉంటాయి
రైలు, బస్సులల్లో కర్ఛీఫ్ వేసి రిజర్వు చేసుకున్నట్లు
ఆ గోడపై అప్పుడే రంగురంగుల కండువాలు వెలుస్తున్నాయి
రాజకీయ ప్రాబల్యంతో రెపరెపలాడుతున్న
పార్టీ కండువాలు ఎగరేత
సరంజామ అంతా సిద్ధం జేసుకుని - సమాజ సేవ అంటూ
ఆ గోడ మీదకు జేరిపోయిన పాత మొహాలు,
క్రొత్త మొహాలు, తెలిసిన మొహాలు,



తెలియని మొహాలుతో చిరునవ్వుల చిందులాటలు
ఎవరి హడావుడి వారిది -
అంతా తమతమ వ్యూహరచనల్లో మునిగి తేలుతున్నారు
పార్టీల స్థితి గతులను, నాయకుల సామర్థ్యాన్ని
స్వప్రయోజనాలతో లింకు జేసుకుని - ముందుకు సాగే
ప్రయత్నం
ఇంకా సంవత్సర కాలం ఉందనగానే - ఆ గోడకు
ఎన్నికల కళ కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది
ఏది ఏమైనా రంగులద్దేవారు, జెండాలు కుట్టేవారు,
జెండాలు కట్టేవారు, పోస్టర్లు అతికించేవారు, ఫ్లెక్సీలు
కట్టేవారు
ఎవరి బిజీ వారిది - ఎవరి హడావుడి వారిది
గోడమాత్రం అందంగా ముస్తాబైన నెరజాణలా
మత్తుగొల్పుతూ - యమ ముద్దొచ్చేస్తుంది
ఇంకా సమయం మించి పోలేదు గాని
ఎన్నికలు దగ్గర పడే నాటికి - ఆ గోడ
కిక్కిరిసిన జనంతో - తోపులాటకు 'సై' అంటుంది
లాంగ్ జంపులు, హైజంపులు - జంపింగ్ జిలానీలు
ఇతర ప్రావీణ్యం నేర్చిన నేతలంతా
ఆ గోడపై అతుక్కుపోయిన బల్లిలా
గోడమీద పిల్లిలా - అవతార మూర్తులవుతారు
ఇక -గోడ దూకడం ఒకటే తరువాయి!! ◆

---

నిజానికి నాన్‌కల్చర్. లేదా నాన్సెన్స్ కల్చర్. నిజమైనటువంటి కల్చర్ తెలుసుకోవాలంటే అరకులోయ వెళ్ళి అక్కడున్న లంబాడీలతో లేదా గిరిజనులతో వారితో కలసి మనం థింసా నృత్యం చేస్తే మనకు వస్తుంది. పల్లెలకు వెళ్ళి అక్కడి పరిమళాల్ని ఆస్వాదిస్తే తెలుస్తుంది. మట్టిమనుషులతో కలిసి నడిస్తే వస్తుంది. లేదంటే ఇక్కడ ఆంధ్ర విశ్వవిద్యాలయాలోని లైబ్రరీల కొచ్చి అవి కూడా డిజిటలైజ్ అవుతున్నాయనుకోండి ఇటువంటి గ్రంథాలయాల కొచ్చి నేర్చుకుంటే తెలుస్తుంది. కాబట్టి మతములన్నియు మాసిపోవును, జ్ఞానవె క్కటే నిలిచి వెలుగును అన్న ఒక గురజాడ స్ఫూర్తితో మనం ఒక మానవీయ స్పృహతో ఇప్పుడు రామపక్షం గురించి వామపక్షం గురించంటున్నారు కాని రాముడి దగ్గర ఒక గొప్ప సుగుణ ముంది రాముడు కృష్ణుడిలాగా మాయలు చేయలేదు. రాముడు మానవుడిగానే బ్రతికాడు. రామాయణంలో తప్పొప్పులుంటే అది చదువుకోవచ్చు చర్చించుకోవచ్చు అది వేరే విషయం. రాముడు మనిషిగా ఎలా ఉన్నాడు - రాముడిది ఏ ధర్మం? అది ఫ్యూడల్ ధర్మం. ఆ విలువలు వేరే. కాని మనిషి ఎలా ఉన్నాడు అంటే ఇదిగో ఇలా మనిషిలా. ఇప్పుడు మనం భారతీయుడిగా ఏమని ప్రతిజ్ఞ చేస్తున్నాము. సహోదరస్ఫూర్తికి కట్టుబడి వుంటే అప్పుడు సహనం దానంతట అదే వస్తుంది. అప్పుడు భాయ్‌వాలాలు గాయ్‌వాలాలు అయ్యే ప్రమాదం తప్పింది. అప్పుడు దేశంలో వుండే వైవిధ్యం బ్రహ్మాండంగా పరిఢవిల్లుతుంది.

*(విశాఖపట్నంలో వైజాగ్ ఫెస్ట్ ఆధ్వర్యంలో జూలై 22న 'భారతదేశ సాంస్కృతిక వైవిధ్యం - సవాళ్ళు' అంశంపై జరిగిన సెమినార్‌లో చేసిన ప్రసంగం)* ◆



# ముగ్గు రాళ్ల మిట్ట

- ఆర్.సి.కృష్ణస్వామి రాజు
9393662821

"పరదేశన్నా! పరదేశన్నా! పాప ముగ్గు రాళ్ల మిట్ట కాడ నిలబడి ఏడస్తావుంది. పదవ తరగతి పరీక్షలకు రోజూ ఆటోలో పోతుంది కదా! ఆటో రెండు చక్రాల టైర్లూ పంక్చరై బండి కదలడం లేదంట" అని అరస్తా చెప్పింది అరవోళ్ల మీన. రెడ్డోళ్ల బావికాడ గెనాల మీద కంప చెట్లు దోవకి అడ్డంగా వుండాయని నరకతా వున్నాడు పరదేశి. విషయం విన్నాక నిమిషం నిలబడలా. కత్తి, పార, గెనెం మీదనే పడేసి గబగబా దబదబా ఊర్లోకి పరుగులు తీసినాడు.

'ఊరు ఉప్పిలివంక నుంచి పరీక్ష హాలు నెత్తకుప్పంకి పోవాలంటే ఆరుమైళ్లు వుందికదా, ఆటో మిస్సయితే దిక్కులేదాయె. ఊరికి బస్సు సమయానికి రాదాయె-పోదాయె. ఇవ్వాళ పాప ప్రమీల పరీక్షకి ఎట్ల పోతుందబ్బా' అనుకొంటూ భయంభయంగా ఊరి బొడ్డున వున్న ముగ్గురాళ్ల మిట్ట కాడికి చేరినాడు. అప్పటికే పాప పక్కన అంగడి సుగుణ నిలబడి వుండాది. 'పల్లె పాపలు పరీక్షలకు వెళ్లడం, రావడం కూడా ఒక పరీక్షేనమ్మా' అంటూ రాగాలు తీస్తోంది.

నేరేడు చెట్టుకింద నాలగవ తరగతి చదివే జలజ వనజలు తాము ఆడే కచ్చకాయల ఆటని నిలిపేసి ప్రమీలక్క దగ్గరికి చేరినారు. పరదేశి పెంపుడు కుక్క పరుగెత్తుకుంటూ వచ్చి అబ్బా కూతుళ్ల చుట్టూ నాలుగుసార్లు తిరిగి తోక ఆడిస్తూ పక్కనున్న దిబ్బపైకి పోయి నిలబడింది.

మీసాలాయన కొడుకు జ్యోతిరాజు గాడు తన తుప్పు పట్టిన పాత సైకిల్ ఫెడల్ రిపేరు చేసుకుంటున్నాడు. 'తన తలతిక్క కాకపోతే సైకిల్ సిద్ధమయేదెప్పుడు? తను ప్రమీలను పరీక్షకు తీసుకెళ్లేదెప్పుడు? ఇది అయ్యేపని కాదులే' అనుకొని తనలో తనే నవ్వుకొని గమ్మున వుండిపోయినాడు. బాతుల బంగారప్ప సద్దికూటి మడుగుకి బాతుల్ని తోలుకెళ్తూ నిమిషం

నిలబడినాడు. అక్కడ తను చెయ్యగలిగిందేమీ లేక 'పాపకి పరీక్షలు వ్రాసేదానికి శక్తి కావాలి కదా' అంటూ నాలుగు బాతుగుడ్లు కాగితంలో చుట్టి పరదేశి చేతికిచ్చినాడు.

బాతుగుడ్డు దోశె తింటూవున్న ఊటుకూరు వాణి ఒక చేత్తో తింటూనే మరో చేత్తో మొబైల్‌లో పొరుగూరు పిల్లారిపట్టు ఆటో డ్రైవర్ కోసం ప్రయత్నాలు చేస్తానే వుంది. 'నెట్‌వర్క్ బిజీ' అనే వయ్యారపు మాటలు ఆమెకు వినిపిస్తూనే వున్నాయి.

మొగుడు మందు మానాలని 30 రోజులు మూగ నోము నోస్తున్న మునిలక్ష్మి వేప చెట్టుకింద అంకాలమ్మకి పొంగళ్లు పెట్టి సాంబ్రాణి పొగ వేస్తోంది. పనిలో పనిగా ప్రమీల పరీక్ష హాలుకి చేరాలని అంకాలమ్మకి చెంపలేసుకొంటూ మొక్కుకుంది.

కువైట్ కిష్టడి పెళ్లాం పరమేశ్వరి తన మొగుడి మోటర్ సైకిల్ బీగాల కోసం వెదకసాగింది. 'బీగాలు అందుబాటులో వుంటే వాళ్లు, వీళ్లు వాడుకుంటారు' అని మొగుడు బండి బీగాల్ని బ్యాంకు లాకర్లో పెట్టి కువైట్ వెళ్లినాడని గుర్తొచ్చింది. తన మతిపరుపుకి తనకుతానే మూడు మొటిక్కాయలు వేసుకొంది.

ఉసిరి, రేగు, నేరేడు చెట్లగాలి తెరలు తెరలుగా వీస్తోంది. ప్రమీల తన పరీక్ష విషయం తలుచుకొని తలుచుకొని ఏడుస్తోంది. పరదేశి తన కూతురు ప్రమీల తలని ప్రేమగా నిమురుతున్నాడు. ప్రమీల తలలోని ముద్దబంతి పువ్వు తండ్రి ప్రేమను ఆస్వాదిస్తోంది.

♦♦♦

తాటి చెట్టు నుంచి వడి కాళ్లు పోగొట్టుకున్న కనకభూషణం తలకి ఆముదం అంటుకొని తన మూడు చక్రాల చేతి తొక్కుడు సైకిల్ చైను సరిచేసుకొని వచ్చినాడు. తన ట్రై సైకిల్‌లో ప్రమీలను పరీక్షకు తీసుకెళ్తానని చెప్పినాడు. "మంచి మనసున్నోడివప్పా! నీవు నూరేళ్లు చల్లగుండా! అయినా నువ్వు సైకిల్ తొక్కితొక్కి పోయేలోగా పరీక్ష కూడా ఆయిపోద్రా' అని మెత్తమెత్తగా చెప్పింది అక్కడే వున్న ఇల్లత్తూరు ఇందిర.

నగరం కాంత తన కూతురికి కళ్యాణ గడియలు రావాలని అమ్మా కూతురు కలసి రావిచెట్టుకాడి పుట్టచుట్టా ఈ చోద్యం అంతా చూస్తా వుండినారు. ప్రమీల పరీక్షహాలుకు చేరాలని మరిన్ని పాలు పుట్టలో పోసినారు. నాగదేవతకు మొక్కినారు.

మునగ చెట్టులో మునక్కాయలు కోస్తున్న మునిలక్ష్మి తన మొగుడు మాణిక్యంతో 'ట్రాక్టర్ సిద్ధం చేయరాదా! ప్రమీల పరీక్షకు పోవాలంట!' అని అరిచింది. కానగ చెట్టుకింది బండపైన కూర్చున్న మాణిక్యం తన లుంగీలో ఉడకబెట్టిన శెనక్కాయలు పోసుకొని కొట్టికొట్టి ఒలుచుకొని తింటూ వున్నాడు.

"ట్రాక్టరు చేతిలో లేదు మునిలక్ష్మీ. రాత్రి రాఘవన్న కయ్యికాడ దున్నతా వుంటే డీజిల్ అయిపోయినాది. రాత్రి బండి అక్కడే పెట్టి వచ్చినా. మళ్లన్నా పుత్తూరు వెళ్లి డీజిల్ తెచ్చుకోవాల" అని బదులిచ్చినాడు.

చెమ్కీల చీరకట్టిన తూర్పువీధి తులసి ఇంటి కోళ్లు ఇల్లంతా గలీజు చేస్తావుండాయని వాటిని మునగచెట్టు కిందికి తరిమి గంపకింద మూసి పెట్టింది. మునగ చెట్టు మీది నల్లకాకి అదే పనిగా అరస్తావుంటే పమిట కొంగుతో తరిమింది. రింగు రింగు వెంట్రుకల సంవత్సరం బుడ్డోడిని చంకనెత్తుకొని స్టీలు గిన్నెలో ఉడకబెట్టిన కోడిగుడ్డుతో వీధిలోకి వచ్చింది. గుడ్డు తినమని బుడ్డోడిని బతిమలాడింది. వాడు ఎంతకీ తినకపోయే సరికి 'నువ్వు గుడ్డు తింటేనే ప్రమీలక్క పరీక్ష కెళ్తుంది. లేకుంటే లేదు' అని బెదిరించింది. వాడికి ఏమీ అర్థమయ్యిందో ఏమో, గుటుక్కున గుడ్డుని మింగేశాడు. అవ్వ బుజ్జెమ్మ నవ్వుతూ బుడ్డోడి బుగ్గపైన చిటెకేసి పాలు పితకడానికి ఆవుల కొట్టంకి వెళ్లింది.

♦♦♦

రానున్న పంచాయితీ ఎన్నికల్లో ప్రెసిడెంటు పోస్టుకి పోటీ చేయాలని వున్న సిల్వర్ సత్యం పంచె ఎగ్గట్టుకొని పరుగులు తీస్తా వచ్చినాడు. తన పాత టి.వి.ఎస్. 50 బండిని బరబరా తోసుకొంటూ తెచ్చినాడు. 'ఊరి బిడ్డకి ఉపద్రవం వచ్చిందంటే ఊరు ఊరంతా కదిలిరాదా' అంటూ ఊగుతూ బండి స్టాండు వేసి బండి స్టార్ట్ చేయసాగినాడు.

దోవన పోతా నెత్తిన వున్న ఈతగింజల గంపని తీసి నేలపైన పెట్టి పొగాకు నములుతా సినిమా చూసినట్లు చూస్తా నిలబడింది సెంగలక్క. క్యాటరాక్టు కళ్లతో అట్లా ఇట్లా చూస్తా, వేపాకు నమల్తా, తల ఆడిస్తా, నాయనా కూతుళ్ల వైపు చూస్తా వుండినాడు ముత్త బావ.

♦♦♦

ఈ విషయం ఆ నోటా ఈ నోటా ప్రాకి ప్రాకి ప్రెజెంట్ ప్రెసిడెంట్ సిబ్యాల సుధక్క చెవిన పడింది. మిద్దెపైన వడియాలు పెడ్తావున్న సుధక్క ఎక్కడివక్కడ ఆడబిడ్డకు

## కవిత

# "కవుల అక్షరాలేం చేస్తాయి..?!"



**- డా.పి. విజయలక్ష్మి పండిట్**
9441736843

కవుల అక్షరాలు..
నీరసించే జీవితాలకు
నిత్యం రంగులద్దుతాయి..,
మూగబోతున్న మనిషి
జీవితకిరణాలను చీల్చి
సప్తవర్ణాల ఇంద్రధనుస్సు
నావిష్కరిస్తాయి..,

కవుల అక్షరాలు...
పచ్చని ప్రకృతిని
అక్షరకుసుమాభరణాలతో
అలంకరించి ప్రణయగీతాలు
పాడుకుంటాయి..,

కవుల అక్షరాలు...
మనుషుల మెదళ్లకు
పదును పెట్టి
ఆలోచనలకు అనంతశక్తి నిచ్చి
ప్రజల నోళ్ళతాళాలు
పగులగొడతాయి..,

కవుల అక్షరాలు..
కట్టుబాట్ల ముళ్ళకంచను
కలంకొడవళ్ళతో తెగనరికి..,
ఆడవారి యదారిబ్రతుకులపై
పద్యాలనల్లి పాటలుపాడి..
మెదడులేని మనుషులుగ
చెలామణి అవుతున్న మగువలను
మనుషులుగా
నిలబెడుతున్నాయి..,

సాంప్రదాయ కట్టుబాట్ల
చీకటి పంజరాల్లో మగ్గుతున్న
అతివలకు అక్షరాలరెక్కలు కట్టి
స్వేఛ్ఛా వినువీధుల్లో కెగరేస్తాయి..,

దేశమాత దాశ్యశృంఖలాలను
తెగతెంపిన కవుల ఆ అక్షరాలే..
అజ్ఞాన పొరలను తొలగిస్తాయి
ప్రజలకు గొంతునిస్తాయి..,
పాలకులను హెచ్చరిస్తాయి..,

మనిషి మనసుకు స్వేచ్ఛనిస్తాయి
జీవితానికి శాంతినిస్తాయి..!! ◆

---

అప్పగించి ఇంట్లోకి పరుగులెత్తింది. నిద్దరోతున్న మొగుడు మునిస్వామిని తట్టి లేపింది. తమ పాతిక లక్షల ఇన్నోవా కారులో ముగ్గురాళ్ల మిట్టకాడికి మొగుడు పెళ్లాలిద్దరూ చేరినారు. రయ్‌మని వచ్చి కారు ఆగడం చూసిన చెట్లమీద పక్షులు వేడుకని చూడసాగాయి. 'ఏమారితే అపోజిషనోళ్లు ఇలాంటి చిన్న విషయాల్ని పెద్ద విషయాలు చేసి లబ్ధి పొందితే... అమ్మో! ఎలక్షన్లు ఎప్పుడు అనౌన్స్ చేస్తారో, ఏంపాడో'! అనుకుంటూ పట్టుచీర సర్దుకొంటూ పడవలాంటి కారు నుంచి దిగింది.

"ఓలమ్మో! ఓలమ్మో! మన ఊరి పిల్ల పది పరీక్ష మిస్సయితే ఊరుకుంటామా! ఏంది! మేమంతా లేమా! ఏంది! మమ్మల్ని ఎట్ల మరిసినారు నాయనా! రా అమ్మీ! కారెక్కు" అని అంటూ చీర చెంగు నడుముకి చుట్టింది.

నాలుగేండ్ల రాజకీయ ప్రస్థానంలో పంచాయితీ ప్రెసిడెంట్ సంధ్య పాలిటి(ట్రి)క్స్‌లో ఇంత గొప్పగా ఎదగడం చూసి మొగుడు మునస్వామికి ముచ్చటేసింది. చిలకమర్తి పద్యపాదం 'ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్' గుర్తొచ్చి ముసిముసిగా నవ్వుకున్నాడు. మెత్తగా మీసాలు దువ్వుకుంటూ కారు స్టార్టు చేసినాడు.

చిన్నగా కారు ముగ్గురాళ్ల మిట్ట కాడి నుంచి నెత్తకుప్పంకి బయలుదేరింది. చల్లటి ఏయిర్ కండిషన్డ్ చిరుగాలి ప్రమీలను పలకరించింది. ముగ్గురాళ్ల మిట్టలోని ముగ్గురాళ్లు పరీక్ష పాపకి 'బెస్టాఫ్ లక్' చెప్పినాయి. తులసి చంకన వున్న పాలపళ్ల బుడ్డోడు ప్రమీలను చూసి నవ్వుతూ రెండు చేతులూ ఊపినాడు. పరదేశితో సహా అక్కడ చేరిన జనం గట్టిగా గాలి పీల్చి, గాలి వదిలినారు. చెరువునీళ్లు చీనీ చెట్లకు మళ్లించి అప్పుడే ఊర్లోకి వచ్చిన పూలాయన, పాలాయన, కూరగాయలాయన, కోడిగుడ్లాయన, టెంకాయలాయన తప్పట్లు కొట్టినారు. సంతోషపడిన జలజ వనజలు 'డింగ్ డింగ్ డింగిరి ధక్కుం, డింగ్ డింగ్ డింగిరి ధక్కుం' అంటూ ఎగురుకొంటూ వెళ్లిపోయారు. ఎక్కడి నుంచో వీచిన గాలికి మిట్టమీది రేగుచెట్లు రేగు పళ్ళు రాల్చాయి.

ప్రెసిడెంటు కారు వదిలిన నల్లపొగ రింగులు రింగులుగా తిరిగి సర్పంచ్ అభ్యర్థి సిల్వర్ సత్యం ముఖానికి అంటుకొంది. ◆



వ్లాదిమర్ వ్లాదిమిరోవిచ్ మయకోవస్కీ
19 - 07 - 1893 - 14 - 04 - 1930

# సోవియట్ ఆధునిక కవితా తేజస్వి మయకోవస్కీ

- డా॥ యస్. జతిన్‌కుమార్
9849806281

గోర్కీ (అమ్మ), టాల్‌స్టాయి (అన్నా కెరినినా, యుద్ధము–శాంతి), పుష్కిన్ (కాల్పనిక కవిత), చెహోవ్ (కథలు) గొగోల్ (ఇన్స్పెక్టర్ జనరల్ వంటి నాటకాలు), దాస్తయోవస్కీ (నేరము శిక్ష), తుర్గనేవ్ (తండ్రులు–కొడుకులు), ఐత్‌మాతోవ్ (తల్లీ భూదేవి), వంటి రష్యన్ రచయితలు తెలుగు పాఠకులకు ఎంత ఆత్మీయంగా తెలుసో, అంత బాగా ప్రాచుర్యం పొందిన మరో రష్యన్ రచయిత మయకోవస్కీ. శ్రీశ్రీ అనువదించిన లెనిన్ కావ్యం మూల రచయితగా మయకోవస్కీ మనందరికీ చిరపరిచితుడే. కవి, చిత్రకారుడు, నటుడు, సినీరచయిత, నాటకకర్త, రాజకీయ కార్యకర్త, సాంస్కృతిక సంస్థల సంచాలకుడు, సాహితీ పత్రికల సంపాదకుడు.. ఇలా బహు ముఖ్యమైన ప్రతిభామూర్తి మయకోవస్కీ.

రాజకీయం, ఆర్థిక స్థితిగతులను మౌలికంగా అభివృద్ధిపరచి, మానవ సంస్కృతిని ఉన్నతీకరించి ఒక నూతన మానవుని ఆవిర్భావానికి అనువైన సామాజిన వ్యవస్థలను నెలకొల్పటమే సోషలిస్టు తాత్వికతకు భూమిక. వర్గ పోరాటాల ద్వారా, దోపిడీ పీడనలు లేని, వర్గరహిత సమసమాజంవైపు నడిపించడమే దాని కార్యాచరణ. ఆ మహత్తర కార్యనిర్వహణకు కవులు, కళాకారులు, రచయితలు కూడా తమతమ నైపుణ్యాలను అంకితం చేసి “విప్లవకారుల సహయాత్రికులు” అయ్యారు. కొందరు విప్లవోత్తేజంతో విప్లవ పార్టీతో చేతులు కలిపి విప్లవంలో భాగస్వాములవుతారు. కార్యకర్తలవుతారు. నేతలుగా ఎదుగుతారు. అలాంటి కోవలో రష్యన్ బోల్షివిక్ పార్టీతో మమేకమై అటు సాంఘిక ఉద్యమంలోను ఇటు సాహిత్య ఉద్యమంలోను పాల్గొని బలమైన ముద్ర వేసిన ప్రముఖులలో మయకోవస్కీ ముందు వరసలో నిలుస్తాడు.

రష్యన్ జారు చక్రవర్తుల పాలనలో జార్జియా ప్రాంతంలోని భాగ్‌దావీ నగరంలో 19 జులై 1893న జన్మించాడు. తండ్రి రష్యా కోసక్కుల (రైతుల) బిడ్డ. తల్లి యుక్రేనియన్ వనిత. ఇంటి భాష రష్యన్. తల్లి భాష జార్జియన్ ‘అందుకే నా జీవితం మూడు సంస్కృతుల సంగమక్షేత్రమయ్యింది’ అని ఆయన చెప్పుకున్నాడు. 1902లో ఆయన హైస్కూలు విద్యార్థిగా ఉండగానే సోషలిస్టు ప్రదర్శనల్లో పాల్గొనేవాడు. అపరిమితమయిన స్వేచ్ఛ వలన మీ పిల్లవాడు చెడిపోతున్నాడని ఎవరైనా ఆక్షేపిస్తే ఆ తల్లి ‘నాకొడుకు ఈనాటి అవసరాలకు, వైఖరులకు అనుగుణంగానే ప్రవర్తిస్తున్నాడు. అతని ఆకాంక్షలకు నేను ఎందుకు అడ్డం చెప్పాలి?” అని అనేవారట. ఫారెస్టు రేంజరుగా పనిచేస్తున్న తండ్రి 1906లో అనూహ్యంగా చనిపోవడంతో ఈ కుటుంబం మాస్కో నగరం చేరుకుంది. ఇక అప్పటినుండి మాస్కోనే అతని నివాస స్థావరమయ్యింది.

హైస్కూలులో చేరిన మయకోవిస్కీ అక్కడి సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ కార్యక్రమాలలో పాల్గొనేవాడు. తత్వశాస్త్రం ముఖ్యంగా మార్క్సిజం అతనికి అభిమాన పాత్రమైన విషయంగా వుండేది. అయితే స్కూలు ఫీజు కట్టుకోలేని దుస్థితిలో అతను 1908లో స్కూలు నుంచి తొలగించబడ్డాడు. అప్పటికే ఏర్పడిన రాజకీయ అభిప్రాయాలవల్ల సాగిస్తున్న కార్యక్రమాల ఫలితంగా అనేకమార్లు అరెస్టు అయ్యాడు. దాదాపు 2 సంవత్సరాల జైలు జీవితం అనుభవించాడు. ఈ జైలు జీవితంలోనే తొలి కవితాక్షరాలు దిద్దుకున్నాడు. 1910లో జైలు నుంచి విడుదలయ్యాకనే చిత్రలేఖనం అభ్యసించసాగాడు. 'విప్లవమూ, కవిత్వమూ' నా మనసును పూర్తిగా ఆకట్టివేశాయి అని చెప్పుకున్నాడు. చిత్రలేఖనం నేర్చుకుంటున్నా, సోషలిస్టు కవిత, కళలు అధ్యయనం చేయటానికి ఉబలాటపడ్డాడు. పార్టీ కార్యకర్తగా కన్నా సోషలిస్టు కళాకారునిగానే తనను మార్చుకోసాగాడు. ప్రత్యక్ష రాజకీయ కార్యక్రమాలకు దూరంగా జరిగాడు. ఈ పరిశీలనలు, అధ్యయనాలు ఆయనలో కొత్త భావాలు నింపసాగాయి. ఇటలీలో పుట్టి పెరుగుతున్న ఫ్యూచరిస్టు ధోరణులను అలవరచుకొన్నాడు. 1912లోనే 'రష్యా ఫ్యూచరిస్టు మానిఫెస్టో'గా పేరొందిన ప్రజా అభిరుచులపై ఒక చెంపదెబ్బ' (A slap on the face of public taste) అనే సంకలనం విడుదల అయ్యింది. దానికి సంతకం దారు మయకోవస్కీ.

సంప్రదాయ కవిత్వాన్ని విడనాడి నూతన ప్రయోగ శీలతను సంతరించుకోవటం, పారిశ్రామిక విప్లవం తెచ్చిన సాంకేతిక పరిజ్ఞానం, యంత్రం, స్వయంబోధిత సాధనాలు, మెరుగుపడ్డ రవాణా సౌకర్యాలు అభివృద్ధికి సోపానాలుగా కనబడ్డాయి. అవి తెస్తున్న, తేనున్న సామాజిక మార్పులకు ఫ్యూచరిస్టులు (భావివాదులు) ఆహ్వానం పలికారు ఆ కొత్తను స్వాగతించడానికి, పాత నుంచి పూర్తిగా విడగొట్టుకోవాలని ప్రయత్నించారు. సాహిత్యంలో నూతన విధానాలు ప్రవేశపెట్టారు. పాత ఛందస్సులను నెట్టివేస్తూ, కొత్త అలంకారాలతో, ఒకింత ఆడంబరంగా, కొత్త నుడికారాలతో ఒక నూతన సాహిత్య భాషను తయారు చేసుకున్నారు. సాహిత్యానికి పనికిరాదని తోసివేయబడ్డ వీధి భాషను ప్రయోగించారు. 1915లో (A Cloud in Trousers) క్లౌడ్ ఇన్ ట్రవ్‌సర్స్ అనే దీర్ఘకావ్యం ప్రకటించాడు. ఆ భాష, శైలి, అనూహ్యమైన పదప్రయోగము, గేయం నడక అందరినీ గొప్ప ఆశ్చర్యానికి గురిచేశాయి. వీళ్ళు గేయం చదివేతీరు, వేషభాషలు చాలామందికి కొత్తగాను, ఆసక్తికరంగాను అనిపించాయి. నిజానికి 1913లో రాసిన (I, Myself) వ్లాదిమిర్ మయకోవస్కీ అనే ప్రదర్శనలో ఆయన పాత్ర చేసిన నటనతోనే అందరి దృష్టినీ ఆకర్షించాడు.

"ఈ ఆధునిక కవితా శకటం నుంచి పుష్కిన్, టాల్‌స్టాయి లాంటి వారిని కిందికి లాగివేయాలి" అనేంత బలగాన్ని సంతరించుకుంది ఈ నూతన కవితా ఝంఝ, "కవిత్వాన్వేషకుడు" "సృజనశీలి" "లయ విన్యాస మాంత్రికుడు అనే పేరు పొందసాగాడు. ఈ దశలో ఆయన పెట్రోగ్రాడ్‌కు వెళ్ళాడు. 1915 నుంచి 1917 ఆగస్టు వరకు మిలటరీ ఆటోమొబైల్ స్కూలులో డ్రాఫ్టుమన్‌గా పనిచేస్తూ మరోవంక తన సాహిత్య వ్యాసంగాన్ని ముమ్మరం చేశాడు. ఈయన జీవితంలో ఆ తరువాత అత్యంత ప్రభావశీలమయిన పాత్ర వహించిన లిలీ బెర్క్ దంపతులతో అప్పుడే పరిచయం ఏర్పడింది. మాక్సింగోర్కీ వంటి రచయితల సాహచర్యం లభించింది. గోర్కీ పత్రికలో మయకోవస్కీ పని చేశాడు. వివాహిత అయిన లిలీబెర్క్ పట్ల విపరీతమయిన వ్యామోహము, ప్రేమ పెంచుకున్నాడు. ఈ పెట్రోగ్రాడ్ జీవితంలోనే ఆయన రష్యన్ విప్లవపు ఎత్తుపల్లాలు, ఉత్సాహ ఉత్పాతాలు అన్నీ దగ్గరుండి చూశాడు. "సంశయమేలేదు. ఇది నా విప్లవమే" అని నిర్ణయించుకుని ప్రత్యక్షంగా కార్యాచరణకు ఉపక్రమించాడు. మహానేత లెనిన్ ఉపన్యాసాలు వినేవాడు. తన కలం గళం ఆ విప్లవ సంకీర్తనానికే అంకితం చేశాడు. ఎన్నో ప్రేరణాగీతాలు రాశాడు. నాటకాలు రచించాడు. నౌకాదళాల థియేటర్లలో పాటలు వినిపించాడు. 'విప్లవానికి స్వాగతం', లెఫ్ట్‌మార్చ్, మిస్టరీ బుఫే వంటి రాజకీయ వ్యంగ్య నాటకాలు ఆ కాలంలో (1918)లో వెలువడ్డవే.

'నేను కవిని నన్ను ఆసక్తికరంగా మార్చింది కవిత్వమే నేను రాసేదంతా దానిగురించే" అని విప్లవంలో భాగస్వామి అయ్యాడు విప్లవానంతరం తిరిగి మాస్కో చేరకుని రష్యన్ టెలిగ్రాఫ్ డిపార్టుమెంటులో పనిచేశాడు. అయితే ఆయన ప్రధాన వ్యాపకం అప్పుడే పుట్టి పొత్తిళ్ళలో కదులాడుతున్న సోవియట్ శ్రామిక రాజ్య ప్రచారమే. "విప్లవకవి పని పుస్తకాలు రాయటం మాత్రమే కాదు" అరకొర చదువులు, అంతంత మాత్రం అక్షర జ్ఞానం వున్న ప్రజలకు ఏ రూపంలో వీలయితే ఆ విధంగా సమతారాజ్యపు సందేశాల్ని అందివ్వగలగాలి అని భావించి అనేక ప్రచార పోస్టర్లు, ప్రచార చిత్రాలు, కరపత్రాలు,

నినాదాలు, కవితా శకలాలు విరజిమ్మి తన కవితా పాటవమంతా వినియోగించి వాటిని ఆకర్షణీయంగా తయారు చేసి కమ్యూనిస్టు వ్యవస్థ పాదుకొనడానికి ఒక ప్రచార యుద్ధమే చేశాడు. పెట్రోగ్రాడ్ రక్షణ కోసం కూడా 1919 నుండి ఇలాగే అవిశ్రాంతంగా అనేక ప్రచార గీతాలు రాశాడు. కొన్ని సినిమాలకు స్క్రీన్‌ప్లేలు సమకూర్చాడు. కొన్ని సినిమాల్లో నటించాడు. మరోవంక వామపక్ష కళాకారుల సంఘాలను ఏర్పరచడం, సమన్వయం చేయటం, వారి పత్రికకు సంపాదకునిగా వ్యవహరించటంలో తలమునకలయ్యాడు.

వామపక్ష కళలని చెప్పబడుతున్న వాటన్నింటినీ పున:పరిశీలించి వాటిలోని వ్యక్తిగత ధోరణులను పరిహరించి, సామ్యవాద వ్యవస్థ నిర్మాణానికి తోడ్పడే విలువైన కళలను పెంపొందించడమే తమ లక్ష్యమని చెప్పుకున్నాడు. 1909-1919 వరకు వచ్చిన తన రచనలన్నీ ఒక సంకలనంగా ప్రచురించాడు. ఈ సంకలనం ద్వారా ఆయన ప్రతిభామూర్తి మరింత జేగీయమానంగా వెలుగొందసాగింది. 1920ల కల్లా క్రమంగా రష్యన్ పరిపాలనలో బ్యూరోక్రసీ పాదుకొనసాగింది. అధికారుల ఇష్టారాజ్యంగా పాలన కుంటుపడింది. దానిమీద వ్యంగ్యంగా Reconference రికాన్ఫరెన్స్ అనే రచన వెలువరించాడు. ఈ రచన లెనిన్ దృష్టికి వెళ్ళగా ఆయన "నేను వయకోవస్కీతో ఏకీభవిస్తున్నాను. జన శ్రామిక రాజ్యాన్ని అధికార వర్గం క్రమంగా కబళించి వేస్తున్నది" అని తగిన చర్యలకోసం ఆదేశించాడు.

ఈ అంకితభావం, అసాధారణ ప్రతిభాపాటవాల వల్ల సమకూరిన కీర్తి ప్రతిష్టలతో ఇతర రచయితలకు, కళాకారులకు లేని కొన్ని వెసులుబాట్లు, సౌకర్యాలు మయకోవస్కీకి లభించాయి. ఈ అనుకూల పరిస్థితులకు ఆయన తన దేశవిదేశ పర్యటనలకు వినియోగించుకున్నాడు. దేశమంతా ఏ విధి నిషేధాలు లేకుండా సందర్శించేవాడు లాటివా, బ్రిటన్, జర్మనీ, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, మెక్సికో, క్యూబా వంటి అనేక దేశాలు చుట్టివచ్చాడు. అలాంటి పర్యటనల నుండి తిరిగివచ్చేటప్పుడు అక్కడి కళాకృతులు, సమకాలీన చిత్రాలు, లెక్కలేనన్ని పుస్తకాలు తెచ్చి మిత్రులకు అందించే వాడు. అలా పాశ్చాత్య ప్రపంచంలో కళారంగంలో వస్తున్న నూతన ధోరణులు, కొత్త ఆలోచనలు బాగా అవగతమయ్యాయి. ఈ దశలో 1924లో లెనిన్ అస్తమించాడు. తన ప్రియతమ నాయకునికి శ్రద్ధాంజలిగా 3000 వాక్యాల దీర్ఘ స్మృతిగీతం రాశాడు మయకోవస్కీ. దాన్ని ఆయన చదువుతుంటే వేలాదిమంది కన్నీటితో కదలిపోయేవారట. ఆ తరువాత ఈ గీతం స్కూలు పిల్లల పాఠ్యాంశమై విద్యార్థులందరూ కంఠపాటం చేయవలసిన ప్రత్యేక అంశంగా నిలిచింది. (ఈ గీతాన్నే శ్రీశ్రీ అనువదించి మనకందించారు) 1925లో తన పర్యటనానుభవాలతో 'మై డిస్కవరీ ఆఫ్ అమెరికా' ను ప్రకటించాడు. నిజానికి 1922 నుంచి 28 వరకు ఆయన వామపక్ష కళా సంఘటన (LEFT ART FRONT) గా పనిచేశాడు. 'కట్టుకథలు కాదు కల్పనలు కాదు సత్యాలే సాహిత్యం' (Literature of FACTS NOT FICTION ) అన్న దృక్పథంతో తన రచనలు కొనసాగించాడు. దాన్ని ఆయన కమ్యూనిస్టు ఫ్యూచరిజం (COMFUT) అని వ్యవహరించేవాడు. అధికార వర్గాన్ని, పార్టీ నాయకత్వ పోకడలను అధిక్షేపించే రచనలను వాస్తవాల పేరిట ప్రచురించసాగాడు. ఒక రకం అసమ్మతి స్వరం బలంగా వినిపించాడు. అయితే బోల్షివిక్కులు వీటిని ప్రయోగాత్మక కళల పేరిట వస్తున్న విమర్శలను అంగీకరించలేని దశ వచ్చింది. రష్యన్ శ్రామిక రచయితల సంఘం ఈ వైఖరిని గట్టిగా ఎదుర్కొంది. రాజ్యం సాహిత్యాన్ని సెన్సారు చేస్తోందని మయకోవస్కీ ఎదురుతిరిగాడు. 'సుంకాలు వసూలు చేసే వాళ్ళతో కవిత్వం గురించి మాట్లాడమా? (Talking with taxman about Portry) అని 1926లోనే తన భిన్న వైఖరిని ప్రదర్శించాడు. 1928లో ఆల్‌రైట్, ది బెడ్‌బగ్ (నల్లి), 1929లో బాత్ హౌస్ (స్నానాలగది) వంటి వ్యంగ్య నాటకాలు రచించాడు. ఈ రచనలన్నింటినీ రచయితల సంఘం తీవ్రంగా విమర్శించింది. ఆక్షేపించింది. 1928లో ఆయన ఏర్పాటు చేసిన తన 2 దశాబ్దాల సాహిత్యావలోకనం ప్రదర్శనకు అధికారవర్గం సహకరించలేదు. నాటి రష్యా అధినేత స్టాలిన్ ఈ ప్రదర్శనకు వస్తారని మయకోవస్కీ ఆశించాడు కానీ అది జరగలేదు. చివరకు 1930 ఏప్రియల్ తొమ్మిదిన ఆయన విద్యార్థుల సభనుద్దేశించి చదివిన కవిత 'ఉచ్ఛస్వరంతో' (At the top of my voice) అస్పష్టంగా, నిగూఢంగా వుందని విమర్శిస్తూ ఆయనను స్టేజీ దిగిపొమ్మని ఆందోళన చేశారు. మనసు వికలమై మయకోవస్కీ వెనుదిరిగిపోయాడు. 'పిత్‌ఫుల్ వాయిస్' అనే కావ్యరచన సాగిస్తున్న ఆ కాలంలోనే ఏప్రియల్ 19న (1930) తనను తాను కాల్చుకుని చనిపోయాడు. ఈ ఆత్మహత్య ఒక పెనుసంచలనమే కాక రష్యన్ ప్రభుత్వ వ్యవహారం మీద అనేక నీలినీడలు కప్పింది. ఈ సామాజిక జీవితంతోపాటు

మరో వ్యక్తిగత జీవిత కోణం కూడా మనం పరిశీలించాలి. అది ఆయన ప్రైవేటు జీవితంలో మహిళలతో వున్న సంబంధాలు ఆయన జీవితమంతా ప్రేమించబడాలని అర్రులు చాశాడు. 1915లో పరిచయమైన లిలీబెర్క్ (వివాహిత)తో ఆయన పెనవేసుకున్న జీవితం ఆసక్తికరమయినది. ఆమెకోసం ఎన్నో కవితలు అల్లాడు. తన పుస్తకాలనెన్నింటినో ఆమెకు అంకితమిచ్చాడు. తనకోసం వెంపరలాడిపోతున్న మయకోవస్కీ పట్ల ఆవిడ కూడా సానుకూలంగానే వుండేది. అతని సాహిత్య జీవితానికి కవితావేశంగా మిగిలిపోవాలని ఎంతో జాగ్రత్తగా ఆస్థానం ఇంకెవరికీ దక్కకూడదన్న శ్రద్ధగా అతనితో వ్యవహరించేది. జీవితమంతా తన వెంట తిప్పుకొంది. ఆమెను తన జీవితంలో అత్యంత ఆప్తురాలిగా ఆయన భావించాడు. అయితే అమెరికా పర్యటనలో వున్నప్పుడు మయకోవస్కీ ఎల్లీజోన్స్ అనే మహిళతో కొంతకాలం సహజీవనం చేశాడు. ఈవిడ విప్లవానంతరం రష్యానుండి న్యూయార్క్‌కు తరలి వెళ్ళిన స్త్రీ.. వీరిద్దరికీ వివాహం చేసుకోవాలని ఉండేది కానీ రష్యన్ సోషలిస్టు సాహిత్య ప్రచారకునిగా, ఒక ప్రతినిధిగా వున్న తను, రష్యా వ్యవస్థను కాదని ప్రవాసం వెళ్లిపోయిన యువతిని పెండ్లి చేసుకోవటం ఎంతవరకు సబబు అనే విచికిత్సకు లోనయ్యాడు. అందుచేత ఈ సంబంధం రహస్యంగానే వుండిపోయింది. కానీ వీరిద్దరికీ 1926లో ఒక కూతురు జన్మించింది. తదనంతర జీవితంలో ఆ కూతురిని ఒకే ఒక్కసారి చూశాడు మయకోవస్కీ. అలాగే పారిస్‌లో కొన్నాళ్ళపాటు తతియాన అనే సుందరి (ఫాషన్‌మోడల్)తో చాలా చనువు ఏర్పడింది. ఆమెను పెండ్లి చేసుకోవాలని ప్రతిపాదించాడు. ఆమెకోసం తన నివాసం పారిస్‌కు మార్చుకోవడానికి సిద్ధమయ్యాడు. కానీ వీసా లభించలేదు. తనకు దూరమై పోతాడని భావించి లిలీబర్క్ ఈ వీసా రాకుండా చేసిందనే ప్రచారం వుంది. తాతియానకు ఆయన రెండు కవితలు అంకితమిచ్చాడు. 'ఆన్‌ది ఎసెన్స్ ఆఫ్ లవ్' అనే ఉత్తరం చాల ప్రసిద్ధమయింది. దాంతో లిలీ నువ్వు నన్ను మోసం చేస్తున్నావు. మరొకరి పేరున కవిత రాశాడు అని బహిరంగంగానే అక్కసు వెలిబుచ్చింది. తన విరహం వల్లనే అతను మంచి కవిత్వం రాయగలడని ఆమె భావించింది. మయకోవస్కీ కూడా "నా కన్నీళ్ళనే కావ్యాలుగా మలుస్తాను' అని చెప్పేవాడు. మాస్కోలో వెరోనికా పోలనోస్కయా అనే నటీమణికి కూడా దగ్గరయ్యాడు. ఆమెతో కూడా వివాహ ప్రస్తావన తెచ్చాడు. 'కవిగారిని ప్రేమిస్తున్నా కానీ నా భర్తను వొదిలి రాలేనని' ఆవిడ స్పష్టం చేసింది. 1930 ఏప్రిల్‌లో, మయకోవస్కీ మరణం రోజున ఆఖరిసారి ఆయనతో మాట్లాడినది కూడా ఈ యువతే. వరుసగా ప్రేమ వ్యవహారాలు తనకు అనుకూలించకపోవటంతోను వెరోనికా తనను కాదన్నదన్న దుగ్ధతోను మయకోవస్కీ తన జీవితాన్ని అంతం చేసుకున్నాడనేది బలమైన కథనం. ఒకవైపు ప్రేమ వ్యవహారాలతో అపజయం, మరోవైపు అధికార వర్గాలతో పొసగకపోవటం సహజంగానే భావావేశపరుడయిన ఈ కవిని ఆత్మహత్యకు ప్రేరేపించాయంటారు. ఆత్మహత్యకు రెండు రోజుల ముందే రాసిపెట్టుకున్న ఒక ఉత్తరంలో 'కామ్రేడ్స్ నన్ను పిరికిపందగా భావించకండి. నేను చేస్తున్నది సరిఅయినది కాదు. దీన్ని నేను ఎవరికీ పరిష్కారంగా సూచించను.. కానీ నా జీవితం ముగింపుకు నచ్చింది కానీ మరణమే శరణ్యం" అని వుంది. అంతకుముందు కూడా "నిన్ను మరోసారి చూడలేకపోతే నా మెదడులోకి కాల్చుకుని చచ్చిపోతాను" అని ఆయన అన్నాడట. ఇవన్నీ ఆత్మహత్య కథనానికి ఆలంబనగా ఆనాటి రష్యన్ పరిస్థితులు, రచయితలు, ఆయన శరీరంలో లభించిన బుల్లెట్ ఆయన కాల్చుకున్నాడని చెబుతున్న రివాల్వర్‌ది కాకపోవటం వంటి అంశాలు "ఇది రాజ్యం చేసిన హత్య ఏమో" అనే సంశయాన్ని మిగిల్చాయి. 'నా చావును వివాదం చేయకండి" అని ఆఖరి ఉత్తరంలో వున్న (ఆ చేతిరాత మయకోవస్కీదే అని నిపుణులు తేల్చిన తరువాత కూడా) ఈ చావు ఈనాటికీ ఒక మిస్టరీగానే మిగిలి పోయింది. ఈ సందర్భంలో వివాదాలకు సమాప్తి పలకాలని రష్యన్ అధినేత స్టాలిన్ 'మయకోవస్కీ మనకాలపు, సోవియట్ శకపు అత్యంత ప్రతిభాశాలి అయిన కవి" అని ప్రకటించాడు. కానీ అది ఒక భాతృహంతకుని వ్యూహాత్మక ప్రకటన అనే భావించేవారు ఈనాటికీ వున్నారు.

ఏదయినా ఒక ప్రేమ కాక, వ్యవహార జీవితపు ఆటుపోట్లకు తట్టుకోలేక జీవన కాఠిన్యాలకు గుద్దుకుని విచ్ఛిన్నమయి పోయింది.

ఆయన అంతిమయాత్రలో ఆనాడే లక్షయాభైవేల మంది పాల్గొన్నారన్న ఒక వాస్తవం ఈ కవికి వున్న ప్రజాభిమానాన్ని వేలగొంతులతో చాటుతోంది. మాస్కో నావోదెలిచీ స్మశాన వాటిక (ఇది రష్యన్ ప్రముఖుల చిట్టచివరి 'విశ్రాంతి' స్థలం)లో ఆయన స్మారక చిహ్నం నుంచి మయకోవస్కీ క్రోధారుణ దృక్కులు "ఈ ప్రపంచాన్ని మీరు ఎటువైపు తీసుకు వెళ

తున్నారు? ఏ విలువల కోసం నిలబడుతున్నారు?" అని సందర్శకులను నిలదీస్తూనే వున్నాయి. ◆



# దండయాత్ర

మూలం: మయకోవస్కీ
తెలుగు: డా॥యస్.జతిన్‌కుమార్

తిరుగుబాట్ల పదధ్వనులతో నగరకూడళ్ళు మార్మోగనీ
సమున్నతంగా, సగర్వంగా తలఎత్తిన ప్రస్థానం పురోగమించనీ
ఈ ప్రపంచాన్ని ప్రక్షాళించే మరో జలప్రళయంలా హెూరెత్తనీ
మన రాకతో ఈ సమయం భయకంపితమై పోనీ..
కాలచక్రం బహునెమ్మదిగా కదులుతోంది
కాడెద్దుల్లా మరీ మందకొండిగా..
ఎంతో చింతా జనకంగా..
మన దైవం వాయువేగం
మన హృదయం ఒక సమరభేరి
మన ఆశయాన్ని మించిన దివ్యకాంచనం వేరేముంది?
ఈ తుపాకిగుళ్ళ కందిరీగలు కుట్టి బోధించగలవు మనల్ని?
పాటలే మన ఆయుధాలు, మన సర్వశక్తులు శక్తిరూపాలు
మన కంఠాలే స్వర్ణమాగాణాలు. ఒక్కసారి వినిచూడు మాగానాలు
ఓ పచ్చికబయలూ, భూమినంతా పచ్చపచ్చగా ఆక్రమించు!
మా పగళ్ళకు పట్టుదారాల అంచులు సమకూర్చు!
ఓ ఇంద్రచాపమా, రేసుగుర్రాల్లా పరుగులెత్తే కాలానికి జవం జీవం కల్పించు
మైమరపించే గాన సౌందర్యానికి
అల వైకుంఠాలే మత్సర పడుతున్నాయి
ఏ ఆకర్షణలు లేకున్నా మన సంగీతాలు
చిరకాలం జయగీతాలై వర్ధిల్లుతాయి
ఆ వేకువ చుక్కల దండును చూడు
మనల్ని సజీవంగా స్వర్గానికి తోడ్కొని వెళ్ళాలని
సందడి సందడి చేస్తోంది
అంతరంగంలోని ఆహ్లాదం ఉప్పొంగేలా పాడు
చిన్ని చిన్న గుటకలతో కాదు
గిన్నెలు గిన్నెలుగా ఆ ఊటనీటిని ఆస్వాదించనీ
హృదయమా నీ స్పందనలనేకంగా మరింత విక్రమించనీ
ఎదనే తాళవాద్య కంచుకంఠమై ప్రతిధ్వనించనీ..

రష్యన్ రచయిత మయకోవస్కీ **'OUR MARCH' (1917)** కవితకు తెలుగు అనువాదం. **1972**లో ప్రగతి ప్రచురణాలయం ముద్రించిన డొరియన్ రోటెన్‌బర్గ్ ఆంగ్లానువాదం ఆధారంగా..మయకోవస్కీ **125**వ జయంతి ఈ సంవత్సరం. ఆ సందర్భంగా ఈ కవితానువాదం. ◆

---

# మేరా భారత్ మహాన్

- గరికిపాటి మాస్టారు
8897672733



అదుపు తప్పుతున్న నేటి సమాజం పోకడ..
పట్టాలు తప్పుతున్న రైలు బండి
దేశం దేహానికీ ఎన్నో తూటాల తూట్లు
ఒకటా! రెండా!!
అకారాది పదాల మయం
అవినీతి – అధర్మం – అన్యాయం – అరాచకం
ఇలా.. ఇలా.. ఎన్నో.. ఎన్నెన్నో
నిజమే! మేరా భారత్ మహాన్ అని నినదించడమే
కాని – నిలకడేది ఆ పేరు నిలపడానికి
సోదరా! నీతికోసం వెదుకుచున్నావా?
అది ఆఫీస్ బల్లల కింద
అవినీతి చేతులమధ్య చిక్కుకుంది. వెళ్ళిపట్టుకో.
ధర్మం భూకబ్జా చేసే బడా బాబుల చేతుల్లో..
అధర్మం మధ్య చిక్కుకుంది. బయటకు లాగుదాం పద
న్యాయం పారిపోతోంది న్యాయ స్థానం కాంపౌండులోంచి
దాన్నాపుదాం పద.
అరాచకం ఉగ్రవాదులు పట్టుకున్న **A.K.47** రైఫిల్స్ చేతిలో
ఇమిడి పోయింది. జాగ్రత్త.
నేటి భారతదేశపటం ఛిద్రమైన సంస్కృతీ తెరపై కనబడుతోంది
ఇక కైమోడ్పులు మానేయ్!
కరదండలు సృష్టించి కదలుదాం
అందరం జూలు విదల్చిన కవి సింహాలౌదాం
అప్పుడు నినదిద్దాం "మేరా భారత్ మహాన్" అని. ◆

**కథ**

# విలువైనది జీవితం

- మీనాక్షి శ్రీనివాస్
9492837332



ప్రియాతిప్రియమైన మధు లతలకు,

మీ పేర్లు చూడండి ఎంత బాగా కలసిపోయాయో .. అలాగే మీ మనసులూ కలసి పోవాలనే ఆశతో మీ పేర్లను యిలా ఒకటిగానే వ్రాస్తున్నా. నేను చెప్పేది కొంచెం శ్రద్ధగా, ఓపికగా చదవండి పిల్లలూ .. చదువులో, విజ్ఞానంలో చిన్నవాడినే అయినా వయసులో, అనుభవంలో పెద్దవాడినే, మీ మంచి కోరి మీకు చెప్పదగ్గవాడిననే చనువుతో నాలుగు మాటలు మనసుకు తోచినవి చెబుతున్నా ..

జీవితం స్వీట్ అండ్ షార్ట్ .. అవునుకదా , ఈ కొద్దిపాటి జీవితంలో కోపాలకూ, అసహనాలకూ, అపార్థాలకూ .. విసుగులకూ ఎక్కువ విలువిస్తే మనం పొందేదేముంది చిరాకూ, దుఖం తప్ప. ఎదుటివాళ్ళు ఎలా ఉండాలని మనం ఆశిస్తామో, ఎలా ఉంటే మనం ఇష్టంతో దగ్గరవుతామో మనం కూడా ఇతరులకు అలాగే ఉండాలి కదా. ఎదుట వ్యక్తి ఏ పని చేస్తే మనం బాధపడి వాళ్ళకు దూరం అవుతామో ఆ పని మనం వేరే ఎవరికీ చెయ్యకూడదు కదా.

నా దృష్టిలో ప్రేమా, గౌరవం, విలువ అనేవి మన ప్రవర్తన బట్టే వస్తాయి .. ఒకవేళ అవి రాకపోయినా మన ప్రవర్తన, ఆలోచన ప్రశాంతంగా .. ఉండాలి, అవి కేవలం మన కోసం. మనల్ని సరిగా అర్థం చేసుకోక మనల్ని బాధపెట్టి, వాళ్ళు బాధ పడితే అది వాళ్ళ తలనెప్పి. నిజమే మనని ఎవరైనా ఏదైనా అంటే బాధ కలగడం మానవ సహజం కానీ వాటినే వల్లె వేసుకుంటూ, బాధపడుతూ వాళ్ళు చేసిన తప్పులే మనమూ చేస్తే అర్థం ఏముంది.

తప్పులనేవీ, లోపాలనేవీ లేని మనిషే ఉండరు .. మన అనుకున్నప్పుడు వాటితో సహా వాళ్ళను ప్రేమించడమే మనం చెయ్యాల్సిన పని.

మొన్న నేను మాట్లాడినప్పుడు నాకు ఒక విషయం అర్థం అయ్యింది మీకు అందరూ కావాలి, అందరితో ప్రేమగా అభిమానంగా ఉండాలి. అది చాలా మంచి లక్షణం. దానికోసం జరిగినవన్నీ మరచిపోయి నాలుగు మెట్లు దిగి మనమే పలకరించినా తప్పులేదుగా.

ఇదంతా ఉపన్యాసం అనుకోకండి .. నా మనసులో భావాలు మీకు చెబుతున్నా ... పనికొస్తే ఆచరించండి. తప్పనిపించినా, బాధ కలిగినా మరచిపొండి .. సరేనా . మీ ఇప్పటి ప్రవర్తన రేపు మీ పిల్లల వ్యక్తిత్వాలమీద మీద పడుతుంది.. నాకు తెలిసి మీ పిల్లలకు కాస్త జ్ఞానం వచ్చినప్పటి నుండీ మీరిద్దరూ ఎడముఖం, పెడ ముఖంగానూ, ఎడ్డెం

అంటే తెడ్డెం గానే ఉన్నారు, మీరిద్దరూ చీటికీ మాటికీ ప్రతి చిన్న విషయానికీ దెబ్బలాడుకుంటూ మీ ఇంటిని నరకం చేసుకుంటూ ఉంటే అది మీకు మాత్రమే కాదు మీ పిల్లలకూ మంచిది కాదు. వాళ్ళకు బలమైన, మంచి వ్యక్తిత్వం స్థానే గయ్యాళితనం, ఒకరకమైన మొండితనం అలవాటు అవుతాయి ఫలితం వాళ్ళూ పెద్దయ్యాకా జీవితానందాన్ని కోల్పోతారు. ప్రతి మనిషికీ జీవితంలో సర్దుబాటు తత్వం అవసరం, మన ఆత్మగౌరవం దెబ్బతిననంత వరకూ సర్దుకుపోవడం అనేది నాకు తెలిసి మంచి లక్షణమే కానీ అదేమీ కూడనిదో, అగౌరవమో కాదు. ఒకవేళ ఎదుటివాళ్ళు చెప్పేది తప్పయినా, మీకు నచ్చకపోయినా వాళ్ళకు అర్థం అయ్యేలా నచ్చచెప్పాలే కానీ గొడవపడకూడదు. గొడవపడడం వలన మనసులు దూరం అవుతాయే కానీ సమస్యలు పరిష్కారమవవు.

లతా నువ్వు ఇన్ని సంవత్సరాలుగా నీ మనసు ఎంత కష్టపెట్టుకుని బాధపడ్డావో నీ మాటల వలన అర్థం అయ్యింది, అలాగే నువ్వు మీ అత్తమామలతో కలివిడిగా ప్రేమగా ఉండాలనుకోవడం వాళ్ళూ మీతో మీ పిల్లలతో అలా ఉండాలనుకోవడం నిజంగా నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. మధు మాట తీరో లేకపోతే వాడు నీతో ప్రవర్తించిన తీరో నిన్ను బాధపెట్టి ఉంటాయి. కానీ వాడికి నీ మీద ఎంతో ఇష్టం, ప్రేమా, నువ్వు మంచిదానివనే నమ్మకం, గౌరవం ఉన్నాయి. ఉద్యోగ నిర్వహణలో విసుగో, నిన్నూ వాళ్ళ తల్లితండ్రినీ కలపలేకపోతున్నాననే నిరాశో , చక్కగా చెప్పే నేర్పు లేకో ఏవో ఏవో అలా జరిగిపోయాయి. ఇప్పుడవన్నీ ఇద్దరూ మరచిపోయి ఇకనుంచీ ఒకరినొకరు ఇంకా బాగా అర్థం చేసుకుంటూ .. ఒకరికి కోపం వస్తే ఇంకొకరు మౌనం వహిస్తే చాలా మటుకు సమస్యలుండవు.

మధు .. నువ్వు కూడా సాధ్యమైనంత వరకూ టెన్షన్, అసహనం తగ్గించుకో మళ్ళీ మళ్ళీ చెబుతున్నా మీ ఇప్పటి ప్రవర్తన రేపు మీ పిల్లల వ్యక్తిత్వాలమీద రిఫ్లెక్ట్ అవుతుంది. జీవితం ఎంతో చిన్నది. ఎవరం ఈ భూమి మీద అలా ఉండిపోము. ఈ కాస్త సమయంలోనే ఈ కోపాలూ, అహాలూ, దుఃఖాలూ అవసరమా?.

మీ అమ్మా నాన్నలూ, అత్తామామలూ పెద్దవాళ్ళయి పోతున్నారు .. మీరు ఏమీలేనిదానికి, గోరంతలు కొండంతలు చేసికొని మీరు బాధపడుతూ ఉంటే వాళ్ళుమాత్రం ఏం సంతోషంగా ఆనందంగా ఉండగలరు .. మేమూ, మాతో బాటు మీరూ అంతా పెద్దవాళ్ళమైపోతున్నాం .. కాలం ఎవరికోసమూ ఆగదు. వెనక్కి తిరిగి చూసుకుంటే మన జీవితాల్లో ఏ ఆనందమూ, అర్థమూ కనబడదు. ఇదంతా మిమ్మల్ని విసిగించడానికి చెప్పడంలేదు. అర్థం చేసుకుంటారని, ఆలోచిస్తారని చెబుతున్నా.

చివరిగా నాదో కోరిక .. లతా మీరు వయసులో చిన్నవాళ్ళు .. అలాగే ఎంతోకొంత బయట ప్రపంచంతో అవగాహన, ఎన్నో రకాల మనస్థత్వాలతో కలసిమెలసి ఉండవలసి రావడం అనే ఓ అనుభవం చదువుల రీత్యా, ఉద్యోగాల రీత్యా ఉంది .. మీ అత్తగారు పెద్దది, తన ఇల్లు, పిల్లలు అదే ఆవిడ ప్రపంచం .. తెలిసో తెలియకో ఆవిడ చేతలకో, మాటలకో నువ్వు బాధపడ్డావు కానీ ఆమెకు మీరంటే ప్రేమలేక కాదురా తల్లీ .. కొంతమంది మాట తీరు మెత్తగా ఉంటే కొంతమంది మాట తీరు మరోలా ఉండి మనకు నచ్చక పోవచ్చు. మళ్ళీ నువ్వు మరి అందరితో అలా ఉండరుగా అంటూ వాదనకు దిగడమో, గతాన్ని తవ్వుకోవడమో చెయ్యకు .. నీవలన, నీ మాట తీరు వలన నీలాగే ఆవిడా మనసు కష్టపెట్టుకుందిగా మరి .. కనుక ఎవరిది తప్పు, ఎవరిది ఒప్పు అని ఆలోచించే కంటే .. ఇద్దరి తప్పూ ఉంది, జరిగిందేదో జరిగిపోయింది, నిండుమనసుతో మరచిపోదాం ఒకళ్ళకొకళ్ళు దగ్గరవుదాం అని ఆలోచించడం తెలివైన వాళ్ళు చేసే, చెయ్యాల్సిన పని. అర్థం అయిందనే అనుకుంటున్నాను. మనకు మన అమ్మా నాన్నల మీద కూడా అప్పుడప్పుడు కోపం వస్తుంది, వాళ్ళ మాటలు విసుగనిపిస్తాయి అంత మాత్రాన వాళ్ళతో మన బంధం తెంచుకోము కదా, ఇదీ అంతే అత్తనూ అమ్మనుకో గలిగితే ఇది చాలా సులభం.

ఈ వయసులో మిమ్మల్నీ, మీ పిల్లల్నీ దూరం చేసుకోవడం వాళ్ళకీ నరకమే, తాతా నానమ్మల ప్రేమ నీ పిల్లలకూ, పెద్దవాళ్ళ ఆదరణ అభిమానం మీకూ దూరం కావడం కూడా బాధాకరమే. నలుగురూ నాలుగు రకాలుగా వెర్రెక్కిస్తారు, చెప్పుడు మాటలు చెప్పే వాళ్ళది కాదు తప్పు వినేవాళ్ళదే. సరే ఇప్పటికే సుదీర్ఘ సుత్తితో మిమ్మల్ని విసిగించాను.

చివరిగా మీ మంచికోరే మీ ఆత్మీయుడిగా ఒక్క మాట .. మీ ఇద్దరూ మాట్లాడుకుని , మనస్ఫూర్తిగా ఇష్టం అయితే, ఒరే నానీ, లతను ఆలోచించుకోనీ, బలవంత పెట్టద్దు. కానీ ఎటువంటి పరిస్తితుల్లోనూ అప్పుడలాగా, ఇప్పుడిలాగా అంటూ గతాన్ని తవ్వుకోవద్దు, అలా చెయ్యగలిగితే .. ఉగాది నాడు

మీ అమ్మానాన్నలతో ఫోన్ చేసి ఇద్దరూ మాట్లాడండి..అస్సలు బలవంత పెట్టద్దు, ఈ విషయమై మీ ఇద్దరూ తగవులాడుకోవద్దు సరేనా. ఇది నాకూ, మీ అమ్మా నాన్నలకూ మీరిచ్చే అతి విలువైన ఉగాది బహుమతి.. మీకూ, పిల్లలకూ ఉగాది శుభాకాంక్షలూ, శుభాశీసులతో.

ఏదైనా పరిధి దాటి మాట్లాడితే మన్నించి మరచిపోండి. సదా మీ మంచి కోరుకునే మీ .. . మామయ్య.

అప్పటికి ఆ ఉత్తరం చదువుకోవడం ఎన్నో సారో, లేదు .. ఏదీ పరిధి దాటి రాయలేదు .. అయినా వాళ్ళ మంచి కోరుకునే ఓ వ్యక్తిగా యిలా రాయడం తప్పేం కాదు. మధు లతా ప్రేమించి ఒకరినొకరు ఎంతో యిష్టపడి పెళ్ళాడేరు. యిరువైపులా ఏ అభ్యంతరాలూ లేకపోవడంతో చక్కగా ఆకాశమంత పందిరీ, భూదేవంత పీటా అన్నట్లు చాలా గొప్పగా చేసారు. మరి సమస్య ఎక్కడ అనేది పూర్తిగా తెలియక పోయినా పెళ్ళయినప్పడి నుండీ ఒకటే కీచులాటలు. నువ్వెంత అంటే నువ్వెంత అంటూ వీధిన పడడం. పెళ్ళయి పదేళ్ళు అయినా వాళ్ళిదరిలో సయోధ్య కుదరకపోవడం ముఖ్యంగా అత్తా కోడళ్ళ మధ్య సయోధ్య తేలేక ఆ తండ్రీ కొడుకులు నలిగి పోవడం .. వాళ్ళనే కాదు నాకు తెలిసిన ఎన్నో కుటుంబాలు ఆ సంక్షోభం తో విలవిలలాడడం తెలిసిన వానిగా నాకు ఈ లేఖ రాయడం తప్పని సరి అనిపించింది. ' వడ్ల గింజలో బియ్యపు గింజ ' అంటారే అట్లాటిదే ఈ అత్తా కోడళ్ళ సంవాదం. నా మాటే నెగ్గాలన్న అహం, నే చెప్పిందే కరెక్ట్ అన్న అహం, ఎదుటివారు ఏం చెప్పాలనుకుంటున్నారో విననివ్వని అహం .. అహం .. అహం రెండక్షరాల ఈ పదం ఒక్క భార్యా భర్తలూ, అత్తా కోడళ్ళూ ఏమిటి ఏ బంధాన్నయినా, ఏ బాంధవ్యాన్ని అయినా చిచ్చుపెట్టి రెచ్చగొట్టి విడదీసే ఆయుధం.

◆◆◆

సుబ్బా రావు నా బాల్య మిత్రుడు. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ ఉండే వాడు సడన్ గా మందకొండిగా, మూగగా ఏదో వేదన అనుభవిస్తున్నట్లు ఉండడం చూసి ఆఫీస్ పని మీద వాడి ఊరు వచ్చినట్లు .. వాడి యింట్లో చొరబడి వాడి వేదనకు కనుగొన్న కారణం చూడబోతే యిది. యిలా అన్నానని యిదేదో ఆషామాషీ వ్యవహారం అనుకునేరు.

' యింటిలోని పోరు యింతింత కాదయా విశ్వదాభిరామ వినురవేమా ' అని ఏనాడో చెప్పాడు మహానుభావుడు వేమన. ఆ ఏముందీ ప్రతి యింట్లో ఉండే గోలేగా అనుకుంటాం గానీ అది చెదలాంటిది మనశ్శాంతిని తినేస్తుంది, ఎంత మందుకొట్టించినా అది ఏదో మూల దాక్కునే ఉంటుంది .. యిదీ అలాంటిదే .. అందుకే దీనిని ప్రేమా, అనుబంధం లాంటివాటితో ప్రతి దినం పటిష్ట పరుస్తూ అహం అనే చెద పట్టకుండా చూసుకోవాలి.

సుబ్బారావుకు ఓ కూతురూ, ఓ కొడుకూ .. నా అల్లుడు బంగారు తండ్రి, నా కూతురు మాట జవదాటడు, సంపాదన తెచ్చి ఒళ్ళో పోస్తాడు అన్న నోటితోనే నా కొడుకు వాజమ్మ, ఆడారచ్చన్నలా పెళ్ళాం కొంగు పట్టుకు తిరుగుతాడు .. లక్షల ఖర్చుతో యింత చదువు చదివి యింతవాడయి సంపాదనంతా పెళ్ళాం దోసిట్లో పోస్తాడు .. యిక్కడ విషయం ఒకటే కానీ కొడుకు .. కూతురు యిద్దరి దగ్గరా వేరువేరుగా మారిపోతుంది .. యిప్పుడు నాగరికత యింకా పెరిగిపోయి అత్తమామలూ, ఆడపడుచులూ ' డస్టబిన్ ' గా రూపాంతరం చెందిపోతున్నారు .. ఇక్కడ అత్తవారింట్లో ఆ పాత్రలే .. మన అన్నదమ్ముల దగ్గరికొచ్చేటప్పటికి మనకూ అదే వర్తిస్తుందన్న కనీస యింగిత జ్ఞానం కొరవడడం ఆశ్చర్యకరం. కనీస వ్యక్తిత్వం నేర్పని తల్లితండ్రుల తప్పా? విలువలు నేర్పని చదువుల తప్పా?

ఎప్పుడో కోడరికం అనుభవించాం కదాని అదే మన కోడళ్ళపై చూపాలనుకోవడం ఎంత మూర్ఖత్వమో, అలాగే ఎప్పుడో అణగదొక్కబడ్డాము కదా యిప్పుడంతకంతా బదులు తీర్చేసుకుందాము అని తిరగబడడమూ అంతే అవివేకం. స్త్రీ .. పురుషులిద్దరూ ప్రకృతిలో భాగాలే , రాత్రీ, పగలూ, వెలుగు .. చీకటీ ఎలా ఒకదాని వెంట మరొకటి విడదీయలేనివిగా ఉంటాయో .. స్త్రీ పురుషులు కూడా అంతే .. సృష్టిలో అవి అవిభాజ్యం అన్న నిజం తెలుసుకుని అవగాహనతో ఆలూమగలు మసిలితే ఏ సమస్యలూ ఉండవు.' చేతిలో ఉత్తరంతో కూర్చున్న నా ఆలోచనలు అలా సాగిపోతూనే ఉన్నాయి, నా శ్రీమతి పిలుపుతో చెదిరే వరకూ.

" ఏమిటీ అంత సుదీర్ఘంగా ఆలోచిస్తున్నారూ? మొన్న మీ స్నేహితులింటినుంచి వచ్చినప్పటి నుండీ చూస్తున్నా .. ఏదైనా సమస్యా? సరే అన్నం తిని తీరుబడిగా ఆలోచిద్దురుగాని కానీ రండి భోజనం చల్లారిపోతోంది." లోపలినుంచి తొంగిచూస్తూ పిలిచింది.

లేచి కాళ్ళూ చేతులూ కడుక్కుని లుంగీ తగిలించుకుని భోజనానికి కూర్చున్నా .. ఆలోచనలతో అస్తవ్యస్తంగా ఉన్న మనసుకి ఆకలి తెలియలేదేమో అన్నం కెలుకుతూ కూర్చున్నా.

" శారదా మన పెళ్ళయి యిన్నేళ్ళయినా నీ ముఖంలో

కవిత

## గజల్

- బండి ప్రసాదరావు
9866483732

విద్యవైద్యము మిధ్యయయ్యెను చందమామ
ప్రతిభ, స్వస్థత కద్దుయయ్యెను చందమామ
చదువు సరుకగు ధరలు బారగు అందుకుండు
పొత్తముచితము గైడ్లె గతియగు చందమామ!

ఆంగ్లభాషతో అంధకారమె అల్పమతికి
పునాదిలేని గాలిమేడగు చందమామ!
జంబు లింగుయు టెట్టు, టెస్టులు గేంబులింగె
రేంకు, గ్రేడులు గారడీలగు చందమామ!

ఆసుపత్రిలో అడుగుపెట్టగ అంతుజూచు
కాని ఖర్చులు, లేని జబ్బులు చందమామ!
ధీమ బీమయె దివ్యఔషధి దీటుజచ్చె
దిక్కు మొక్కుగ సేవలందవు చందమామ!



వైద్యరాయితి పెద్దమిధ్యగ కంటితుడుపె
నిక్కమెక్కడ కానకుండను చందమామ!
దోచు వారిని దోషి జేయరు గాచుచుండు
యాజమాన్యమె యేవి కయ్యెను చందమామ!

◆

---

అదే శాంతి, అదే చిరునవ్వు .. ఎప్పుడూ ఏ విషయంలోనూ నీకు అశాంతిగా కానీ, దుఃఖంగా కానీ లేకపోతే నా వలన కానీ, నా వాళ్ళ వలన గానీ ఏ విధమైన చికాకూ కలగలేదా? “ సూటిగా తన ముఖంలోకి చూసే ధైర్యం లేక తలదించుకుని అన్నంలో వేలితో రాస్తూ అడిగాను.

క్షణకాలం నిశ్శబ్దం .. “ ఎందుకుండవు? యిల్లన్నాకా సవాలక్ష సమస్యలుంటాయి .. అయితే ప్రతిచిన్న సమస్యనీ ప్రాణాంతకమైనదన్నంత పెద్దది చేసుకు భూతద్దంలో చూడకూడదు. మీరు నా వాళ్ళు అన్నారు చూడండి .. అది తప్పు యిన్నేళ్ళ తరువాత, యిన్నాళ్ళ మన సాహచర్యంలో మీరు నన్ను పూర్తిగా అర్థం చేసుకోలేదన్న మాట. పెళ్లయిన మరుక్షణం నుండే నేను, నాది అన్న మాట మరచి ‘ మన ‘ అన్నదే గుర్తుపెట్టుకున్నాను, అదే ఆచరణలో చూపాను .. అందుకే ఏ సమస్య వచ్చినా అది నాకుగా నేనే పరిష్కరించుకున్నానే గానీ కనీసం మీదాకా కూడా రానివ్వలేదు. యిప్పుడు చాలా యిళ్ళలో నిప్పులేకుండా పొగ రావడానికి ప్రధాన కారణం కూడా అదే .. ‘ నేను, నాది ‘ అనేది చాలా శక్తివంతమైన మిసైల్ .. అది మహా విస్ఫోటనం .. విధ్వంసకరం.” వద్దన ముగించి తనూ, తేలికైన మనసుతో నేనూ లేచాం.

నేనో చిన్న ఉద్యోగస్తుడిని, ఆస్థిపాస్థులేం లేవు .. నా రెక్కల కష్టంతో నా తల్లితండ్రులనూ, తమ్ముళ్ళనీ, చెల్లినీ .. వాళ్ళ రోగాలూ, రొష్టులూ, చదువులూ, పెళ్ళిళ్ళూ .. నా కొక్కతే కూతురు, అది పెద్దయ్యేసరికి ఒక్కక్క బాధ్యతా తీర్చుకుంటూ దానికి మరీ పెద్ద చదువులేం చెప్పించలేక, ఏదో డిగ్రీ అయిందనిపించి, మంచి సంబంధమే చూసి పెళ్ళి చేసేసా .. దానికి నా తమ్ముళ్ళ సహకారం కూడా ఉందనుకోండి. అయినా ఏ రోజూ యిల్లు పెళ్ళివారిల్లులా కలకలలాడడమే కానీ చిన్నపాటి కీచులాట కానీ, అశాంతి కానీ ఎరగము. యిప్పటికీ ప్రతి సంక్రాంతికీ నా చెల్లెలూ కుటుంబం, తమ్ముళ్ళూ కుటుంబాలూ .. మా అమ్మాయీ అల్లుడూ అందరితో మా యిల్లు శోభాయమానంగా వెలిగిపోతోంది అంటే దానికి కారణం నూటికి నూరుపాళ్ళూ మా ఆవిడ శారదే. మా పెళ్ళయిన కొత్తలో కొందరు బంధువులే యిటు మా అమ్మకీ, అటు మా ఆవిడకూ మధ్య మంట రగిలించాలని చూసినా .. అటు అమ్మా ‘ అదీ నా పిల్లలాంటిదే ..తెలియక ఏదైనా తప్పు చేస్తే నే సరిపెట్టుకుని, దానికి సర్దిచెబుతాను .. దయచేసి పనిగట్టుకుని యింకెప్పుడూ యిలాంటి మాటలు చెప్పడానికైతే మా గుమ్మం తొక్కద్దు ..’ అంటూ నిష్కర్షగా చెప్పడం నేనెరుగుదును. చెప్పుడు మాటలతో చెదపట్టబోయిన శారద మనసు అమ్మ మాటలు చెవిన బడడంతో ప్రేమ పరిమళాలు చిందే సౌగంధికా పుష్పమే అయిపోయింది. ఆ తరువాత మా యింట్లో ఎప్పుడూ ఒకరికోసం ఒకరం అన్నట్లుగానే బ్రతికామంతా. కాలంతోబాటు అమ్మా , నాన్న ఒకరివెంట ఒకరు వెళ్ళిపోయినా వారు మాకందించిన ప్రేమానురాగాలు, అభిమానాలూ తరగని పెన్నిధి అయ్యాయి. అవును ఏ కుటుంబంలో అయినా తరతరాలకూ అందాల్సిన అసలైన సంపదలవే కదా.

గతించిన కాలపు తియ్యని ఆలోచనలతో ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడా ఉత్తరాన్ని కొరియర్ చెయ్యాలా అన్న ఆతురతతో తెల్లవార్లూ జాగారమే. నేను నమ్మిన నిజాలతో వ్రాసిన ఆ ఉత్తరంలో ప్రతిపదానికీ ప్రత్యక్ష సాక్షి నా శారదే.

◆






# మాదిగోడి గుండెచప్పుడు 'చండాల చాటింపు'

- కెంగార మోహన్
9493375447

నాగప్ప గారి సుందర్రాజు వాడిన భాష కర్నూలు జిల్లా ఆదోని ప్రాంత మాండలికం. ఆదోని వాసుల సొంతం కూడా. ఆ భాషకు సుందర్రాజు జీవం పోశాడు. కవిత్వంలో దళిత జీవనం కనబడుతుంది. ఒక ఆర్తి, ఆవేదన కళ్ళకు కట్టినట్లు సుందర్రాజు కవిత్వీకరించారు. సుందర్రాజు కవిత్వం, కథలు చదివిన వారు సులభంగా గ్రహిస్తారు. నాగప్ప గారి సుందర్రాజు దళిత సాహిత్యంలో అనడం కంటే తెలుగు సాహిత్య చరిత్రలో తన కథలు కవిత్వంతో సంచలనం సృష్టించిన వాడు అనొచ్చు. దళితులు ఎదుర్కొంటున్న వివక్ష, అవమానాలను ప్రత్యక్షంగా అనుభవించడం, చూడటం వల్ల దళిత కోణాన్ని లోతుల్లోకి వెళ్ళి రాశాడనిపిస్తుంది. కర్నూలు జిల్లా ఆలూరు తాలూకా నేమకల్లు స్వగ్రామం. కేంద్ర విశ్వవిద్యాలయం హైదరాబాద్ లో యం ఏ, యం.ఫిల్, పిహెచ్‌డి వరకు చదివారు. దళిత కథలపై పరిశోధనలో భాగంగా యం.ఫిల్, పిహెచ్‌డిలు పులికంటి కృష్ణారెడ్డి దళిత కథలపై చేశారు. దళితసాహిత్యంలో విశేషంగా కృషిచేసిన సాహిత్య పిపాసి నాగప్పగారి సుందర్రాజు. 1995లో గుండెచప్పుడు, 1996లో చండాలచాటింపు,1997 ఫిబ్రవరిలో మాదిగోడు,1997 డిసెంబర్‌లో మాదిగ చైతన్యం, 1999లో మాఊరిమైసమ్మ, బొంబాయోడు గోండుజోగమ్మయ్యేడ వంటి రచనలు చేశారు. సుందర్రాజు కథలు రాసినా కవిత్వం రాసినా అస్తిత్వం మరచిపోలేదు. అలాగని అస్తిత్వం ఊబిలోకూడా కొట్టుకుపోలేదు. అసమసమాజాన్ని వేలు పట్టుకుని నడిపించాడు. సమాజం కోసమే సమసమాజ ఆవిర్భావానికే కంకణం కట్టుకుని మరీ రాశాడు. మూఢనమ్మకాలు సాంఘీక దురాచారాలపట్ల సుందర్రాజు రాసిన కథలు విశ్లేషించినప్పుడు బస్విని కథలు తెలుగు కథా సాహిత్యంలో సంచలనాలుగా పేర్కొనవచ్చు. సుందర్‌రాజు 'సువార్త' అనే కలం పేరుతో 'అక్క చచ్చిపోయింది' అనే శీర్షికతో రాసిన మొదటి కథ 1995లో దళిత రాజ్యం అనే పత్రికలో అచ్చయింది. 1997లో 10 కథలతో వచ్చిన 'మాదిగోడు' తోపాటు 'మాఊరి మైసమ్మ', 'బొంబాయోడు, గండు జోగమ్మయ్యేడ్య' ఈ రెండు కథలు 1999లో వచ్చాయి. తన కథల్లో తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల్లో ఉన్న బసివిరాలు వ్యవస్థ రద్దు కావాలని మాల, మాదిగ స్త్రీలు పడుతున్న ఆవేదనను కథలుగా రాశాడు. 'నడిమింటి బోడెక్క బసివిరాలు' అయ్యేద అనే కథ కన్నీళ్ళు తెప్పిస్తుంది. బసివిరాలు అంటే దేవదాసి. అట్టడుగు స్థాయి కన్యను దేవుడి సేవకు యావజ్జీవం వదిలిపెట్టడం. జ్ఞానపీఠ పురస్కార గ్రహీత విశ్వనాథ సత్యనారాయణ రాసిన వేయిపడగలు నవలలోను దేవదాసి పాత్ర ఉన్నది. గురజాడ అప్పారావు రాసిన కన్యకలోను ఈ వ్యవస్థ కనిపిస్తుంది. ఇవన్నీ తెలుగు కథా సాహిత్యంలో మైలురాళ్ళు.

నడిమింటి బోడెక్క బసివిరాలు కథలోని పాత్రలు, కథ చెబుతున్న బడికివెళ్ళే కుర్రాడు, పాతాలు చెప్పే కరణం,

మాస్టారు కూడా అయిన శంకరప్ప పాత్రల్ని సుందర్‌రాజు అద్భుతంగా సృష్టించాడు. రాయలసీమలోని పేదల జీవితాల్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోకపోతే ఇటువంటి కథలు పుట్టవు. కథలో బసివిరాలుగా విడువబడే పిల్ల వయసు పదేళ్ళు. పదేళ్ళ పిల్లను బసివిరాలుగా విడువలేదని రెడ్లతోపాటు అతని కులస్థులే ఆ పిల్ల తండ్రిని ఒప్పిస్తారు. తిరస్కరించిన తండ్రిని మనవూళ్ళో మూడేళ్ళ పసిపిల్లను బసివిరాలుగా విడువలేదా? అని ప్రశ్నిస్తారు. కథ కొనసాగే కొద్దీ అమ్మవారి పండుగ, పోతురాజు పండుగలు కనిపిస్తాయి. ఉత్సవానికి అయ్యే ఖర్చును తానే భరిస్తాను అంటాడు ఆ ఊరి రెడ్డి. గ్రామ పెద్ద న్యాయం నిర్ణయించడం, ఆర్థిక ఆంక్షలూ కనిపిస్తాయి. కథలో గ్రామ రెడ్డి పాత్రలో కర్ణాటకలో రెండువేలకే పది మంది బసివిరాండ్రనిడువవచ్చు, నీ బిడ్డేమన్నా భూలోక రంభనుకున్నావా? అని నీచంగా పంచాయితీలో తిడతాడు. ఎవరెన్ని చెప్పినా నడిమింటి బోడెక్క బసివిరాలయ్యింది. దేవర పోతును బలిస్తున్నట్లుగానే బసివిరాలిని చేసే పండుగలో బలివ్వాలి. ఇలాంటి సామాజిక రుగ్మతల్ని సుందర్‌రాజు కథల్లో చూపించారు. బసివిరాలి వ్యవస్థ, జోగిని, దేవదాసి వ్యవస్థలు ఎన్ని చట్టాలొచ్చిన అంతరించిపోక ఉండటం కథకులకు కథా వస్తువులయ్యాయి. పేద దళితుల జీవితాలను చక్కటి కథాశిల్పంతో పాత్రలను సృష్టించారు. రాచపాళెం చంద్రశేఖర రెడ్డి "దళితుల జీవితంలోని కఠిన వాస్తవాలు కన్నడం కలిసిన దళిత తెలుగు భాషలో రాసి, తెలుగు కథా చరిత్రలో కొత్త జీవితాన్ని, కొత్త సౌందర్యాన్ని ఆవిష్కరించారు." అని వ్యాఖ్యానించారు.

నాగప్పగారి సుందరరాజు రాసిన 'మాదిగోడు' కథా సంపుటి తెలుగు కథా సాహిత్యంలోనే ఒక విప్లవ కెరటం. రాయలసీమలోని ఒక మారుమూల గ్రామంలో నివసించే దళితుల జీవిత వాస్తవికతను దళిత దృష్టికోణం నుంచి స్వీయ కథాత్మకంగా రచించాడు. ఇందులోని పది కథలు భారతదేశ గ్రామాల్లో దళితుల జీవిత సౌందర్యాన్నీ, దళితుల ఆలోచనలను సాంస్కృతిక సౌభాగ్యాన్ని ప్రదర్శించాయి. 'బోడెద్దు' కథ చనిపోయిన పశువుని కోసి వండుకొని తినే సంప్రదాయాన్ని ఒక గొప్ప అనుభూతిగా ప్రదర్శించింది. ఎన్ని అణిచివేతలకు గురవుతున్నా దళితుల్లో కూడా ఉండే కోరికలు, అగ్రవర్ణ స్త్రీల పట్లనూ ఉండే ఆకర్షణలు సుందరరాజు 'ఈరారెడ్డి మనుమరాలు మీద మొనుసుండాది' లాంటి కథల్లో వాస్తవికంగా ప్రదర్శించాడు. దళిత స్త్రీని లోబరుచుకునే క్రమంలో అగ్రవర్ణాల వాళ్ళు బసివిరాండ్రుగా మార్చేక్రమాన్ని 'నడిమింటి బోడెక్క బసివిరాలయ్యేద్య' కథలో ప్రతిబింబించాడు.

'మాదిగోడు'లో అగ్రవర్ణాల దౌష్ట్యాన్ని మాత్రమే కాకుండా దళితులలోని కళాత్మకతను కూడా ప్రదర్శించి సుందరరాజు తెలుగు కథలోకి ఒక కొత్త వస్తువును, కొత్త శిల్పాన్ని తీసుకొచ్చి పరిచయం చేశాడు. ఈ నేపథ్యంలో రెండోతరంలో దళిత కవుల్లో అగ్రస్థానం సంపాదించుకున్న కవుల్లో అగ్రగణ్యులు నాగప్ప గారి సుందర్రాజు 1996లో తీసుకొచ్చిన కవిత్వం చండాల చాటింపు. ఇటీవల కర్నూలు సాహితీస్రవంతి దీన్ని రెండవ ముద్రణగా పాఠకులకు అందించింది. సుందర్రాజు దళితులు ఎదుర్కొంటున్న సమస్యల్ని వివక్షని ప్రత్యక్షంగా అనుభవించినవాడు. దళిత సాహిత్య నేపథ్యాలను అక్షరాలను నిలువెల్లా జీర్ణం చేసుకున్నవాడు. ఆంధ్రప్రదేశ్‌లో 1983లో పొదిరికుప్పం, 1985లో కారంచేడు, 1992లో చుండూరు మారణకాండల నేపథ్యంలో దళతుల్లో ఆగ్రహజ్వాలలు పెల్లుబికి ఉద్యమం ఎగసి పడింది. దళిత సాహిత్య విసృతికి చైతన్యానికి ఈ సంఘటనే కారణం కాదు. అగ్రవర్ణాలు దళితుల మీద చేసిన పాశవిక దాడుల మూలంగా దళితుల్లో చైతన్యం పెరిగి తిరుగుబాటు ప్రారంభించారు. ఈ పరిస్థితుల్లో దళితసాహిత్యం ఉద్యమరూపం సంతరించుకున్నది.

అగ్రవర్ణాలకే పరిమితమైన సాహిత్యాన్ని సంఘసంస్కర్తలు చేసిన ఉద్యమ స్ఫూర్తితో పీడిత ప్రజలు కలాలను ఝుళిపించారు. కథలు, కవితలు, పద్యాలు, నాటకాలు విరివిగా రాయడం మొదలు పెట్టడం, 1909లో వచ్చిన మాలవాండ్రపాట ఆంధ్రభారతి మాస పత్రికలో అచ్చవ్వడం సుందర్రాజుకు తెలియంది కాదు. 1910లో గురజాడ వేంకట అప్పారావు తమిళ మళయాళ ఆచారాన్ని చదివి కన్యక కథాగేయం రాశారు. (లవణరాజుల కల), మంగిపూడి వెంకటశర్మ(నిరుద్ధభారతం), త్రిపురనేని రామస్వామి చౌదరి (సూత పురాణం) కంటే ముందుగా మాలవాండ్రపాట వచ్చిందని పరిశోధకులు నిర్ధారించారు. 1925లో 'ప్రబుద్ధాంధ్ర' లో వచ్చిన శ్రీపాద వారి కథ 'పుల్లంరాజు' తెలుగులో లభిస్తున్న కథల్లో మొదటి దళిత కథగా సాహిత్యకారులు నిర్ధారించారు. దళితజీవితాన్ని దళితులే రాసిన మొదటికథ గొట్టిముక్కల మంగాయమ్మ రాసిన 'అయ్యోపాపం'(1935). వీరిని

మొదటితరం దళిత కవులని భావిస్తే రెండోతరంలో కొలకలూరి ఇనాక్ 'అస్పృశ్యగంగ', ఎండ్లూరి సుధాకర్ 'మల్లెమొగ్గలు', నాగప్ప గారి సుందర్‌రాజు రాసిన 'మాదిగోడు' 'మా ఊరి మైసమ్మ' , పి. కనకయ్య సంకలనకర్తగా వచ్చిన 'ఎదురుచూపు' 'మేమిట్లుండం' జాజుల గౌరి రాసిన 'మట్టిబువ్వ'. నేడు దళిత సామాజిక వర్గానికి చెందిన వారే కాక దళితవాదాన్ని సమర్థిస్తూ సానుభూతితో కోకొల్లలుగా కథలు, కవితలు వచ్చాయి. ఇవన్నీ ఆకళింపు చేసుకున్న సుందర్రాజు చండాల చాటింపు 1996లో వేశాడు. ఎదపై తప్పెడమోపి గుండెలదిరిపోయేలా కొట్టాడు.

*మాదిగ్గేర్లోకి ఎవరూ రాలేదు/నన్నేమో అందరూ వాడుకున్నారు/నేను పెద్దమనిషినై కూసుంటే/యామమ్మా రాలేదు/చూసేకి మావాళ్ళు దండిగుండారు/ఆరున్నర సుతిలో ఎత్తుకున్నారు/నా పాట నేనే పాడుకుంటా/మాదిగ పాటను మధురంగా పాడుకుంటా(పెద్దింటి పిల్ల).* ఈ కవితలో నాగప్ప గారి సుందర్రాజు గ్రామాల్లో అమ్మాయిలు పుష్పవతి అయితే జరిగే సంప్రదాయ తంతును చెప్పాడు. గ్రామాల్లో పెద్దింటి పిల్లలు పెద్దమనిషి అయితే ముత్తైదువులతోపాటు అందరూ పాటలు పాడి ఉత్సవం జరుపుతారు. ఇక్కడ పాట పాడిన పాప మాదిగ పాప. ఆ పాప ఊర్లో ఎవరూ పెద్ద మనిషైనా వెళ్తది, పాడ్తది. కాని ఆ పాపే పెద్ద మనిషైనప్పుడు పాడేందుకెవ్వరూ రారు. ఆ పాప వివక్షను ఎదుర్కొంటూనే మనోధైర్యంతో అవమానంగా భావించక తన పాట తనే మధురంగా పాడుకుంటానంటది. సుందర్రాజు తను పుట్టి పెరిగిన మాదిగ వాడలో ప్రత్యక్షంగా తెలుసుకున్నట్లైతేనే ఇంత బలంగా రాయగలడు. బతుకుసమరంలో పోరాడుతూ వేశ్యాగృహాల్లో మగ్గుతున్న నేపాల్ యువతులను చూశాక రాసిన అద్భుత కవిత చదివితే కళ్ళు చెమరుస్తాయి. ఆ కవితలో ఒక చోట... *మలి సంధ్య వేళలో/ముఖానికి పులుముకున్న చిరునవ్వుని/పట్టుచీరకింద/పుచ్చిపోయిన పచ్చిమాంసాన్ని/ అమృతాన్ని అందుకున్నంత ఆనందం/ఆఖరిగా ఆత్మప్రబోధం చేసి /అవలీలగా గడపదాటే సౌజన్యరావు/నాకు చాలా మంది పరిచయం నాన్నా !/సారాంశమయితే అభ్యంతరం లేదు : కాని/అమ్మ ముందు ఈ ఉత్తరం చదవకండి !(తొలి-ప్రతి).* స్త్రీ పడ్తున్న యాతన, అనుభవిస్తున్న నరకం ఇంత బలంగా రాయడం స్త్రీవాదులక్కూడా సాధ్యమేనా అనిపిస్తుంది. గొప్పగా కవిత్వం రాశాడు అనడం కంటే కలంలో స్త్రీల కన్నీటి ఆర్తనాదాల్ని, ఆవేదనల్ని, రాక్షసరతికేకల్ని సిరాచుక్కలుగా పోసి రాశాడనిపిస్తోంది. మరి సుందర్రాజుని మాదిగ అనో ఇంగోటనో ఎలా అనగలం.

కవి ఏ సామాజిక వర్గంలో పుట్టినా సమాజానికి సంక్లిష్టతలు చుట్టుముట్టినప్పుడు, తిరోగమన దిశలో సమాజం పయనిస్తున్నపుడు కలం ఝుళిపించకుండా ఉండగలడా? 1-3-1995న హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలోని క్యాంపస్ అడవి కాలిపోతున్న దృశ్యాన్ని చూసిన నేపథ్యంలో ఒక కవిత రాస్తూ.. *అడవిని తగలెడితే లాభమేంటి?!/తాకట్టు పెట్టడానికి తాళిపై కన్నువేసిన/సత్యహరిశ్చంద్రున్ని తగలెట్టు!/ ముక్కోటి దేవతలకు మూడు పూట్ల నమస్కరించు/పొద్దుకింత ముద్దకూడు పెట్టలేని ప్రజాస్వామ్యం/డంకెల్ సంకలో నవభారత సుగంధం/ఐయ్యెమ్మెఫ్‌కు "అమ్మ" గ్రంథం అంకితమిచ్చి/గిరిజన గుండెల్లో బుల్లెట్ల వర్షం కురిపించు/ మానభంగానికి మనసోదరులు చాలకపోతే/అరబ్బు వీరులకు కిడ్నీలు సప్లయి చేసి/అబలలను తగలెట్టడానికి - "ఆ - దేశాల" నుండి/అత్తల చేతికి "కట్నాలిచ్చి"/సిగరెట్టు వెలిగించు/ పురుష అహంకార పుణ్యభూమి/నా దేశాన్ని తగలెట్టు !(నన్ను, నా దేశాన్ని తగలెట్టండి !)* మన దేశంలో అప్పుడప్పుడే ప్రపంచీకరణ విధానాలు ప్రవేశించిన కాలమది. ఏదో ఒక చిన్న సంఘటన విశ్వవిద్యాలయంలో జరిగితే దేశకాల పరిస్థితులకు అన్వయించి చెప్పాడు సుందర్రాజు. కవికి నిశిత పరిశీలన, దార్శనికత ఉండాలంటారు. సుందర్రాజుకున్నవి అవే. బలమైన కవిత్వం సుందర్రాజు సొంతం. పేలవమైన కవిత్వం రాశాడనడానికి ఎక్కడా వీల్లేదు. కవితాపెద్దలు చెబుతున్నట్టు ఎత్తుగడులు, శిల్ప, వస్తు సౌందర్యాలు ఏం కావాలన్నా అది కనబడుతుంది, చురక వేస్తుంది, తట్టిలేపుతుంది. నిద్రాణమై ఉన్న ప్రపంచానికి తొలికిరణమై లేపితే కవిత్వ ప్రయోజనం నెరవేరినట్టే. సుందర్రాజు కవిత్వం తొలికిరణాల్లా జాతిని నిద్రలేపుతాయి. చూపుడువేలుతో నవీన సమాజానికి దారిచూపుతాయి. దళిత సాహిత్యంపై పరిశోధన చేయదలచిన దళిత విద్యార్థులు అందరికి 1995-96 సం॥నికి గాను ఎం.ఫిల్ అడ్మిషన్ లేకుండా చేసిన హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం తెలుగు డిపార్టుమెంటు నిరంకుశ ఆర్య సంస్కృతిని నిరసిస్తూ... *నా చేతిలో ఉన్నది "రంపె"/నా చూపులో ఉన్నది "అరె"/ఒరేయ్ !పదును గురించి ప్రశ్నించావా !?!/ నాపిక్క సత్తువ చూపిస్తా/పచ్చి నెత్తురు తాగేస్తా !(*డప్పు కొట్టిన

## కవిత

### మనుషులింకా బ్రతికే వున్నారు

- కె. ఆనందాచారి
9948787660



**ఆ** ప్రక్క ప్రక్కనే రాక్షసులు
ఎంతెంత కోరలు చాస్తున్నా
మనుషులింకా బ్రతికే వున్నారు

మృత్యు జలాల్లో
కన్నీళ్ళయి మునుగుతున్న వాళ్ళని
వలలతలలకెత్తుకున్న మత్స్య కారుల్లా
మనిషిగుండెలను పడవలుచేసి
తపించిన రూపాల్లా
మనుషులింకా బ్రతికే వున్నారు

ఆపద నీళ్ళతో,నీళ్ళలాంటినిప్పులతోనో
ఏదైతేనేంఎవరికైతేనేం?
ఈ దేశంపై అల విసిరిన ప్రశ్నకు
మనుషులమై సమాధానపడదాం

మనుషుల ముఖాలతో
మృగాలెన్నిపొంచివున్నా
సహాయపు చేతులతో అశేషంగా
మనుషులింకా బ్రతికే వున్నారు ◆

---

***చేత్తో డొక్క చీలుస్తా !).*** ఇవి మాదిగలు చెప్పులు కుట్టే పనిముట్లు. కవిత్వంలో ఎవరికి వారు తమతమ సామాజిక వర్గ అస్తిత్వపనిముట్లను వాడితే సుందర్రాజు తన మాదిగ సామాజిక వర్గానికి చెందిన పనిముట్లను కవితాయుధాలుగా వాడాడు. ఆ పనిముట్లతో తను యుద్ధం చేస్తానని ఆవేశంగా ప్రకటిస్తాడు. ఈ పనిముట్లను ఒక్కోప్రాంతంలో ఒక్కోరకంగా పిలుస్తారు. ఈ పదాలు ఆదోని ప్రాంతంలో వాడే మాండలికం. 29-7-1995 విజయవాడ మాచవరంలో డా॥ బి.ఆర్.అంబేద్కర్ విగ్రహానికి చెప్పులదండ వేసిన దుష్ట సంస్కృతిని ఖండిస్తూ.. ***చర్మాన్ని ఎన్ని విధాలుగా చీల్చాలో నాకు తెలుసు/అపశ్రుతి ఆలకించలేక మీరు అవస్థపడుతుంటే/ నా మట్టిచేతులతో - అను"రాగాన్ని" రంగరించి/మిమ్మల్ని పెంచిపోషించింది నేనే/ పెద్దింటి వాడినయ్యింది నేనే !/ గుండ్లకొండ బండమీద/ఆకలిని ఆనందంగా అనుభవిస్తు/ హరికి రూపమిచ్చి/హరిజనుడయ్యింది నేనే/అంటరాని వాన్ని అయ్యింది నేనే!/శ్రమగూర్చి చర్చించే మీరు/మేధస్సు మేటీలారితోటి/చండాలురపై "ఛార్జి"సీటు/ఎనభైనాలుగులక్షల జీవరాసుల్లో/ ఎన్నిసార్లు జన్మఎత్తినా/ 'కవిత్వం'లోనూ - 'కళ'లోను - 'కల'లోను/నా కులమే బలిపీఠమై/మిమ్మల్ని భయపెడుతుంది(కాలం దాపురించింది!).*** అంబేద్కర్ విగ్రహాలకు చెప్పలేయడం అప్పుడూ వుంది, ఇప్పుడూ వుంది. దేశంలో ఏదో ఒక చోట ఈ ఘటనలు జరుగుతూనే వున్నాయి. ప్రస్తుత మతోన్మాద సందర్భంలో మరింతగా ప్రబలాయి. ఈ సత్యాన్ని కాదనడానికి వీల్లేదు. ఇవి ప్రపంచానికి తెలిస్తే తెలుస్తాయి. లేదంటే లేదు. 15-7-1994 హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం తెలుగు డిపార్టుమెంటు పి. హెచ్.డికై జరిగిన ఇంటర్వ్యూలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు ఇంటర్వ్యూ నియమనింబంధనలను అతిక్రమించి "దేశద్రోహి" అంటూ తీవ్రపదజాలంతో హింసించిన మనో నేపథ్యం నుండి రాసిన కవితలోని పంక్తులు గమనిస్తే.. ***ఊరవతల ఉండమంటే/ ఊరు ఎవరిది అన్నాను/చెప్పులు చేతికి తీసుకోవాల్సిన వాడిని/ బూట్లెక్కి మాట్లాడుతున్నాను/"పరిశోధనకు అయోగ్యుడు" - అంటే ఎం.ఫిల్. పూర్తి చేసి చూపించా/అందుకే నేను "దేశద్రోహి"ని/హెచ్.సి.యు తెలుగుశాఖంటే/ఆర్యజాతిసొత్తని తెలియక/నేనుసైతం మనిషినంటూ/మాటతెలిసి చోటు అడిగా/ నగ్నసత్యాన్ని భగ్నం చేయబోయిన/"హెడ్"ను "నీవు" అన్నాను./అందుకే నేను "దేశద్రోహి"ని/ఆశయం వేరు - ఆచరణ వేరు అని తెలియక/నిజాన్ని నిజమని నిర్భయంగా వేదించాను/అందుకే నేను "దేశద్రోహి"ని/నా చావును ఆశించిన/అయ్యగారికి నిరాశ మిగిల్చాను/అందుకే నేను "దేశద్రోహి"ని/అవమానం జరిగింది(ఔను నేను "దేశద్రోహి"నే!).*** ఇప్పుడు కేంద్రీయ విశ్వవిద్యాలయాలు మారాయనడానికి వీల్లేదు. ఏళ్ళు ఎండుటాకుల్లా రాలిపోతున్నా కులహంకారానికి, మతోన్మాదులు ఆజ్యం పోస్తూనే ఉన్నారు. అందుకే ఈ మతోన్మాద సందర్భంలో ఈ చండాల చాటింపు అవసరం, అనివార్యం..

కేంద్రీయ విశ్వవిద్యాలయం హైదరాబాద్‌లో మాదిగ సాహిత్యవేదిక ను స్థాపించి, దళిత సాహిత్యంలో విశేషంగా కృషిచేస్తూ శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ఆచార్యులుగా పని చేస్తున్న దళిత సూర్యుడు, దళిత సాహిత్య చేగువేరా డా.నాగప్పగారి సుందర్రాజు 17.07.2000న అస్తమించాడు. విశ్వవిద్యాలయ ఆవరణంలోనే ఖననం చేశారు. ◆

# కవిత

## నీకై

కరిగిపోయే క్షణాలనే గుప్పిట్లో దాచేసి
రేపటి జ్ఞాపకాల మిణుగురులను చేయనా..

నీ నవ్వుల పూవులకే అల్లికలే వేసి
రెప్పవేయలేనంత పండుగ రంగులనే దిద్దేయనా..



చీకటిలో ఎన్నటికీ దాచలేని కాంతుల కిరణానికి
ఊరిపిరిపోసి నీ మనసు వాకిటిలో వెన్నెల వెలుగులే
నింపనా..

అలల అలజడికి ఉప్పొంగే నీ కన్నీటికి
లాలనగా మారే కనురెప్పల ఒడినే జతచేర్చనా..

మార్గాలెన్నున్నా నీ గమనానికి రహదారినై
నీ గమ్యం లో చిరునవ్వుల దివిటీలనే వెలిగించనా..

మలుపులెన్ని వున్నా గాయపడే నీ హృదయానికి
మధువన స్పందననై స్వాంతన లయనే సృజించనా ..

అనుభూతుల ఒరవడిలో మధనపడే అంచులలో
నిన్ను నీవు తెలుసుకొనే తెల్లకాగితమై నీ రచనకు శ్రీకారం
దిద్దనా..

నిదురించే స్వప్నాన్ని శిల్పంగా మలచి
నీలో దాగివున్న కళలకు ప్రాణంపోసి నిన్ను అపురూపంగా
చూసుకోనా..

నిన్ను నీవు కోల్పోయే దేహానికి శూన్యంలో నిశిగా
మిగలాలనుకునే
నీ ఆలోచనలకు బ్రతుకువిలువ నేర్పించే గురువుగా
మిగిలిపోనా..

తారలెన్ని వున్నా చందమామ ఒక్కడే,
నింగిఎంతవున్నా నేలమీద నడకలే..
బ్రతుకు చిత్రానికి చివరికి మిగిలేది చాయైనా
నీవుగా పారే నదిగా మారి సంద్రంలో కలసిపో ..
నిన్ను నీవు తెలుసుకో, నీవు నీవుగా సాగిపో ..

- జ్యోతి నండూరి
9440276028

◆

## మాయ గాలి

- గుబ్బల శ్రీనివాస్
09699856777



తల పైన ఉన్న ఆకాశం
కాళ్ళ కిందికి చేర్చి
వొక ప్రతిమను చేసి వెళ్ళిపోతాది

జీవం తొడుక్కుని దేహం
ఏటవాలుగా ఊగటం మొదలవుతుంది

చర్మం నుండి జారుతున్న స్పర్శ
పాదాలపై కూలిపోయి సెలయేరవుతుంది

గాలి కనబడదు
ఒంటిపై ప్రవహించటం , ఆక్రమించటం
ఎప్పుడో వొకప్పుడు అనివార్యం

దాని ఉనికిని నేను గ్రహించలేని క్షణం
ఆ గాలిలో గాలినైపోతాను !

◆




# వీరేశలింగం భాషాసేవ

- తాపీ ధర్మారావు

కందుకూరి వీరేశలింగం పంతులు పేరు వినేసరికి ఆంధ్రాభిమానులకు కనబడేది ఒక మహాద్భుత దృశ్యం. యాభయి సంవత్సరాల నిడివిని. ఆంధ్రదేశమంతటి విస్తీర్ణమును కలిగిన వెండి తెరమీద. అనేక రసవంతాలైన సన్నివేశాలతో నిండిన ఒక మనోహర చలనచిత్రము వీరావేశముతో విజృంభించి, అడ్డుతగిలిన శత్రుకోటిని హతమార్చి, విజయపరంపరలను సాధించడం కనబడుతుంది. సాహిత్య రంగములోను, సంఘ రంగములోను పేరుకొనిపోయి వున్న దురాచారములను నిర్మూలన చేసి, ప్రజాసామాన్యానికి విజ్ఞాన వికాసాలు సమకూర్చిన కథనాయకుడి చరిత్ర గోచరిస్తుంది.

వీరేశలింగం పంతులు వ్రాసిన పుస్తకాలు, నడిపిన పత్రికలు, చేసిన వుపన్యాసాలు, పూనుకున్న ప్రయత్నాలు, సాధించిన విజయాలు, అన్నీ ఒక్కసారిగా చూస్తే ఎటువంటి వారికైనా విభ్రాంతి కలగక మానదు. దాదాపు నూటయాభై రచనల జాబితా చూస్తే యేదో పుస్తకాల షాపువారి క్యాటలాగులాగ కనిపిస్తుంది. వివిధ రంగాలలో అతడు సాధించిన విజయాలను గురించి ముచ్చటిస్తే యేవో అతిశయోక్తులు అల్లుతున్నట్లనిపిస్తుంది. నిర్మించిన సంస్థలను గురించి చెప్పాలంటే కేవలం స్తోత్రపాఠంలాగా వుంటుంది. పదిమంది వుత్సాహపూరితులు తమ పది జీవితకాలాలలోను సాధించలేని కార్యాలను ఆ మహానుభావుడు తన ఒక్క జీవితకాలములోనే సాధించాడు.

ఇటువంటి వారినే ఇంగ్లీషులో "జీనియసెస్" అంటారు. అంటే మహా మేధావి, మహా నైపుణ్యము, అన్ని మహా గుణాలు కలవాడని భావము. ఎక్కువ పనిచేయగల సమర్థతే "జీనియస్" అని కార్‌లైల్ మహాకవి సూక్ష్మంగా నిర్వచనం చెప్పాడు. (ఇక్కడ సమర్థత అన్నది గుణపరంగాను, వస్తుపరంగాను, అన్వయించుకోవాలి). ఈ జీనియస్ అన్న మాటకు తగిన పర్యాయ పదము మనకులేదు. మితిమీరిన పనిచేసేవాడిని "అబ్బా రాక్షసిలాగ పనిచేసేవాడు" అని, "వాడు రాక్షసి చదువు చదువుతాడు" అని మనము వాడుతుంటాము. ఇంగ్లీషులో మహా మేధావులను **'Intellectual giants'** అంటారు. మన సాహిత్యంలో కవిరాక్షసులున్నారు. ముద్రారాక్షసములో మంత్రిరాక్షసుడున్నాడు. కాబట్టి జీనియస్‌కు "రాక్షసి" అని పర్యాయపదం వాడితే క్షమిస్తారనుకుంటాను. అప్పుడు, రామానుజాన్ని గణిత రాక్షసిగాను, సి.వి.రామన్‌ని కాంతి రాక్షసిగాను చెప్పుకోవచ్చును. ఈ సూత్రము ప్రకారం మన కందుకూరి వీరేశలింగం సాక్షాత్తు రాక్షసి, మానవ మాత్రుడు కాడు.

తన 22వ యేట (1870)లో వీరేశలింగం మెట్రిక్లేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. అప్పటికే అతడు సంస్కృతాంధ్రాలలో మంచి పాండిత్యం సంపాదించి చక్కని కవిత్వం చెప్పుతూవుండేవాడు. చక్కని వాక్పటుత్వము తర్కబుద్ధి గల యువకుడు. కాబట్టి ప్లీడరీ చదివితే బాగా రాణించడమే కాక

ధనార్జనకు అనుకూలంగా వుంటుందని అనేకులు ప్రోత్సాహపరిచారు. కాని పంతులు ఆ ఊహను నిరాకరించాడు. ఆ నిరాకరణ ఆంధ్రదేశానికంతటికీ ఒక మహోపకార మయిందని వేరుగా చెప్పనక్కర్లేదు.

తాను పేద పరిస్థితులలో నున్నప్పటికి అతనిబుద్ధి ధనార్జన మీదికి పోలేదు. ధనమంటే పెద్ద గౌరవము అతనికెన్నడూ లేదు. అతనికి ముఖ్యమైన విషయాలు న్యాయము, విజ్ఞానము, సత్‌శీలము. అన్యాయము జరుగుతూ వుంటే చూచి మనకెందుకు అని వూరుకునే స్వభావము కాదు. యెంతకష్టపడియైనా దానిని ప్రతిఘటించి, దాని అంతు తెలుసుకొని, అంతమొందించేవరకు నిద్రపోయే వాడు కాదు. ఆ అక్రమాన్ని వేళ్ళతో పెకలించితేగాని అతనికి తృప్తి కలుగదు. ఈ సద్భావముతోనే ఆనాటి హరిజనులకు, స్త్రీలకు కలుగుతుండే అన్యాయాలను తొలగించే సంఘ సంస్కరణ మహాకార్యమును సాధించాడు. అలాగే ఆ దినాలలో ప్రకోపించివుండిన మూఢ విశ్వాసాలు, అధికారుల లంచగొండితనాలు మొదలైన అనుచితాలను నిర్మూలనము చేయుటకు పూనుకున్నాడు. ప్రజా బాహుళ్యములో వ్యాపించియున్న అజ్ఞానాన్ని రూపుమాపడానికి సర్వవిధాల ప్రయత్నించి కృతార్థుడయ్యాడు. ప్లీడరీ అయివుండినట్లయితే యిన్ని సంస్కరణలు, ఇంత భాషోద్ధరణ ఆ స్వల్పకాలములో నెరవేరి వుండగలవని అనుకోలేముగదా?

అద్భుతమైన వివేచన, కుశాగ్రబుద్ధి, సునిశితమైన విమర్శన, సరోత్కృష్టమైన పరిశీలన, మహాసముద్రమంత ఓపిక – ఇవన్నీ కందుకూరి సొమ్ము. వీటితో అతడు తలచుట్టూ కన్నులు బెట్టుకొని ప్రపంచాన్ని చూచేవాడు. ఆనాటి ఆంధ్రసమాజస్థితి ఆ లేత హృదయానికి మహా వేదన కారణమయింది. ఆ స్థితి నుద్ధరించుటే తన కర్తవ్యమని కంకణం కట్టుకున్నాడు. కావలసిన శాస్త్ర పరిజ్ఞానం సమకూర్చుకుని ప్రతివాది భయంకరుడయ్యాడు. పత్రికలు, గ్రంథాలు, ఉపన్యాసాలు, వాదనలు వీటితో స్త్రీ విద్య, విధవా వివాహాలు, హరిజనోద్ధరణ మొదలైన సంస్కరణలను యెలాగు సాధించాడో ఆంధ్రుడెన్నడూ మరువడు.

పూర్వకాలపు మెట్రిక్లేషను కాబట్టి ఇంగ్లీషులో ఇప్పటి బి.ఏ.ల కంటే మెరుగే అని అంగీకరించాలి. ఆ భాషా జ్ఞానంతో పంతులు ఆంగ్ల సారస్వతాన్ని చాలావరకు చదివాడు. దానిలోని కొత్తదనాన్ని చూచి ముగ్ధుడయ్యాడు. షేక్స్పియర్ నాటకాలు, వానిలోని స్వభావ నిరూపణాది గుణాలు మనసు నాకర్షించాయి. గోల్డ్‌స్మిత్, 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్' యెంత చక్కని రచన అని అనిపించింది. స్విఫ్ట్ వ్రాసిన 'గలివర్స్ ట్రావెల్స్' లోని వ్యంగ్యం హృదయంగమంగా తోచింది. ఇంకా యెన్నో సుప్రసిద్ధ ఆంగ్ల గ్రంథాలు చూశాడు. ఆ రచనలు నడిచిన పుంతలు గుర్తించాడు. అవి మన సంస్కృత కవుల పుంతలూ కావు, తెలుగు రచయితల పుంతలూ కావు; కొత్త పుంతలు, చాలా మనోహరంగా వున్నాయి.

అయ్యో, ఇలాంటి పుంతల గ్రంథాలు మనకులేవే అని చింతించాడు. ఆ లోపాన్ని తీర్చినట్టయితే తెలుగు భాషా సాహిత్యం బాగా శోభిస్తుందని నమ్మాడు.

ఆ దృష్టితో మన తెలుగు సారస్వతం చూచాడు. కొన్ని శతాబ్దాల దూరంలో నన్న యాదుల పురాణాలూ, శ్రీనాధాదుల ప్రబంధాలు, తంజావూరు యక్షగానాలు కనిపించాయి. దగ్గరగా పసలేని వ్యసనాలుగా పరిణమించిన ఒరవడి ప్రబంధాలు వెర్రితలలు వేస్తూ కనిపించాయి. కొందరు వచన రచనలు చేయపూనారు. ఒక పక్కను మిషనరీలు తమకు వచ్చిన తెలుగుతో బైబిల్ భాషాంతరీ కరణలు సాగిస్తున్నారు. 1857లో స్థాపించిన మద్రాసు విశ్వవిద్యాలయంలోని చిన్నయసూరిగారు నీతిచంద్రిక కొంత వ్రాసి దివంగతులయ్యారు. బ్రౌను, మెకంజీ దొరలు అనేక విధాల భాషోద్ధరణకు పూనుకొన్నారు. "నిఘంటు రచనకు ప్రయత్నం సాగుతూ వుంది."

నాటకాలు లేవు, నవలలు లేవు; వ్యంగ్య రచనలు లేవు; జీవిత చరిత్రలు లేవు; శాస్త్ర గ్రంథాలు లేవు; అక్షరజ్ఞానము మాత్రమున్నవారు చదివి గ్రహించగల పుస్తకాలు లేవు; కవుల విషయాలు తెలిపే గ్రంథాలు లేవు. ఇటువంటి లోపాలు తీర్చాలంటే, సరళమయి సుబోధమైన వచన రచన చెయ్యాలి. అలా చేస్తే "ఎబ్బే! వీడు పండితుడు కాడు" అంటాడు. రచనలకు విలువ ఉండదు. అందుచేత మొదట పండితలోకంలో తనకొక సుస్థిర స్థానం నిర్మించుకోవాలి. ఇతడు అభాజనుడు కాడు. గట్టి పండితుడే అని అనిపించుకోవాలి. ఆ రోజులలో శ్లేషకవితలు, గర్భ కవిత్వాలు, బంధ కవిత్వాలు, నిర్వచనాలు, నిరోష్ఠ్యాలు – ఇలాంటివి అయోమయంగా వ్రాసినవారే కవి ప్రకాండు లనిపించుకొనేవారు.

అందుచేత తానుగూడ శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషదమును, ప్రబోధ చంద్రోదయమును వ్రాసి పండిత ప్రకాండుడై ఆచార్య స్థానమును అలంకరించిన చిన్నయసూరి అసంపూర్ణంగా విడిచిపెట్టిని నీతిచంద్రికలోని సంధి, విగ్రహాలన్న భాగాలను పూర్తిచేసి సూరియంతటివాడే యనిపించుకున్నాడు.

ఆ పాండిత్యము, ఆ కవితాధర, ఆ ఊహాచాతుర్యము కల్పనా కౌశలము వున్నవాడు తానొక రామాయణాన్నో భారతాన్నో రచియించి వున్నట్లైతే కందుకూరి పేరు ఈనాటి దేశ గ్రంథాలయాల్లో, పెద్ద గ్రంథాల బీరువాలలో చిరస్థాయిగా నిలిచివుండేది. తాను నన్నయ, తిక్కన భాస్కరాదులతో సాపత్న్యము పొందగలిగి వుండేవాడు. కాని ఆ భాషా సేవకుడు అలా ఆలోచించలేదు. అది కూడా తెలుగు సారస్వతానికి మహోపకారమైనది.

అతనికి కావలసినది తన గొప్పతనము ప్రకటించుకోవడం కాదు. తెలుగు రచనలను కొత్త సాహిత్య రూపాలలో ప్రదర్శించి, వాటిలోని విశిష్టతను పాఠకులకు గ్రంథకర్తలకు రుచిచూపి ఆంధ్ర వాఙ్మయాన్ని పరిపుష్టము చేయడమే అతడు కోరినది. దారి చూపినట్లయితే తెలుగు ప్రతిభ ఆ పుంతలలో నడచి ఉత్తమోత్తమ రచనలతో ఉన్నత స్థాయికి పోవచ్చును కదా అన్న ఆశ. సులభంగా బోధపడే పద్ధతి నవలంబించడం వల్ల రచనలలోని వివేక విజ్ఞానాలు పాఠకుల మనసులకు నాటుకుని వారిని వివేకవంతులుగా చేయవచ్చును గదా అన్న వూహ. ఒక వంక నూతన సాహిత్యరూపాలు అందజేస్తూనే తన ప్రధాన లక్ష్యమైన సంఘ సంస్కరణ ప్రచారము సాగించుకుంటూ వుండవచ్చునన్న ధైర్యము. ఆ నాటికే అభాసుపాలై అసహ్యకరంగా పరిణమించిన నిస్సార ప్రబంధం వ్యామోహము పోగొట్టి సాహిత్యానికి నూతనవికాసము భవిష్యత్ అభ్యుదయము సమకూర్చవచ్చునన్న తలంపు.

నాటకాలు లేవన్న కొరత తీర్చడానికి సంస్కృతము నుంచి శాకుంతలము, మాళవికాగ్ని మిత్రము. రత్నావళి మొదలైన నాటకాలను తెలుగులోనికి అనువదించాడు. ఆంధ్రనాటక వాఙ్మయములో మొదటి నాటకము వీరేశలింగానిదే. తరువాత తరువాత ఎందరెందరో శాకుంతలాన్ని భాషాంతరీకరించారు. కాని, ఈనాటిదాకా ఆంధ్ర రంగస్థల ఆదరణ పొందుతూవున్నది కందుకూరి శాకుంతలమే అంటే అతని ప్రతిభ ఎంత అసాధారణమో తేటపడుతుంది.

విజ్ఞానం విస్తరిల్లుతున్న కొలది వచన రచనకు ఎక్కువ ప్రాధాన్యం కలుగుతుందని గ్రహించి, ఆ రచనకు తగిన పునాదులు వేయడానికి పూనుకున్నాడు. ఆరచన చిన్నయసూరిగారి నీతిచంద్రికలాగుంటే ప్రయోజనం లేదని నిరాకరించి, తేట మాటలతో, సులభ వాక్య నిర్మాణంతో, విషయం కరతలామలకంగా తెలిసేలాగుండే రచనకు అంకురార్పణ చేశాడు. ఆంగ్ల భాషలో ప్రసిద్ధినంది అనేక ఖండాంతర భాషలలోనికి తర్జుమా అయిన "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" "గలివర్సు ట్రావెల్సు" లాంటి మంచివి ఎంచుకున్నాడు. అన్యభాష, అన్యదేశ విషయం ఎంత జాగ్రత్తగా భాషాంతరీకరించినా అది ఎరువుల సొమ్ముగానే వుంటుంది గదా! ఈ సత్యాన్ని గుర్తించి పంతులు అలా చేయలేదు. ఆంగ్లేయ రచనలోని మూలసూత్రాన్ని పట్టుకొని మనజాతి జీవనంలోంచి అలాంటి సన్నివేశాలను ఊహించి స్వతంత్ర రచనగా వ్రాసాడు. అలాంటివే రాజశేఖర చరిత్ర, సత్యరాజ పూర్వదేశయాత్ర. ఆడమళయాళము మొదలయినవి. మొదటిది కుటుంబజీవితంలోని లోపాలోపాలను విశదపరుస్తుంది. రెండవది రాజకీయార్థికాది విషయాలను గురించి వ్యంగ్యరచన, మూడవది చక్కని హాస్యముతో పురుషులు స్త్రీలకెంత అన్యాయము చేస్తున్నారో ప్రత్యక్షముగా కనబరిచే రచన.

వీటికితోడు వుండనేవున్నాయి అతని పత్రికలు ప్రహసనాలు – తన రచనా విధానం వ్యాపించడానికి. వీటన్నిటికీ ప్రజాదరణ ఎక్కువగా వుండడం చూచి పండితులూరుకోలేక పోయారు. వట్టి పేలవ రచనలన్నారు. ఇక్కడ వ్యాకరణదోషముందన్నారు. అక్కడ సంధి కలపలేదన్నారు. ఎగతాళి చేశారు. ఆ కూతలు లెక్క చేయకుండా తన రచన మదపుటేనుగులాగా నడుచుకుంటూ పోయింది.

తర్కశాస్త్రం, శారీరక శాస్త్రము, ఖగోళశాస్త్రము ఇలాంటి ప్రకృతి శాస్త్రాలను అనువదించడానికి అంకురార్పణ చేశాడు. విక్టోరియా, జీసస క్రైస్టు మొదలైన ఉదారాశయుల జీవిత చరిత్రలు వ్రాయడానికి భవిష్యత్ రచయితలకు దారిచూపించాడు. అంతేకాదు, ఆనాటికి ముద్రణ భాగ్యం లేకుండా పడివున్న మహాకవుల ఉద్గ్రంథాలు కొన్నింటిని పరిష్కరించి ముద్రింపించి వాఙ్మయ పోషకుడయ్యాడు. వాటిలో నాచన సోమన్న ఉత్తర హరివంశము. అయ్యలరాజు అనంతామాత్యుడి భోజరాజీయము. కాకుమాని మూర్తి పాంచాలీ పరిణయము, మొల్లరామాయణము – ఇటువంటి గ్రంథాలున్నవంటే అతని విచక్షణ, ఔదార్యము, భాషాభివృద్ధికాంక్ష చక్కగా తేటపడుతుంది. ఎన్నెన్ని చెప్పగలము, చెప్పితే నేను మనవిచేసినట్లు అది ఒక క్యాటలాగవుతుంది.

పండితులతోను, ప్రజలతోను ప్రమేయమున్న రచనలతో తృప్తిపడ్డవాడు కాదు వీరేశలింగం. సంఘ కూకటి వేళ్ళవైపు దృష్టిసారించాడు. పాఠశాలలో చదువుకుంటున్న బాలబాలికలకు తగిన పాఠ్యపుస్తకాలు కనబడలేదు. విద్యావికాసం కోసం ప్రయత్నాలు బాగా సాగుతూన్న రోజులవి. చిన్నచిన్న

# ఎంతో కొంత జీవితం

- తమ్మెర రాధిక
9440626702



ఎంతో కొంత మన దగ్గరుంటే దేన్నైనా సాధిస్తాం
గదినిండా పరుచుకు పోయిన మౌనం
బైటికి వెళ్ళడానికి, తనకు తానై గోడ.. విరిగి దారివ్వదు
సుత్తీ గడ్డపారా తట్టా మాత్రమే గమ్యాన్ని చేరుస్తాయి
అక్కడి నుండి!
గొప్ప గొప్ప కలల బాటెప్పుడూ గతుకులే
మనసులోతుల్లో మర్యాదెప్పుడూ ఒంటరే!
ఉపయోగించని కాలం చెల్లిపోయినట్టుగానే
కొన ఊపిరితో ఉండగానే చనిపోవద్దు
ప్రాకృతిక ధర్మం అంటూ లేని చోట
పరమాత్మ దర్శనం ఎప్పుడూ కాదు!
కడుపారా భోంచేసిన వాడు ఆకలిని గుర్తించడు
కష్టాల కడలిలో ఊగేవాడు అలలని తేలికగా తీసుకోడు
అందుకే..
ప్రార్ధన పైకి వెడితే ఆశీస్సులు క్రిందికి వస్తాయంటారు.
కనుకనే..
రెండు చక్షువులూ కొద్దోగొప్పో మరమ్మత్తు చేసుకుంటున్నాయి
కను చివర్లను,
వినీల ఆకాశ అఖాతాన్ని దర్శించేందుకు!
జీరగా ఎక్కడి నుంచో బాధాగీతం
లోయలోకి దూకడానికి వస్తోంది
చెట్ల చిటారు కొమ్మల పరామర్శలను తప్పించుకొంటూ
శ్రుతులూ లయలూ రాగతాళాలూ మేళవించుకుని మరీ!
ఓ మనిషీ గమనించావా
నువ్వు కట్టిన ఆకాశ హర్మ్యాలు పర్వతాల ముందెంత చిన్నవో?
నువ్వు పెంచే పూల మొక్కలు ఊడలు దిగిన వృక్షాల ముందెంత
మరుగుజ్జువో?
అనేక వంకలు తిరిగిన ముది వృక్షం ఛాయలోని చల్లదనం
నువ్వు కట్టే ఎలివేషన్ల ద్వారా రాగలవా మలయ మారుతం?
అసంకల్పిత గమనింపును మౌనం ప్రశ్నించిన వేళ
అసంతృప్తిని వెదజల్లే విస్ఫులింగాలు ప్రతిన బూనుతున్నాయి..
ప్రమిద చుట్టూ అలుముకున్న నీలిమ - ప్రమద బ్రతుకులా
కత్తి మొనమీద సాములా
గుహలో దాక్కున్న చీకటిలా - కను చివర్లలో నీటి బిందువై
జ్వలిస్తూ
తనను తాను మెలకువగా వుంటూ
సుదీర్ఘ ప్రయాణంలో రేయి వంగిందంటే చాలు
వెన్నెలలో పంచుకుంటూ వుంటుంది
వారసత్వ లక్షణాలను ఆత్మ తన నివేదనలలో
అంతర్మథనాన్ని సాగిస్తూ..

◆

---

తరగతులలో ఏదో వెర్రిమొర్రి పాఠాలు చెప్పితే విద్యలకు సరియయిన పునాదులుండవని గుర్తించాడు. చిన్న చిన్న తరగతులకు వ్రాయడమంటే చాలా చిన్నతనముగా భావించకుండ వ్రాయదానికి పూనుకున్నాడు. ఈ రచనలలో గూడా అతని ప్రత్యేక శ్రద్ధ ప్రత్యక్షమవుతుంది. తరగతుల వాచకాలలో విజ్ఞానం అన్నివిధాలా క్రమ వికాసముతో సోపాన పంక్తిలాగుండడం న్యాయము. ఇప్పటి పాఠ్యపుస్తక రచయితలనేకులు ఈ ముఖ్య సూత్రాన్ని పాటించినట్లు కనబడదనడం సాహసము కాదు.

వీరు రచించిన అయిదవ వాచకములో చెప్పదగిన సంధులు, క్రియారూపాలు, వాక్య నిర్మాణాలు, ఇలాంటివి రెండవ వాచకములో కనబడతాయి. నాల్గవ తరగతి పుస్తకములో కొన్ని పాఠములు రెండవ తరగతికి గూడ పనికిరానివుంటాయి. అట్టలమీద ముద్రించిన "మూడవ వాచకము" "ఆరవ వాచకము" అన్న పేరులనుబట్టే వాటి తరగతిని గ్రహించాలి గాని, లోపలి రచనా విధానాన్ని బట్టి తెలుసుకోవడానికి వీలుండదు.

పంతులు అలాగుచేయలేదు, విభక్తి, సంధి, క్రియా రూపము, వాక్య నిర్మాణము, విషయకాఠిన్యము, వీటినన్నిటిని క్రమపద్ధతిని సోపానాలుగా విభజించుకొని, ఆ విభజన ననుసరించే తరగతుల వాచకాలు వ్రాసి ఈనాటి వారికి గూడా ఆదర్శప్రాయుడయ్యాడు. చిరుతలకు కావలసిన చిన్న వ్యాకరణము, నీతిమంజరి ఇలాంటివాటిని గూడా ప్రచురించి పిన్నల విద్యావికాసానికీ, భాషాజ్ఞానానికీ చేయూతనిచ్చాడు.

◆

కథ

# చదువుల పంజరం

- ఉండవల్లి ఎమ్.
9441347679



మబ్బుగా ఉంది. చిన్నగా వర్షం మొదలై, మధ్యమధ్య ఉరుముల్తో మేల్కొలుపుతున్నట్టుంది.

చందు పరుగెడుతున్నాడు. వెంట ఎవరో తనని తరుముకొస్తున్నారు. ఇక తను దొరికిపోతాడనే భయం, ముందుకు పరుగెత్తడానికి దారిలేదు. వెనుక వెంట పడుతున్న ముసుగు మనుషులు, భయంతో ఉలిక్కిపడి లేచాడు. బయట మబ్బు వేసి ఉంది. కలయినందుకు ధైర్యం తెచ్చుకుని, బాటిల్‌లో వాటర్ తాగి మళ్ళీ వచ్చి పడుకోబోయి టైము చూశాడు.

అప్పటికే ఐదుగంటలు కావొస్తుంది.

వార్డెన్ వచ్చి లేపే సమయం ఐదు నిమిషాలు ఉంది. ఇక నిద్రపట్టలేదు చందుకి. రేపటి క్లాసులో నీట్ ఎగ్జామ్ కళ్ళముందు కదలాడింది. తను చదువుతున్నాడు. అయినా మార్కులు సరిగా రావడం లేదు. క్లాసులో లెసన్స్ అర్థమయ్యి కానట్టుగా ఉంటున్నాయి. అదొక కార్పొరేట్ కాలేజ్, క్లాసులో అంత జనంలోనూ తిరిగి డౌట్స్ క్లియర్ చేసుకునే అవకాశం చిక్కడం లేదు. దూరంగా కూర్చోవడం ఒకటైతే, సిలబస్ అంటూ చెప్పుకు పోవడం మరొకటి.

వార్డెన్ అందర్నీ లేపుతున్నాడు. అందరూ లేచారు. స్నానాలు చేసేవాళ్ళు చేస్తున్నారు, లేనివాళ్ళు పుస్తకాలు ముందేసుకుని ఆ రోజు ఎగ్జామ్‌ని ప్రిపేర్ అవుతున్నారు.

చందు స్నానం చేసి, స్టడీ క్లాసులోకి వెళ్ళాడు. సీరియస్‌గా పుస్తకాలు. ముందేసుకున్న వాళ్ళలో కొంతమంది, ఫోర్‌జీ మొబైల్ ఫోన్ సీక్రెట్‌గా ఆన్‌చేసి యూట్యూబ్ చూస్తున్నారు. కొంతమంది కునుకుపాట్లు పడుతున్నారు.

ఎనిమిదిన్నరకి టిఫిన్ బ్రేక్, తర్వాత క్లాసులు మొదలయ్యాయి. కొన్ని క్లాసులు అయ్యాక, ఎగ్జామ్ కండక్ట్ చేశారు. మధ్యాహ్నం నుండి ఎయిమ్స్ పేపరు టెస్ట్ పెట్టారు.

ఈవెనింగ్ స్టడీ అవర్స్‌లో డౌట్స్ క్లియర్ చేస్తుంటారు. విద్యార్థులు, వాళ్ళ ఎడ్యుకేషన్ స్టేటస్ ఇవేవి వాళ్ళకక్కరలేదు. మీదపడి రుద్దడం, రాకపోతే బట్టీ పట్టించేయడం, ఐ.పి.ఇ. ఎగ్జామ్స్‌కి చదువుతుంటే "అది ఇంపార్టెంట్ కాదు, నీట్‌కి ప్రిపేర్ అవండి (ఎన్.సి.ఇ.ఆర్.టి. సిలబస్) ఆబ్జెక్టివ్ క్వశ్చన్స్" అని చెప్తుంటారు.

మొదట మూడ్నెళ్ళలో వారానికోసారి పెట్టే నీట్ టెస్ట్‌లో పెర్ఫార్మెన్స్ బాగున్న నూట ఏభై మందిని సెలెక్ట్ చేసి, వాళ్ళకి చైనా బ్యాచ్ అని పేరు పెట్టి, వాళ్ళని సెపరేట్‌గా వేరే క్యాంపస్‌కి తీసుకెళ్ళి ప్రత్యేకమైన కోచింగ్ ఇస్తుంటారు. ఈ కార్పొరేట్ కాలేజీ బ్రాంచీల్లోని ముందుగా జరిగే ఈ టెస్ట్‌ల 'కీ' మొబైల్ ఫోన్ ద్వారా సంపాదించి, మంచి మార్కులు సంపాదించి చైనా బ్యాచ్‌లోకి వెళతారు కొందరు. మరికొందరు రికమండేషన్, లేదా మనీ పేచేసి దాంట్లోకి ప్రవేశిస్తారు. వీళ్ళే రేపటి కాలేజీ ర్యాంకులు టీవీల్లోనూ, పేపర్లలోనూ మోతెక్కడానికి దోహదపడేవారు.

చందు మార్కుల మెసేజ్‌లు ఇంట్లో వాళ్ళ మొబైల్స్‌కి చేరిపోయి, అట్నుంచి ఫోన్స్, తిట్లు, రోజువిడిచి రోజూ పెట్టే నీట్ ఎగ్జామ్ ఓ గండంలా ఉంది చందుకి.

కొంతమంది ఇవేవి పట్టనట్టు, ఇంటర్ పాసయితే, ఎంబిబిఎస్ సీటు కొనుక్కోవడానికి రెడీ అయిన వాళ్ళు, జల్సాగా తిరుగుతున్నారు. పేరుకే కాలేజీ స్ట్రిక్టు, కాలేజీ హాస్టల్ వెనుక సిగరెట్ ప్యాకెట్లు, కుప్పలుగా బీరుసీసాలు, ఇవేవి బయట ప్రపంచానికి తెలియని రహస్యాలు.

లక్షల డబ్బుతో ప్రెస్టీజియస్ కోసం కార్పోరేట్ కాలేజీల్లో చేర్పించేవారు కొందరు, అప్పోసాప్పో మెడిసిన్ చేయిస్తే బాగుంటుందని మరికొందరు, ఆనాక సీటు రాకపోతే, ఫీజుకోసం చేసిన అప్పులు, ఎడ్యుకేషన్ లోన్లు తీర్చలేక కుటుంబం అంతా అతలాకుతల మయిపోవడం, ఇన్ని చేసిన తర్వాత సీటు రాకపోతే, పిల్లల మీద ఒత్తిడి తేవడం, అక్కడితో జీవితం అయిపోయినట్లు దిగాలు పడిపోవడం, దానికి తగ్గట్టుగానే రాసేవాళ్ళు లక్షలమంది, సీట్లు వేలల్లో, సీట్లు రానివారంతా చదవని వారని కాదు, ప్రభుత్వ వైఫల్యాల వల్ల కొంతమందికే పరిమితమైన సీట్లు.

మధ్యలో సెలవులొచ్చాయి. అందరూ ఇంటికి వెళ్ళిపోయారు. చందుకూడా ఇంటికి వచ్చాడు. చందులో ఇంతక ముందు లాంటి హుషారు లేదు. బెరుకు, భయం చందుని కమ్మేశాయి. చదువు, క్లాసు, టెస్ట్‌లు తప్ప మరో ప్రపంచం తెలీని ఓ పరిస్థితిలో అయోమయంగా కొట్టుమిట్టాడుతున్నాడు. ఆట, పాట, బంధువులు, స్నేహితులు ఏమిలేని లోకంలా, మనుషుల్లోంచి విడివడి, అన్నిటికీ దూరంగా యంత్రంలా మారిపోయాడు తను. ఇది కాకపోతే మరేవి లేనట్టు, ఇది రాకపోతే జీవితం చేజారిపోయినట్టు, అంతా శూన్యం, ఇంట్లో వాళ్ళు అజ్ఞానం కొంత, ఈ కాలేజీ బాగోతాలు కొంత, మెడిసిన్ కాకపోతే, బైపిసి నుంచి పది, పన్నెండు కోర్సులు ఉన్నాయి. కానీ, వత్తిడి, ఆందోళన భరించలేకపోతున్నాడు తను. కార్పొరేట్ కాలేజీలో వాళ్లిచ్చే తర్ఫీదు కూడా విద్యార్థిని మార్కుల మిషన్‌లా తయారు చేయడం, ఇంట్లో వాళ్ళ ప్రవర్తన జీవితంలో ఇదో తప్పనిసరి ప్రక్రియలా భావించడం.

నానాటికి దిగజారిపోతున్న మార్కుల గ్రాఫ్‌తో, ఇంటినుండి, కాలేజీ నుండి వత్తిడి ఎక్కువైంది. ఎన్నో రకాల మాటలు మనసుని తూట్లులా పొడుస్తున్నాయి.

ఆ సంవత్సరం ఎంసెట్ క్యాన్సిల్ అయి, నీట్ రావడంతో అంతా తారుమారైంది. ప్రభుత్వం మెడిసిన్‌కి ఎంసెట్ తీసేసి, నీట్ పెట్టడంతో ఐ.పి.ఇ. ఎగ్జామ్స్‌కి స్టేట్ సిలబస్, నీట్‌కి సి.బి.ఎస్.సి సిలబస్ చదవడం ఇంటర్ విద్యార్థులకి ఓ దురదృష్టవరం.

చాలామంది రెండూ ఫాలో అవలేక వెనక్కి తగ్గిపోయిన వాళ్ళు, చదవలేక ఏదోక దాని దగ్గర ఆగిపోయిన వాళ్ళు, నీట్ ఎగ్జామ్‌లో మైనస్ మార్కులుంటాయని భయపెట్టే లెక్చరర్లు, అంతా అయోమయం. విద్యార్థుల జీవితాలు కార్పొరేట్ కాలేజీల వ్యాపారంలో పావులై పోయాయి.

దసరా సెలవులకి ఇంటికెళితే, చందుని సైక్రియాట్రిస్ట్‌కి చూపించి, వేలకివేలు పోసి ట్రీట్‌మెంట్ చేయించారు. ఇదివరకటి కంటే కొంచెం నయం, చదివనివైనా జాగ్రత్తగా అర్థంచేసుకుని, స్టోర్ చేసుకోగల్గుతున్నాడు. ఎంత చదివినా తరగని సిలబస్, మరోపక్క అర్థంకాని ఫిజిక్స్‌తో మరో తంటా.

హాయిగా బతకలేని తన జీవితాన్ని చీకటి కోణంలోంచే చూసి, బెంబేలు పడిపోతున్నాడు. ఏదో తెలియని టెన్షన్, ఏమి జరుగుతుందో, జరగడానికి అవకాశం ఎలా వస్తుందో ఆలోచించడానికి సమయం లేని పరుగు... మార్కుల పరుగులు..

ఇదివరకటిలా కలివిడిగా ఉండటం లేదు. గదిలో మూలన లైటు ఆర్పేసి కూర్చోవడం, ఎవ్వరితో మాట్లాడకపోవడం, పిచ్చిగా మూర్ఖత్వంగా ప్రవర్తించడం, ప్రతి చిన్న మాటకి పెద్ద పెద్ద అర్థాల్ని తీసుకుని, వ్యతిరేకంగా మాట్లాడడం ఇవన్నీ చందులో కొత్తగా వచ్చిన లక్షణాలు.

టెన్త్ వరకు ఇంట్లో ఉండి బాగా చదివాడు. ఇంటర్‌లో దూరంగా హాస్టల్‌లో పెట్టి చదివిస్తే, బాగా చదువుతాడని, సాక్రిఫైస్ చేసి చదివించినా అక్కడా మార్కులు రావడం లేదు.

ఇంటికి ఎవరొచ్చినా, ఫంక్షన్స్‌లో ఎవరు కలిసినా వాడి మార్కులు గురించి అడగటం, సలహాలు ఇవ్వడం, అందరి పిల్లలు బాగా చదువుతున్నారు, మన పిల్లాడు ఎందుకు చదవడం లేదు? ఆ పిల్లల గురించి చెప్తుంటే వీళ్ళ బుర్ర పిచ్చెక్కి పోవడం, కర్ణుడి చావుకి అనేక శాపాలు కారణమైనట్టు, చందు పరిస్థితికి అనేక అంశాలు కారణమవుతున్నాయి.

చందు మేనమామ వినయ్ అక్కద్వారా విషయం అంతా తెలుసుకున్నాడు. అక్కకి నచ్చజెప్పాడు "చదివితే ఏదో అయిపోవాలని, అదే పట్టుకుని కూర్చోడం కాదక్కా, వేరేదేమైనా చదివించు, సైంటిస్ట్‌ని చేయి, అబ్దుల్ కలాం గారు మెడిసిన్ చేసి, అంతలా ఎదిగారా? వాళ్ళు ఏది చేయగలరో దాంట్లో ప్రోత్సహించడమే కరెక్టు, మీరు అనవసరంగా అతిగా ఆలోచించి, వాడ్ని భయపెట్టి, ఏదో చేసేలా ఉన్నారు" అన్నాడు.

వాళ్ళక్క మౌనంగా ఉండిపోయింది. వాళ్ళ బావగారు అర్థమయినట్టు, ఒప్పుకోలేక పోతున్నట్టు ముఖం పెట్టి చూస్తున్నాడు.

"సరే అక్కా, నేను కూడా హాస్టల్‌కి వెళ్ళి చందూని కలిసి ఎంకరేజ్ చేసి చెప్పి వస్తాను" అన్నాడు.

మర్నాడు –

చందుని కలిసి అనునయంగా అన్నీ అడిగాడు. ఎక్కువ సమయం చదవలేక పోవడం, అర్థంకాకపోవడం, నిద్రలేమి సమస్య, ఎన్నున్నా పరుగెత్తించడం, ఇవన్నీ విన్నాకా "సరే, నువ్వెంత వరకూ చదవగలవో, అంతవరకు పెర్‌ఫెక్ట్‌గా చదువు, వత్తిడికి లోనయి చదవకు, మమ్మీ, డాడీలతో నేను చెప్తాను" అని చెప్పేసి వచ్చేశాడు.

మర్నాడు జరిగిన నీట్‌లోనూ చందు మార్కులు తక్కువొచ్చాయి. కాలేజీ వాళ్ళు పరుగెత్తించే పరుగుల్తో మనసు పిచ్చెక్కి పోయింది. స్టడీ అవర్స్‌కి వెళ్ళకుండా రూములో ఒంటరిగా ఉండిపోయాడు. వార్డెన్ చెక్ చేయడానికి వచ్చాడు. కొంచెం ఫీవర్‌గా ఉండి రాలేదని చెప్పాడు.

వారం తర్వాత –

హాస్టల్‌లో చందు కనబడ్డం లేదని మెసేజ్ వచ్చింది. ఇల్లంతా ఉలిక్కి పడింది. హాస్టల్‌కి కారులో వచ్చేశారు. పోలీస్ కంప్లయింట్ ఇచ్చారు.

వాళ్ళూ వీళ్ళూ చెప్పే స్టూడెంట్స్ సూసైడ్ విషయాలు గుర్తొచ్చి, వినయ్‌ని పట్టుకుని భోరున ఏడ్చింది నీరజ" అనవసరంగా వత్తిడి తెస్తున్నాం, ఇంకొకటి చదువుకున్నా, నీట్‌లో ర్యాంక్ రాకపోతే పోయేదేముంది. నాకొడుకు నాకుండే వాడు. ఏమయ్యాడో దేవుడా!" అంటూ కింద పడి పొర్లుతుంది. "వాడికి వచ్చింది, చదవగలిగింది చదివితే, మాకు ఈ పాట్లు ఉండేవి కావు, నా కొడుకు నాకు దక్కితే చాలు" అంటూ రాగాలు తీస్తుంది.

భర్త రవీందర్ ధైర్యంగా ఉన్నట్టు కనబడుతున్నా, లోలోన కుమిలికుమిలి నలిగిపోతున్నాడు.

అన్ని పోలీస్ స్టేషన్లకి మెసేజ్ వెళ్లింది. రవీందర్‌కి తెలిసిన వాళ్ళు, స్నేహితులు, బంధువుల ఇళ్ళకు మనుషుల్ని పంపించి వెతికించారు. టీవీలో కూడా చందు గురించి న్యూస్ వచ్చింది.

ఇంటికి పరామర్శలు ఎక్కువయ్యాయి. అందరూ ఓదారుస్తున్నారు. కొందరు ధైర్యం చెప్తున్నారు. సలహాలతో కొందరు. ఇళ్ళంతా బంధువులు, స్నేహితుల్తో బిజీ అయింది.

నీరజ మౌనంగా ఉండిపోయింది. ఏమీ మాట్లాడబుద్ధి కావట్లేదు. ఎవరేమి చెప్పినా చెవికి ఎక్కడం లేదు. అందరిలాగే తనూ గొప్పగా చెప్పుకునే కొడుకులా అవ్వాలని భావించింది. మరో దాంట్లోనైనా, కొడుకుని గొప్పగా తయారు చేయొచ్చని ఇప్పుడనిపిస్తుంది. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు, దు:ఖం ఆగడం లేదు. ఇంట్లో తామే ఒత్తిడితో నలిపేసి, ఇలాంటి పరిస్థితికి కారణమయ్యావనే విషయం ఆమెని దొలిచేస్తుంది. పదేపదే జ్ఞాపకమొచ్చి, శోషొచ్చి పడిపోతుంది. మళ్ళీ లెగుస్తుంది. కళ్ళల్లో వత్తులు పెట్టుకుని, జ్ఞాపకాల్ని మనసులో వెలిగించి, తనివి తీరా మౌనంగా, దీర్ఘలోచనలో పడిపోతుంది.

కొడుకుతోపాటు, ఆమె ప్రవర్తన చూసి భర్త కుదేలై పోతున్నాడు. వినయ్ వాళ్ళక్కని ఓదారుస్తున్నాడు. వాళ్ళ కుటుంబ సభ్యులంతా తోడుగా అక్కడే ఉన్నారు.

వారం గడిచాక –

సడెన్‌గా ఇంటిముందు పోలీస్ జీపు ఆగింది. దాన్లోంచి కానిస్టేబుల్స్ చందుని ఇంటి లోపలికి తీసుకొస్తున్నారు. ఎస్ఐ గారు వెనకాల వస్తున్నారు. ఇంట్లో అందరూ అవాక్కయ్యారు. గుమ్మం దాటి బయటి వరండాలోకి వచ్చారు.

"క్రిష్ణానది బ్రిడ్జికింద అనుమానస్పదంగా తిరుగుతుంటే, పట్టుకుని ఎంక్వయిరీ చేసి తీసుకొచ్చాం" అంటూ ఎస్ఐ గారు చెప్తున్నారు.

చందు మౌనంగా ఉండిపోయాడు. నీరజ కొడుకుని తడుముకుని చూసుకుంది. "ఏంట్రాయిది" అంటూ చందుని పట్టుకుని వలవల ఏడ్చింది.

## కవిత

# గజల్

- రేగులపాటి కిషన్‌రావు
9640606404



తారలైతె అంబరమ్మున నిలచి వెలుగునుగా
పతనమయ్యే తారలెన్నో మనకు తెలియదుగా.

పూలు ఎన్నో కొమ్మకొమ్మకు పరిమళించేనూ
పరిమళించిన పూలు కుళ్లిన కంపుకొట్టునుగా

విశ్వజనులలో వృత్తులెన్నో చేయువారున్నా
వృత్తి భేదము లెన్ని ఉన్నను ప్రగతి కొరకేగా.

లలిత కళలను నిపుణులందరు సృజన చేస్తుంటే
అనుభవించే సుజనులందరు సంతసింతురుగా.

ప్రాణులన్నియు పరువమందున పరుగు పెట్టిననూ
అంత్యదశలో ప్రాణులన్నియు మట్టిపాలేగా

ధనమదాంధుడు దర్పమెంతో ప్రదర్శించిననూ
కడకుకాలం అతని మదమును అణచి వేయునుగా

జూదగాడూ పొందునాడూ పొంగిపోవునులే
ఫణం ఓడి సిరులుపోగా కృంగిపోవునుగా.

సవ్యమైన ఆశఉంటే 'రేరా'! సముచితమే
తగని ఆశను పెంచుకొనినా ముదము మిగలదుగా. ◆

---

"సారీ మమ్మీ, ఎవరు కనబడినా, పలకరించినా మార్కుల గురించే అడుగుతున్నారు. నీట్ ఎగ్జామ్ జరిగితే, మీనుండి ఫోన్ వస్తే సమాధానం చెప్పడానికి భయంగా ఉంటుంది. రోజూ ఉదయం ఐదు గంటల నుండి, రాత్రి పన్నెండు వరకు పరుగులు, ప్రశాంతంగా ఉండలేక పోతున్నాను. ఏదో టెన్షన్, మామూలుగా కష్టపడి చదవగలను, కానీ, నన్ను బంధించినట్టు, నేనేమో ఉక్కిరిబిక్కిరవుతూ చదవడం, రోజుల తరబడి నేను భరించలేక పోతున్నాను. నాకెందుకో ఆ రోజు అదోలా అనిపించింది. ఇవన్నీ వదిలేసి వెళ్ళిపోవాలనిపించింది. దూరంగా ఎక్కడికైనా పారిపోవాలనిపించింది. తప్పో, ఒప్పో నాకు తెలియదు. ఇవన్నీ రోజూ నేను తట్టుకోలేక పోతున్నాను. దానితోపాటు మీ గురించి బెంగొకటి" అంటూ నీరజను చుట్టేశాడు.

"అందరిలాగే మేమూ ఆలోచించాం, పిల్లల్ని ఎలా చదివించాలనే ఆశలు మాకు కూడా ఉంటాయి. ఒక్కోసారి అభిరుచులు వేరై, అనేక స్థితిగతులు కారణమై, అనుకున్న దానికి విరుద్ధంగా జరుగుతుంటాయిరా! అనుభవం రానిదే జ్ఞానం పూర్తిగా వికసించదు. మా కళ్ళెదుటే ఉండి, నువ్వు ఏం చదవాలను కుంటున్నావో, దాన్నే పట్టుదలగా చదువు, అదే పదివేలు మాకు, నువ్వు కనబడకపోతే ఈ అమ్మ ఉండగలదేంట్రా" అంటూ నీరజ కిందకి జారగిలబడిపోయింది.

"హాయిగా నాకు నచ్చినట్టు చదువుకోకుండా, అందరితో కలవని, బంధీఖానా లాంటి హాస్టల్‌లో నన్ను ఉంచొద్దమ్మా, ఇక్కడే ఉండి చదువుకుంటాను. ఈ సంవత్సరం కాకపోతే, మరో సంవత్సరం రాసి నీట్ ర్యాంక్ తెచ్చుకుంటాను. రాకపోతే మరోటి చదువుతాను. నన్ను ఇక్కడే ఉండనీయండమ్మా, అక్కడికెళ్ళాలంటే భయంగా ఉందమ్మా" అంటూ వాళ్ళమ్మ కాళ్ళని చుట్టేశాడు.

రవీందర్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తాము తప్పు చేసినట్టుగా పశ్చాత్తాపపడ్డాడు.

"మీ కలల్ని, ప్రతిష్టల్ని కాపాడుకోవడం కోసం, అవన్నీ పిల్లల మీద రుద్దకండి. ఏ నవ్వు ఎలా వికసించి పరిమళిస్తుందో అలాగే ఉండనీయాలి. సహజాన్ని చెరిపేసి, కృత్రిమంగా మారిస్తే, సహజ అందం పోయి, ఆందోళనతో కూడిన జీవితం కళ్ళముందు పరుచుకుపోతుంది జాగ్రత్త!" అంటూ ఎస్ఐ గారు బయటికి నడిచారు.

ఆయనతో పాటే వినయ్ బయటికి నడచి, గేటు వరకు వెళ్లి వాళ్ళని సాగనంపాడు. నీరజ, రవీందర్‌లు ఆయన మాటల్ని మళ్ళీమళ్ళీ రిపీట్ చేసుకుంటూ, ఆయన వెళ్ళినవైపే చూస్తుండిపోయారు. ◆

# మట్టిమనిషి అక్షర చెమట చుక్కలు

- నందవరం కేశవరెడ్డి
9885720878

మట్టి మనిషి. మనిషే మట్టి. సమస్తమూ మట్టే. ఆకుపచ్చని లోకానికి మూలం మట్టే. సమస్త ధాతువులకు మూలం మట్టే. మట్టిని పిండి పండించే వాడు మట్టి మనిషి. శ్రమజీవన సౌందర్యంతో పచ్చని వాడు మట్టిమనిషి. అటువంటి మట్టిమనిషి అటు ప్రకృతి, ఇటు పాలకుల వంచనకు బలికావడం అత్యంత విషాదం.

వళ్లంతా మట్టి పరిమళంతో కవిత్వంగా పరిమళించే సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి 'బడి' కవితల సంపుటి తెచ్చారు. ఈ సంపుటి జూన్ 2018లో రాగా, ఆగస్టు 2018లో మలిముద్రణ వచ్చింది. దీనితో ఈ సంపుటికి ఎంత పాఠకాదరణ వుందో తెలుస్తూ ఉంది.

*"అదను కావాలన్నా పదను మేఘాలన్నా*
*అవి రెండూ రెండు ఎద్దులుగా కాడిదున్నే*
*మెట్ల నేలల సేద్యమన్నా*
*చెప్పలేనంత ఇష్టం.."* ఉన్నవారు సన్నపురెడ్డి

*"వరుణుడు మెయిలు జండా వూపగానే*
*వేసవి సెలవుపై పోయి*
*రైతులంతా పొలాల బడుల్లోకి అడుగేస్తారు"*

అవిశ్రాంత శ్రమ జీవులయిన రైతులు భూమిని పరవశింపచేసే చదువులో..

*"ఈ అంచునించి ఆ అంచుదాకా*
*ఎన్ని పిడికిళ్ల అక్షరాల్ని విత్తారో*
*ఎన్ని పంకుల్లో చేనంతా నింపారో*
*లెక్కించటం తప్ప సర్వం మరుస్తారు"*

కోతి తన పిల్లల్ని కాపాడుకున్నట్లు, రైతు ఇష్టంతో పొలాన్ని పంటను కాపాడుకుంటాడు. ఇష్టంతో శ్రమిస్తాడు. ఇష్టంతో కష్టాన్ని మరుస్తాడు.

రైతు దుక్కి దున్ని, విత్తనమేసి, పైరు పెరిగి పంట ఇంటికొచ్చేంతవరకు వానకోసం ఎదురుచూడని క్షణమంటూ వుండదు. రైతు వానమాట వినిపిస్తే చాలు చెవులింతచేసి వింటాడు. *"రైతుకు, మేఘాల నీడలు కదిలితే చాలు / కళ్ళు - పురివిప్పే నెమళ్ళవుతాయి.* ఈ కార్తెలో వానొస్తుంది. ఆ కార్తెలో వానొస్తుంది అని ఎదురు చూసే రైతుకు చూపులే మిగుల్తాయి. కాని వానరాదు. ఉత్తర ప్రగల్భాల ఉరుముల్తో ఉత్తర కార్తె కూడా దాటింతర్వాత రైతు, *'ఒక్క వాన వొంగితే చాలు / ముక్కాలు పంటన్నా చేతికొస్తుంది'* అనుకుంటాడు. కాని వానరాదు. రిక్త హస్తాలతో హస్త కార్తెకూడా దాటిం తర్వాత, *'ఒక్క పదనయితే చాలు/ సగం పంటన్నా చేతికొస్తుంది'* అని రైతు ఆశపడతాడు. కాని వానరాదు. చిత్తాన్ని చిత్తు చిత్తు చేస్తూ చిత్త కార్తె కూడా దాటింతర్వాత రైతు, *'ఒక్క వాన మోదు చాలు /పాతిక పంటన్నా చేతికొస్తుంది'* అనుకుంటే ఒక్క వానమోదు

కూడా రాదు. మరి స్వాతిశయపు నిర్లక్ష్యంతో స్వాతి కార్తె కూడా దాటితే రైతు' ఇప్పుడయినా ఓ చినుకు రాలితే విత్తనాలయినా దక్కుతాయి.' అనుకుంటే వాన చినుకు రాదు. చివరకు,

*'ఈ సమ ఎడారిగా మారినా బావుందు–*
*రాని వసంతం కోసం ఎదురుచూస్తూ*
*క్షణ క్షణం చావకుండా వుండేందుకు'*

అనుకునే రైతు క్షోభ మాటలకందదు మట్టి మనిషి పట్ల పాఠకుడి కంట నీటి చుక్క రాలకుండా వుండదు.

ఈ సమ మట్టి గడ్డ ఇసుక దిబ్బ కాకుండా కాపాడుకోవాలని పాలకులకు ఆలోచన రాక పోవడం శోచనీయం.

'ఓట్లకు తప్ప మరెందుకూ పనికిరాని యీ గడ్డ మీద వరుణ దేవుడికి కూడా శీతకన్నే.

అదెందుకో తెలుసుకోలేక పోతాడు రైతు. అట్లని వానకోసం ఎదురుచూడకుండా మాత్రం వుండలేదు. ఎప్పుడూ ముఖంలో వానచూపులు వూరుతూనే వుంటాయి.

వాన రాక వ్యవసాయం అటకెక్కింది. ఎద్దులు కటిక అంగళ్ల పాలైనాయి. గాటు పాట్లు పాడుపడినాయి. *'మొండి గోడల కింద విరిగిన నాగళ్లు / ఎద్దుల గాళ్ల మీద ముసలోళ్ల కుక్కిమంచాలు'* ఇవి నేటి పల్లెల చిత్రాలు. సాగునీరు లేదు. కనీసం తాగునీరన్నా వుందా అంటే అదీలేదు. దాహం తీర్చుకోడానికి *'పొల్లాలో ఎక్కడో చావు బతుకుల మధ్య ఊగిసలాడే / వ్యవసాయ బోరు బావి వద్దకు / బిందెలతో బార్లు కట్టిన దప్పిక గొంతులు',* – నేటికీ ఇదే స్థితి పల్లెల్లో వుంది. వీధులకు సిమెంటు రోడ్లిచ్చి, కాలిదారుల్ని రహదారులుగా మార్చిన పాలకులు *'డిష్ యాంటిన్నా లిచ్చారు. సెల్‌ఫోన్లిచ్చారు / ఒక్క ఇల్లున్నా సరే మద్యం బెల్ట్ షాపులిచ్చారు.'* ప్రపంచాన్ని తెచ్చి పల్లె అరచేతిలో ఇమిడ్చారు. కాని గొంతు తడపడం మాత్రం మరచారు. ఇంటింటికీ మరుగు దొడ్లిచ్చారు కానీ వాటిలో పోసేందుకు బక్కెటు నీళ్లకు కూడా గతిలేకుండా చేశారని కవి వాపోతాడు.

ఇప్పుడు మట్టి మనిషి వ్యవసాయమంటే *'ఇంట్లో విత్తనాలు దిబ్బలో ఎరువులు / గాడి మీద ఎద్దులు కాదు – విత్తనాలకు బదులు రూపాయల్నో దాలర్లనో మట్టిలో నాటి / పంటల బీమాకోసం పడిగాపులు కాయటం'* అంటు కవి వ్యధపడతాడు. ఇక అనుకున్న సమయానికి కరెంట్ రాక,"

ఒక్కగంట విద్యుత్ ప్రవాహం కోసం, భార్య వద్ద మధురాను భూతుల్ని సైతం వదులుకొని, రాత్రంతా మోటారు పంపుని అంటిపెట్టుకుని వుంటుంది రైతు జీవితం. రైతు దుర్భర జీవితం మాటలకందనిది.

*'నీళ్ల పారేసుకొని ఇసుక అంగళ్ల పెట్టుకొన్న నదులు*
*చెట్లు నాకేసుకొని కంకర అమ్ముకు బతికే కొండలూ*
*పొలాల పిల్లల్ని ఎండబెట్టి పిచ్చి కంపను పెంచుకొనే చెరువులూ...*
*ఈ నేలనిండా కరువు పాట పల్లేరులే'*

ఇది నేటి కరువుపాట. చెమట మనిషి కన్నీటి పాట. హృదయాన్ని పల్లేరు ముళ్లై గుచ్చుకొని బాధించే గుండె చెరువు పాట.

ఈ కరువు పాట ఇంకా పాతబడలేదంటూ

*'రాబోయే రిపబ్లిక్ దినోత్సవాల పెరేడ్‌లో*
*సనాతన సంస్కృతీ సంప్రదాయాల విభాగంలో*
*మన రాష్ట్రం తరపున కరువుపాట పాల్గొనవచ్చు*
*ప్రథమ బహుమతి సాధించనూవచ్చు*

అంటు గుండెను పిండే సీమ కరువును వ్యంగ్యాత్మకంగా కవిత్వీకరిస్తాడు కవి.

నేడు ప్రతిదీ వ్యాపారమయమైంది. ఆధునిక వ్యవసాయ పద్ధతులు సాంప్రదాయక వ్యవసాయ పనిముట్లను అటకెక్కించాయి.

*'తొలి కోడి కూతకీ*
*ఎద్దుల గాడికీ మధ్య మనిషి వాసన లేదు –*
*చుట్టూ ట్రాక్టర్ కంపు*
*సేద్యంతో తెగిన సంబంధాలు*
*సమస్త మానవ సంబంధాల్ని దెబ్బతీశాయి'*

అన్న కవి మాటలు పల్లె జీవనాన్ని పరిశీలిస్తే యెంతో వాస్తవాలు.

ప్రపంచీకరణ మన పండగల్ని, పబ్బాల్ని సమస్త సంస్కృతీ సంప్రదాయాల్ని ధ్వంసం చేసింది. జనవరి ఫస్టొచ్చి, వ్యవసాయ జీవితంలో యెంతో ప్రధానమైన పురివిప్పిన మార్పుకు సంకేతమైన ఉగాది ఉసురుతీసిందని కవి వాపోతాడు.

ఆరికలు వంటి తృణధాన్యాలు మట్టి గొట్టుకపోయాయి. ఇక మట్టి మనిషి కూడా మట్టిపాలేనా అనే ఆలోచన వెన్నులో వణుకు పుట్టిస్తుంది. ◆

## కవిత

# మాయమై పోయేకాలం

- సందీప్ రుద్రాక్షుల
9494139410



వస్తాయేమో
నిశ్శబ్దం
పరిగెత్తించే రోజులు
మనిషి
అస్తిత్వం
కోల్పోయే రోజులు

వస్తాయేమో
నీళ్లింకిన నేల
వైపు చూసేలా
నేల చూపులు
మనిషి
మాటున
ప్రాణభీతి భయాలు

వస్తాయేమో
కొడారిపోతున్న
ద్వీపం
కొన కింద
తెల్లారే
చదువులు
మనిషి
ఆత్మనూన్యతకి
ఆప్తుడయ్యే రోజులు

వస్తాయేమో
సారం లేని
భూమి వైపు
నిస్సారంగా
చూసే రోజులు
తిండి లేక
మేకలవలె
ఆకులు మేసే రోజులు

వస్తాయేమో
ఉల్కల
వంతుగా
విజృంభించే రోజులు
శూన్యం నుండి
మనిషిని చేరే
మారణ హోమం
చూసే రోజులు

వస్తాయేమో
కాంతి
కరువుతో
క్రాంతి కోసం
వెతుకులాడే రోజులు
మనిషి
అంధకారంతో
అంధుడయ్యే రోజులు

వస్తాయేమో
రూపం
వికృతమై
రోదన
రాక్షసమయ్యే రోజులు
మనిషి అందానికి
మృత్యువొచ్చే రోజులు

వస్తాయేమో
భాష పలకని
గొంతు
గోలచేస్తున్నా
గోడు
అర్థంకాని రోజులు
మనిషి
మనిషికి
మాటలు
మాయమయ్యే రోజులు

వస్తాయేమో
నిద్రలో
కలలే
కమ్మగా
ఉండే రోజులు
మనిషి
జీవితం కలలో
మాత్రమే
బాగుండే రోజులు

వస్తాయేమో
మనిషిని
నమ్మని
మనిషి బారినపడి
మసై పోయే రోజులు
మోసపూరితమై
మనిషిలో
మనిషినన్వేషించే రోజులు

వస్తాయేమో
ప్రకృతిలేని
ప్రదేశంలో పడి
వృధా
ప్రయాసపడే రోజులు
మనిషి
మతి
భ్రమించే రోజులు

వస్తాయేమో
ఊపిరందక
డబ్బాలలో గాలి
కొనుక్కునే రోజులు
మనిషి
మలినమై
మాయమై పోయే
రోజులు

మనిషే
మాయమై
పోయేకాలం
వస్తుందేమో
ఓ మనిషీ
మేలుకో
మాయమై
పోయేకాలం
ముందుంది...

# స్వీకారం



## ఆధునిక కథ - ప్రస్థానం

ఆరు భాషల్లోని కథాయాత్ర - చారిత్రక అధ్యయనం

**జయంతి పాపారావు**

వెల :900/- పేజీలు: 511(ఎ4 సైజులో)

ప్రతులకు : 0891 – 2557961

ఈ గ్రంథం ఒక చారిత్రక అధ్యయనం. సమాజం – చరిత్ర – సాహిత్యం – వీటిమధ్య సంబంధాలు ఏ విధంగా పరస్పరం ప్రభావితమౌతాయో, ఏ విధంగా సమాజ లక్ష్యాలకూ, నిర్మాణాలకూ ప్రజా ఉద్యమాలకూ దిశానిర్దేశం చేయటంలో ఉపయోగపడతాయో – ఆ క్రమాన్ని రీతిని ప్రమాణాలుగా తీసుకుని మన ఆధునిక తెలుగు కథా సాహిత్యాన్ని విశ్లేషించాను.

**- జయంతి పాపారావు**




## ఎవరి దుఃఖమో అది! కవిత్వం

**డా. ఎన్. గోపి**

వెల : 150/- పేజీలు: 150

ప్రతులకు : 9391028496

అక్కడ గాలి కదలికలు/ తుఫానుల్ని ఒడిలో దాచుకున్నట్టు/ కనిపించని ఇసుక/ కాస్త కాస్త జమగూడి/ ఓ పెద్ద కుప్పగా పెరుగుతున్నట్టు./ ../ అక్కడ గుండుసూది వడ్డా/ ఖణేల్‌మని చప్పుడౌతుంది./ క్షణం క్షణం ఉద్వేగానికి/ కొత్త నోళ్ళు మొలుచుకొస్తాయి.

**- డా. ఎన్. గోపి**



## మూలమలుపు కవిత్వం

**ఏనుగు నరసింహారెడ్డి**

వెల : 100/- పేజీలు: 152

ప్రతులకు: 8978869183

ఏనుగు నరసింహారెడ్డికి అక్షరాల కూర్పు తెలుసు. ఏ పదం ఎట్లా పలుకుతుందో పసిగట్టినవాడు. ప్రతీకలయినా, పదచిత్రాలయినా తెలిసి ప్రయోగిస్తాడు. పుస్తకం గూట్లో పదాలు తాల్చి అనుభవం అంటించి కవిత్వం వెలిగించాడు.

**- డా॥ నందిని సిధారెడ్డి**




## సాగరహేల కవిత్వం

సంపాదక వర్గం:

**డా॥ జోశ్యుల కృష్ణబాబు, బొల్లోజు బాబా**

**మార్ని జానకిరామ్ చౌదరి**

వెల : 50/- పేజీలు: 74

ప్రతులకు : 9908853081

సమూహాల చర్యలను చరిత్ర లిఖిస్తుంది. వ్యక్తుల జీవితాలను ఉద్వేగాలను, ఆలోచనలను సాహిత్యం అక్షరబద్ధం చేస్తుంది. సాహితీస్రవంతి సభ్యుల, శ్రేయోభిలాషుల మనోలోకాల స్థలకాలాదులను ప్రతిబింబించే దర్పణం ఈ "సాగరహేల" సంచిక. కవిత్వాన్ని ఇష్టపడే వారందరకూ ఈ పుస్తకం నచ్చుతుంది.

**- బొల్లోజు బాబా**



## కాంతిసందేశం ఖండకావ్యం

**సిహెచ్.వి. బృందావనరావు**

వెల : 80/- పేజీలు: 104

ప్రతులకు: 9963399189

పద్యానికి ఉన్న రూపసౌష్టవాన్ని పల్చన చెయ్యకుండానే వస్తువరంగా కొత్తదనాన్ని దండిగా ప్రవేశపెట్టడం ఈ కవి సాధించిన గొప్ప సమన్వయం. ప్రతి ఖండికలోనూ ఇది కనిపిస్తుంది. ప్రధానంగా వీరి మహిళాభ్యుదయదృష్టి, మానవీయ దృష్టి అనేవి వస్తువుకు క్రొమ్మెరుంగులు దిద్దటంతో పాటు ఇవి నేటి కవితలు అనే స్పృహను పాఠకుడికి కల్గిస్తున్నాయి.

**- బేతవోలు రామబ్రహ్మం**



## వై... దీర్ఘకావ్యం

**జాని భాషా చరణ్ తక్కెడశిల**

వెల : 150/- పేజీలు: 67

ప్రతులకు: 9491977190

హిజ్రాలది ఒక ప్రత్యేక ప్రపంచంగా రూపుదిద్దు కుంటున్నది. ఇందుకు మిగతా ప్రపంచమే కారణం. హిజ్రాలు ఇప్పుడు సంఘటితమౌతున్నారు. హక్కుల పోరాటం చేస్తున్నారు. గుర్తింపు ఉద్యమాలు నడుపుతున్నారు. ఈ నేపథ్యంలో జాని ఈ కావ్యం రాశారు. 'వై' ఒక మానవీయ కావ్యం. ఒక ఇతిహాసపు చీకటికోణాన్ని జాని వెలుగులోకి తీసుకొచ్చారు.

**- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి**

## నివేదిక

# సాగరతీరాన - సాహితీస్రవంతి




- మార్ని జానకిరామ్ చౌదరి
9440338303

కాకినాడ సాహితీస్రవంతి ఆగస్టు 5వ తేదీ ఆదివారం స్థానిక పి.ఆర్.ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో 5వ వార్షికోత్సవ కార్యక్రమాన్ని ఘనంగా జరుపుకొంది. దాదాపు 270 మంది సాహితీ ప్రియులు హాజరై ఉదయం నుండి సాయంత్రం వరకు ఉత్సాహభరిత వాతావరణంలో జరిగింది.

ఉదయం అల్పాహారం తరువాత ప్రారంభమైన "ప్రారంభసదస్సు"కు సాహితీస్రవంతి నగరకోశాధికారి పద్మజవాణి అతిథులను వేదికపైకి సాదరంగా ఆహ్వానించారు. సంస్థ రాష్ట్ర ఉపాధ్యక్షులు "గనారా' అధ్యక్షత వహించగా, సంసధ రాష్ట్ర అధ్యక్షులు వొరప్రసాద్ ముఖ్యఅతిథిగా, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం మాజీ ఉపకులపతి పద్మశ్రీ కొలకలూరి ఇనాకె ముఖ్య వక్తగా వేదికనలంకరించారు. విశిష్ట అతిథులుగా పి.ఆర్. డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ డా॥చప్పిడి కృష్ణ, చిట్టూరి విజయ్ ప్రకాష్, డా॥కాద వెంకటరమణ, సంస్థ నగర అధ్యక్షుడు మార్ని జానకిరామ్ చౌదరి పాల్గొన్నారు. ముందుగా గరికపాటి మాస్టారు సంస్థపై వ్రాసిన గీతాన్ని మేడిశెట్టి శ్రీరాములు ఆలపించారు.

సభాధ్యక్షులు గనారా అతిథులందరినీ సభకు పరిచయం చేసారు. అనంతరం సంస్థ ఆవిర్భావం గురించి వివరించి డా॥అద్దేపల్లి నిర్వహణలో నెల నెలా సాహిత్యహేల పేరుతో అనేక కార్యక్రమాల్ని నిర్వహించినట్లు చెప్పారు.

సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు శ్రీ వొరప్రసాద్ ఉపన్యసిస్తూ కవులకు, రచయితలకు వర్తమాన సమాజంలో జరిగే దోపిడీని, అవినీతిని ప్రశ్నించే తత్వం అలవడాలన్నారు. భావవ్యక్తీకరణ స్వేచ్ఛకు అడ్డుకట్ట వేస్తూ గౌరీలంకేష్, కల్బుర్గి, గోవింద్‌పన్సారీ, దభోల్కర్ వంటి వారిని అమానుషంగా హత్య చేయటాన్ని నిరసించారు. ఇలాంటి సమయాల్లో ముఖ్యంగా కవులు వర్తమాన సమస్యలపై స్పందిస్తూ తమ కవిత్వాన్ని, ప్రజల గుండెలోతుల్లోకి వినిపింపజేయాలని సూచించారు.

అనంతరం ముఖ్యవక్త పద్మశ్రీ ఆచార్య కొలకలూరి ఇనాకె "సమాజం-సాహిత్యం-రచయితలు" అనే అంశంపై ప్రసంగించారు. విద్యావ్యవస్థను ప్రభుత్వం, కార్పొరేటు సంస్థలు కలిసి భ్రష్టు పట్టిస్తున్నాయని, పేదలకు విద్యను దూరంచేసేందుకు కుట్ర జరుగుతుందని, ప్రయివేటీకరణతో వెనుకబడిన తరగతులవారికి చదువు దక్కదని ఆందోళన వ్యక్తం చేసారు. సమాజం పేద, సంపన్న వర్గాలుగా విడిపోతున్న నేపథ్యంలో పేదలు కనీసావసరాలకు కూడా నోచుకోలేకపోతున్నారన్నారు. 'భేటీ పడావో' అంటూ కేవలం నినాదాలకే పరిమితమవుతున్నారు గానీ, స్త్రీలకు 33శాతం రిజర్వేషన్లు ఇవ్వటానికి సిద్ధం కావటం లేదని ఇటువంటి పరిస్థితుల్లో కవులు, రచయితలు సమాజ దార్శనికులుగా,



భవిష్యత్, నిర్మాతలుగా సాహిత్య రంగంలో కృషి చేయవలసిన అవసరం ఉందన్నారు.

ఇనాక్ తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ కులాలు, మతాల పేరుతో గ్రూపు రాజకీయాలు నడుస్తున్నాయని, ఓటరు తన ఓటును అమ్ముకోవటం ద్వారా నాయకులు తమ పదవులను కొనుక్కోవటం ద్వారా సామాన్యుడు ప్రజానీకానికి న్యాయం జరగదన్నారు. తాయిలాల రూపంలో ఎరవేసి సామాన్యుడిని సామాన్యుడిగానే ఉంచే కుట్ర జరుగుతుందని, భయంకరమైన ఐదు పడగల హైందవం దేశంలో దాడులు చేస్తోందన్నారు. సమస్య యొక్క మూలాల్ని స్పృశించి ప్రజలను జాగృతం చేయడం ద్వారా ఉత్తమ సమాజ దిశా నిర్దేశానికి కృషి చేయవలసిన అవసరం ప్రతి కవి, రచయితపై ఉందన్నారు.

సంస్థ నగర అధ్యక్షుడు మార్ని జానకిరామ్ చౌదరి మాట్లాడుతూ వర్తమాన సమాజం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్యల్లో మానవ సంబంధాలొకటని, ఎప్పుడైతే మనిషికీ, మనిషికీ మధ్య బంధం మృగ్యమౌతుందో అప్పుడే నైతిక విలువల పతనానికి పునాది పడుతుందని మానవసంబంధాలు బలహీన పడిన క్షణం నుండీ అరాచక శక్తులు మతోన్మాదశక్తులు పెచ్చరిల్లుతాయంటారు. అనంతరం తన నివేదికలో సంస్థ చేపట్టిన కార్యక్రమాలను తెలియజేశారు. ఈ సందర్భంగా వీరప్రసాద్ 5వ వార్షికోత్సవ కవితా సంపుటిని ఆవిష్కరించారు. "సాగరహేల" పేరుతో విడుదల చేసిన ఈ కవితా సంపుటిలో 57 మంది కవుల కవితలు ప్రచురించబడ్డాయి.

అనంతరం తొలి సాహితీ సదస్సుకు బొల్లోజు బాబా అధ్యక్షత వహించగా, విశిష్ట అతిథిగా డా॥పి.హరిరామ ప్రసాద్, ముఖ్య వక్తగా ప్రజాశక్తి దినపత్రిక సంపాదకులు, మాజీ శాసనమండలి సభ్యులు ఎం.వి.ఎస్. శర్మ పాల్గొన్నారు. "సాహిత్య సాంస్కృతిక రంగాలు – కర్తవ్యాలు" అనే అంశంపై శర్మ ప్రసంగిస్తూ మనుషులు విడిగా ఉండరని, ఉమ్మడి జీవనం మనిషి లక్షణమని, మనం తినే అన్నం ముద్దలో కూడా వందలమంది శ్రమ భాగస్వామ్యం ఉంటుందని పేర్కొన్నారు. ప్రపంచంలో ప్రతి ఒక్కరికి సబంధం ఉంటుందని, తనకెవరితో సంబంధం లేదనటం అవివేకమన్నారు. శ్రమలేకుండా సంపదలేదని ఇస్రో శాస్త్రవేత్తల విజయం వెనుక పలువురి శ్రమశక్తి దాగుందని, శ్రీశ్రీ చెప్పిన విధంగా "ప్రభువెక్కిన పల్లకి కాదోయ్ అది మోసిన బోయీలెవ్వరు" అన్నట్లుగా ప్రతి విజయం వెనుక ఎందరో శ్రమతో కూడిన సమకారముంటుందన్నారు. సంస్కృతిలో మానవ సంబంధాలు ప్రధానమైనవని, సంస్కృతిని శ్రమ ప్రాతిపదికగా ఉండాలని, సంగీతం, నాట్యం వంటి కళలు శ్రమనుండే పుట్టాయని, సజీవమైన శ్రమ సంబంధమే జానపద కళల్ని నిలబెట్టిందన్నారు. మనం చెప్పిందే అందరూ ఆచరించాలనడం అగ్రవర్ణ ఆధిపత్య దురహంకార సంస్కృతికి నిదర్శనమని, స్వయం ప్రకటిత మతోద్ధారకులు ముందుకు వస్తున్నారని, హిందూ ప్రతినిధులమని తమకు తామే ప్రకటించుకొంటున్నారని ఆందోళన వ్యక్తం చేశారు. తమకు నచ్చని అభిప్రాయాలను వ్యక్తం చేస్తే మతం పేరుతో గొంతు నొక్కే ప్రయత్నం చేస్తున్నారని ఆవేదనం వ్యక్తిం చేశారు. అసహనం నింపుతున్న సంస్కృతిపై ఎదురు తిరగాలని మనభాష, మన తిండి, మన భూమి నుంచి మనం దూరమవుతున్నామని, దైవాన్ని వాడుకుంటూ సమాజంలో అశాంతి రాజేయడం ఏ సంస్కృతి అంటూ నిలదీశారు. ప్రపంచీకరణకు తోడుగా మతోన్మాద పోకడలు కలిసి సామాన్య

ప్రజానీకాన్ని వంచిస్తున్నాయని రచయితగా బ్రతికి ఉండాలంటే ఈ ప్రమాదాలను గుర్తించి క్రియాశీలత పాత్రపోషిస్తూ కలానికి, గళానికి పని చెప్పాలని శర్మ సూచించారు.

భోజన విరామం అనంతరం జరిగిన రెండవ సాహితీ సదస్సు డా॥జోశ్యుల కృష్ణబాబు అధ్యక్షతన ప్రారంభమైంది. విశిష్ట అతిథిగా పి.ఆర్.డిగ్రీ కళాశాల తెలుగు విభాగాధ్యక్షులు సుంకర గోపాలయ్య, ముఖ్యవక్తగా ప్రముఖ అభ్యుదయ సినీగేయ రచయిత సుద్దాల అశోక్‌తేజ పాల్గొన్నారు. సభాధ్యక్షులు డా॥కృష్ణబాబు అతిధుల్ని సభకు పరిచయం చేసి, సుద్దాల అశోక్‌తేజ తండ్రి సుద్దాల హనుమంతు గొప్ప స్వాతంత్ర్య సమర యోధుడని, కమ్యూనిస్టు పార్టీకి సేవ చేస్తూ నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా ఎన్నో గేయాలను వ్రాసి, అనేక పోరాటాల్లో పాల్గొన్నట్లు వివరించారు. అశోక్‌తేజ ఇంటిపేరు 'గుఱ్ఱం' అని, ఆయన తండ్రి 'సుద్దాల' అనే గ్రామం నుండి రావటం వల్ల 'సుద్దాల'ను ఇంటిపేరుగా మార్చుకొన్నట్లు చెప్పారు.

శ్రమనుంచే పాట పుట్టిందని చెపుతూ తాను ఇంటర్మీడియట్ చదువుతున్నప్పుడే భవన నిర్మాణ కార్మికునిగా పనిచేస్తూ 'రాయి.. సలాక.. ఇటుక" అంటూ రాసిన పాటను వినిపించి, దాని ఆధారంగానే 'ఒకటే జననం, ఒకటే మరణం" పాటను సినిమాకోసం వ్రాసినట్లు వివరించారు. "ఆకలైతే చెట్టు అమ్మవుతది.. ఆయుధమడిగితే జమ్మి చెట్టవుతది" అనే పాట వినిపించి – 'పాట మాయింట నాకన్నా ముందే పుట్టిందని, పాట నాకు తోబుట్టువు లెక్క' – అంటూ తన స్వీయ రచన "శ్రమకావ్యం"గానం చేశారు. శ్రమి, శ్రముడు అనే రెండు పాత్రల ద్వారా శ్రమలోనుండే నిప్పు, చక్రం, యంత్రం, వంటి క్రొత్త క్రొత్త ఆవిష్కరణలు ఎలా ఉద్భవించాయో వివరించారు. శ్రీరాముడు చేపట్టిన విల్లును, బాణాన్ని తయారుచేసిన శ్రముడి కృషిని, శివుడి చేతిలోని ఢమరుకాన్ని తోలుగో రూపొందించిన శ్రామికుడు శివుడి కంటే ముందే తన శ్రమ సంస్కృతి పుట్టిందని, తన శ్రమ కార్యాన్ని "శ్రమాయణం"గా అభివర్ణించారు. ఖడ్గాన్ని పట్టుకొని వధించటం కంటే దాన్ని ఉపసంహరించే తత్వం తెలిసున్నవాడే గొప్పవాడన్నారు. శ్రమలోనుండే నాట్యం, సంగీతం, కళలు పుట్టాయని, శ్రమకావ్యం ఊహాధారిత వాస్తవమని, వాస్తవాలు ఆధారంగా రాసిన ఊహాజనిత కావ్యమని పేర్కొన్నారు. దేవులపల్లి, సినారె తర్వాత కావ్యాలను గానం చేసేవారు ఎక్కడా తనకు కనపడలేదని, తన శ్రమకావ్యాన్ని 100 ప్రదేశాల్లో గానం చేయటం ద్వారా ప్రజల్లోకి తీసుకెళ్ళాలని అనుకొంటున్నట్లు చెప్పారు.

అనంతరం జరిగిన మూడవ సాహితీ సదస్సులో భాగంగా 'కవిసమ్మేళనం' కార్యక్రమం 2 విభాగాలుగా జరుగగా మొదటి విభాగానికి అద్దేపల్లి జ్యోతి, ఇందిర సమన్వయకర్తలుగా, రెండవ విభాగాన్ని రామకృష్ణ శ్రీవత్స, నిర్వహించారు. ఈ కవి సమ్మేళనంలో స్థానిక కవులతో పాటు తణుకు, తాడేపల్లి గూడెం, రాజమండ్రి, విశాఖపట్టణం, అమలాపురం, ఏలూరు, రామచంద్రపురం, కొత్తపేట వంటి అనేక ప్రాంతాల నుండి విచ్చేసిన కవులతో దాదాపు 60 మంది తమక కవితలను వినిపించారు. ఆచార్య కొలకలూరి ఇనాక్ చేతులమీదుగా పాల్గొన్న కవులందరినీ జ్ఞాపికలతో సత్కరించడం జరిగింది. స్థానిక కళాశాలల విద్యార్థులు కూడా తమ గళాన్ని వినిపించారు. కవులు తమ కవితలలో వర్తమాన పరిస్థితులకు అద్దంపట్టే అనేక సమస్యలపై స్పందించి, కొత్త కోణాలతో స్పృశించి చక్కటి భావవ్యక్తీకరణతో తమ కవితలను వినిపించారు. సంస్థ సభ్యులు ఉండవిల్లి.ఎమ్ వందన సమర్పణతో సాహితీ స్రవంతి వార్షికోత్సవ సభ విజయవంతంగా ముగిసింది. ◆

## చలపాకప్రకాష్ 'మూడోకన్ను' ఆవిష్కరణ



విజయవాడలో మధు కల్చరల్ సెంటర్‌లో ఆగస్టు 22న ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం ఆధ్వర్యంలో చలపాక ప్రకాష్ కవితా సంపుటి 'మూడోకన్ను' ఆవిష్కరణ సభ జరిగింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సృజనాత్మకత సాంస్కృతిక సమితి ప్రచురించిన ఈ పుస్తకాన్ని ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి మండలి బుద్ధప్రసాద్ ఆవిష్కరించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సృజనాత్మకత సాంస్కృతిక సమితి సి.ఇ.ఓ.దీర్ఘాసి విజయభాస్కర్ ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఈ కార్యక్రమంలో రచయిత చలపాక ప్రకాశ్, సోమేపల్లి వెంకటసుబ్బయ్య, అడిగోపుల వెంకటరత్నం, పొన్నూరు వెంకట శ్రీనివాసులు, కోసూరి రవికుమార్, తదితరులు పాల్గొన్నారు. ◆

## నివాళి

# కథానిక ప్రేమికుడు వేదగిరి రాంబాబు స్మృతి



ప్రముఖ కథారచయిత వేదగిరి రాంబాబు ఆగస్టు 18వ హైదరాబాద్‌లోని తన ఇంట తుదిశ్వాస విడిచారు. కొద్దికాలంగా ఆయన ఆరోగ్యం బాగోలేదు. వేదగిరి రాంబాబు గుంటూరు జిల్లా తెనాలి తాలూకా చుండూరులో 1952 అక్టోబరు 14న జన్మించారు. 1974లో డిగ్రీ ఫైనలియర్‌లో ఉండగా, ఆంధ్రపత్రిక దీపావళి కథల పోటీకి సరదాగా పంపిన తొలికథ 'సముద్రం' బహుమతి సాధించిపెట్టింది. తరువాత యువ, జ్యోతి, స్వాతి, ఆంధ్రపత్రికలకు కథలు రాశారు. కొంతకాలం ఆకాశవాణిలో అనౌన్సర్‌గా పనిచేశారు. ఆయన కథానికలకు రేడియో ద్వారా మంచి ప్రాచుర్యం లభించింది.రాంబాబు వివిధ పత్రికల్లో పనిచేశారు. ఫ్రీలాన్స్ జర్నలిస్టుగానూ దినపత్రికలకు అనేక వ్యాసాలు రాశారు. దూరదర్శన్ అందుబాట్లోకి వచ్చాక- దృశ్య మాధ్యమాన్ని సామాజిక అస్త్రంగా మలిచి జనాల్లో మార్పు తేవాలని ఆశించారు. రాష్ట్రంలోని పలు జైళ్లలో శిక్ష అనుభవిస్తున్న ఖైదీల యథార్థ గాథలను సేకరించారు. వాటినే కథావస్తువులుగా చేసుకుని 'జైలుగోడల మధ్య' సీరియల్‌గా రూపొందించారు. 2010లో తెలుగు కథానికకు వందేళ్ల ఉత్సవం సందర్భంగా ఎన్నో కార్యక్రమాలు నిర్వహించారు. విజయనగరంలోని గురజాడ ఇంటినుంచి మొదలుకొని రాష్ట్రంలోని పలు పట్టణాల్లో సభలూ సదస్సులూ జరిపారు. కథక చక్రవర్తి శ్రీపాద సుబ్రహ్మణ్యం విగ్రహాన్ని రాజమహేంద్రవరంలో నెలకొల్పటంలో అంతా తానే అయ్యి కృషి చేశారు. కొత్త రచయితలను ప్రోత్సహించటంలో ముందుండేవారు. ఆయన కథకు, కథకులకు మంచి మిత్రుడు... సన్నిహితుడు. ఆయనకు జోహార్లు. ◆

# కొలకలూరి ఇనాక్‌కు రావిశాస్త్రి పురస్కారం



*విశాఖపట్నంలో పౌరగ్రంథాలయంలో రావిశాస్త్రి పురస్కారాన్ని కొలకలూరి ఇనాక్‌కు అందజేస్తున్న ప్రజాశక్తి దినపత్రిక సంపాదకులు ఎం.వి.ఎస్. శర్మ. చిత్రంలో రామతీర్థ, ఎల్.ఆర్. స్వామి, రాచకొండ ఉమాకుమార శాస్త్రి తదితరులు.*

సమాజంలోని శ్రమజీవులను ముందుకు తెచ్చే సాహిత్యాలు రావాలని ప్రజాశక్తి సంపాదకులు ఎంవిఎస్.శర్మ అన్నారు. ఆగస్టు 6న విశాఖలోని పౌర గ్రంథాలయంలో రావిశాస్త్రి లిటరరీ ట్రస్టు అధ్వర్యాన రావిశాస్త్రి 97వ జయంతి ఉత్సవం జరిగింది. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా శర్మ పాల్గొని ప్రసంగించారు. దేశంలోని గోవింద్ పన్సారే, కల్బుర్గీ, గౌరీ లంకేశ్‌ల వంటి సాహితీకారులను మత చాందసవాదులు హతమారుస్తున్న తరుణంలో సాహితీకారులను సత్కరించుకోవడం సముచితంగా ఉందన్నారు. మేధావులు, సాహితీకారులు, వివిధ వర్గాల వారు దేశంలోని అనేక రంగాలపై ప్రత్యామ్నాయం గురించి ఆలోచనలు చేస్తున్నారని చెప్పారు. రావి శాస్త్రి అవార్డును ఆచార్య కొలకలూరి ఇనాక్‌కు ప్రదానం చేయడం చారిత్రక ప్రాముఖ్యతను సంతరించుకుందన్నారు. సమాజ చైతన్యాన్ని తేవడానికి ఆచార్య ఇనాక్ రచనలు ఎంతగానో దోహదపడతాయని తెలిపారు. అనంతరం ఆచార్య కొలకలూరి ఇనాక్‌కు 'రావి శాస్త్రి-2018' అవార్డు ప్రదానం చేశారు. కార్యక్రమానికి అధ్యక్షత వహించిన ఎల్ఆర్.స్వామి మాట్లాడుతూ రావి శాస్త్రి పేరున సాహితీ వేత్తలకు ఇటువంటి అవార్డులు అందజేయడం శుభపరిణామమన్నారు. ప్రముఖ సాహితీ వేత్త రామతీర్థ మాట్లాడుతూ కోర్టులు, పోలీస్ వ్యవస్థలపై రావిశాస్త్రి రాసినంతగా దేశంలోని మరే ఇతర సాహితీకారులు రాయలేదని కొనియాడారు. రావిశాస్త్రి కుమారుడు ట్రస్టీ రాచకొండ ఉమాకుమార శాస్త్రి మాట్లాడుతూ త్వరలో రావి శాస్త్రి శత జయంతి ఉత్సవాలు జరుపుతామని చెప్పారు. నగరానికి చెందిన సుదర్శన్ కల్చరల్ అసోసియేషన్ వారు రావి శాస్త్రి రాసిన టామి టామి టామి అనే హాస్య ప్రధానమైన నాటికను ప్రదర్శించారు. సభా కార్యక్రమానికి ప్రముఖ రచయిత జగద్ధాత్రి స్వాగతం పలికారు. కార్యక్రమంలో ఆచార్య చందు సుబ్బారావు, రాచకొండ సుబ్బారావు తదితరులు పాల్గొన్నారు. ◆

## 'సూత రంగస్థలి' పరిచయ సభ



సమాజంలో అనేక రుగ్మతలు, సాంఘిక దురాచారాలకు కారణం పురాణ సాహిత్య భావజాలమే కారణమని ప్రముఖ రచయిత, ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ డైరెక్టర్, డాక్టర్ డి.విజయభాస్కర్ అన్నారు. అయన రాసిన సూత రంగస్థలి' పుస్తక పరిచయ కార్యక్రమం ఆగస్టు 18న విజయవాడలోని ఎంబి విజ్ఞానకేంద్రంలో జరిగింది. సాహితీ స్రవంతి, జాషువా సాంస్కృతిక వేదిక, ఆంధ్ర ఆర్ట్స్ అకాడమి, ప్రజానాట్య మండలి సంయుక్త ఆధ్వర్యంలో ఎం.బి.విజ్ఞాన కేంద్రంలో జరిగిన ఈ కార్యక్రమంలో ఆయన మాట్లాడుతూ భారతీయులు పరిపాలించినా, బ్రిటీష్‌వాళ్లు ఏలినా భారతీయ సమాజంలో అట్టడుగు వర్గాల జీవితాల్లో పెద్ద మార్పు లేదన్నారు.. సాహితీవేత్త గమ్మా సాంబశివరావు మట్లాడుతూ ఎంతో పరిశోధన చేసి తరువాత సూత రంగస్థలి పుస్తకం రాసినట్లు ఉందన్నారు. రంగస్థల నటుడు కృష్ణేశ్వరరావు మాట్లాడితూ నాటకం అనేది మానవ జీవన గమనానికి ప్రయోజనకరమైన మార్గాన్ని సూచిస్తుందన్నారు. ఎం.బి. విజ్ఞానకేంద్రం ప్రతినిధి వై.సిద్ధయ్య మాట్లాడుతూ మానవుల ఆనందవిషాదాల క్రమ బద్ధమైన వ్యక్తీకరణ కళ అని పేర్కొన్నారు. ప్రజానాట్యమండలి బాధ్యులు అనిల్, ఆంధ్రా ఆర్ట్స్ అకాడమి గోళ్ల నారాయణరావు సభాధ్యక్షత వహించిన రచయిత్రి శాంతిశ్రీ, జి.నారాయణ, జి.రంగారెడ్డి, ప్రముఖ కవి ఖాదర్‌మొహిద్దీన్ తదితరులు మాట్లాడారు. ◆

## అంపశయ్య నవీన్ నవలా పురస్కారం

అంపశయ్య నవీన్ లిటరరీ ట్రస్ట్ తరపున నవలా పురస్కారానికి 2014 – 2017 మధ్య రచించిన ఎక్కడా ప్రచురించబడని నవలలను ఆహ్వానిస్తున్నట్లు సంస్థ తరపున డి. స్వప్న ఒక ప్రకటనలో తెలిపారు. మొదటి బహుమతికి పది వేల రూపాయలు, ద్వితీయ బహుమతికి ఐదువేల రూపాయలు నగదు పారితోషికం ఇవ్వనున్నట్లు తెలిపారు. అంపశయ్య నవీన్ జన్మదినమైన డిసెంబర్ 24న ఈ బహుమతులు అందించనున్నట్లు తెలిపారు. అక్టోబర్ 31వ తేదీలోపు డి. స్వప్న, కార్యదర్శి, అంపశయ్య నవీన్ లిటరరీ ట్రస్టు, 2-7-71, ఎక్సైజ్ కాలనీ, హనుమకొండ, వరంగల్ – 506 001 చిరునామాకు పంపించ వలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 0870-2456458 ద్వారా సంప్రదించవచ్చును. ◆

## విమలా శాంతి సాహిత్య పురస్కారం

2018 – శాంతి రజనీకాంత్ స్మారక కవితా పురస్కారం కోసం 2016 – 2017 మధ్య కాలంలో వెలువరించిన కవితా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు ప్రముఖ సాహిత్యవేత్త శాంతి నారాయణ ఒక ప్రకటనలో తెలిపారు. సెప్టెంబర్ 30లోపుగా వచన కవితా సంపుటాలను వి. వెంకటేశులు, కథా రచయిత, డోర్ నెం. 3-328, ఎస్‌ఎస్‌ఎస్ సూపర్ మార్కెట్ దగ్గర, తపోవనం, అనంతపురం చిరునామాకు నాలుగు కాపీలను పంపవలసిందిగా కోరారు. ఎంపిక చేయబడిన కవితా సంపుటి రచయితకు డిసెంబర్‌లో జరిగే సభలో పదివేల రూపాయల నగదు మరియు పురస్కారం అందించనున్నట్లు తెలిపారు. ఇతర వివరాలకు 8074974547 ద్వారా సంప్రదించవచ్చును. ◆

## డా॥ పట్టాభి అవార్డుల కోసం ఆహ్వానం

డా॥ పట్టాభి కళాపీఠం తరపున పట్టాభి అవార్డ్స్‌లో భాగంగా ఆచార్య నెల్లుట్ల స్మారక కవితా పురస్కారం – 2018, శ్రీ మక్కెన రామసుబ్బయ్య స్మారక కథా పురస్కారం – 2018 కోసం 2017లో ప్రచురించిన సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు డా॥ తూములూరి రాజేంద్ర ప్రసాద్ ఒక ప్రకటనలో కోరారు. రెండు కాపీలను డా॥ తూములూరి రాజేంద్రప్రసాద్, కేరాఫ్ ఆంధ్రాబ్యాంక్, ఏలూరు రోడ్డు శాఖ, విజయవాడ – 520 002 చిరునామాకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9490332323 ద్వారా సంప్రదించవచ్చును. ◆

## ఎస్‌డివి అజీజ్‌కు పండిత హీరాలాల్ స్మారక పురస్కారం



కర్నూలు సాహిత్య చరిత్రలో ప్రముఖ పండితుడు హీరాలాల్ అని, పరిశోధకుడుగా పలు గ్రంథాలు రాసి కర్నూలు చరిత్రను తెలుగు జాతికి అందించారని సాహితీస్రవంతి గౌరవ అధ్యక్షులు, ప్రముఖ రాజకీయ విశ్లేషకులు తెలకపల్లి రవి అన్నారు. ఆగస్టు 19న కర్నూలులో హీరాలాల్ ద్వితీయ స్మారక పురస్కార ప్రదానోత్సవ సభ గన్నమరాజు సాయిబాబా అధ్యక్షతన జరిగింది. ఈ సభలో ముఖ్యఅతిథిగా పాల్గొన్న తెలకపల్లి రవి పురస్కారాన్ని ఎస్‌డివి. అజీజ్‌కు అందజేశారు. ఆయన మాట్లాడుతూ సాహిత్య సుక్షేత్రం కర్నూలు అని తెలిపారు. బుచ్చిబాబు చివరకు మిగిలేది వంటి రచనలను కర్నూలులో ఉన్నప్పుడే రాశారన్నారు. సమకాలీన రచయితలపై పరిశోధన, పరిశీలన దృష్టి రచయితలకు ఉండాలని, అది కొనసాగినప్పుడే గొప్ప రచనలు వస్తాయని తెలిపారు. చరిత్రను నిరంతరం అధ్యయనం చేయాలని, అప్పుడే సమాజంలో అసలైన చరిత్ర ఆవిష్కృతమవుతుందని చెప్పారు. కర్నూలుపై మరిన్ని పరిశోధనలు జరగాలన్నారు. కర్నూలు రాజధానిగా కొన్నాళ్లయినా ఉన్నందుకు కొంత చరిత్ర, గుర్తింపు ఉందని తెలిపారు. అనంతరం గన్నమరాజు సాయిబాబా, రచయిత, కేంద్ర గిరిజన సంక్షేమ శాఖాధికారి వాడ్రేవు చిన వీరభద్రుడు రచించిన 'దుఃఖం లేని దేశం', 'కబీర్ దోహ' తెలుగు అనువాదాన్ని అతిథులు ఆవిష్కరించారు. ఈ పుస్తకాన్ని సిల్వర్ జూబ్లీ కళాశాల తెలుగు అధ్యాపకులు డాక్టర్ దండెబోయిన పార్వతి సమీక్షించారు. వాడ్రేవు వీరలక్ష్మీదేవి, వాడ్రేవు చిన వీరభద్రుడు, ప్రముఖ న్యాయవాది ఎమ్‌డివై.రామమూర్తి, హీరాలాల్ కుమారుడు సీనియర్ జర్నలిస్టు విద్యారణ్య తదితరులు మాట్లాడారు. కవులు, రచయితలు తదితరులు పాల్గొన్నారు. ◆

## అనంతపురం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కేరళ వరద బాధితులకు విరాళాల సేకరణ

అనంతపురం సాహితీ స్రవంతి జిల్లా కమిటీ ఆధ్వర్యంలో కేరళ వరద బాధితుల సహాయార్థం జిల్లాలోని అన్ని సాహితీ సంఘాలు కలిసి అనంతపురం పుర వీధుల్లో సోమవారం ఆగస్టు 20న సాయంత్రం జోలె పట్టి భిక్షాటన చేయడం జరిగింది. అనంతపురం జిల్లా కలెక్టర్ వీరపాండ్యన్ కు సేకరించిన 14,335 రూపాయల మొత్తాన్ని జిల్లా కలెక్టర్, కేరళ రిలీఫ్ ఫండ్ పేరిట డి డి తీసి డి డి ని అందజేశారు.



చిత్రంలో సాహితీ స్రవంతి జిల్లా ప్రధనకార్యదర్శి దాముగట్ల హిదయతుల్లా, ఉపాధ్యక్షులు క ృష్ణవేణి, సభ్యులు యాడికి సూర్యనారాయణ రెడ్డి డి డి ను అందజేసిన వారిలో ఉన్నారు. ◆

## కడియాల రామమోహన్‌రాయ్‌కి అద్దేపల్లి పురస్కారం

ప్రముఖ సాహిత్య విమర్శకులు కడియాల రామమోహన్‌రాయ్ కి 2018 సంవత్సరానికి గాను అద్దేపల్లి రామమోహనరావు కవిత్వ విమర్శ పురస్కారాన్ని ఇవ్వనున్నట్టు అద్దేపల్లి ఉదయభాస్కరరావు ఒక ప్రకటనలో తెలిపారు. సెప్టెంబర్ 9వ తేది సాయంత్రం కాకినాడలో రోటరీక్లబ్‌లో ఈ పురస్కారాన్ని అందివ్వనున్నట్లు తెలిపారు. ఈ సందర్భంగా 'ఆధునిక తెలుగు కవిత్వ విమర్శ ధోరణులు' అంశంపై కడియాల రామమోహన్‌రాయ్ ప్రసంగించనున్నట్లు తెలిపారు. ఈ సభలో గిడ్డి సుబ్బారావు, చెలికాని స్టాలిన్, అరసవిల్లి కృష్ణ, సుంకర గోపాలయ్య తదితరులు పాల్గొంటారని, ఇదే సభలో అద్దేపల్లి సాహిత్యంపై డా. వాసా భూపాల్ పరిశోధనా గ్రంథం ఆవిష్కరణ జరుగుతుందని ఆ ప్రకటనలో తెలిపారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# అద్దేపల్లి రామమోహన రావు



అద్దేపల్లి రామమోహన రావు ప్రసిద్ధ కవి, సాహిత్య విమర్శకులు. ప్రపంచీకరణ పేరుతో వెదజల్లుబడుతున్న విష సంస్కృతికి వ్యతిరేకంగా వెలువడిన 'పొగచూరిన ఆకాశం' కవితా సంపుటి ప్రసిద్ధి పొందింది. అంతర్జ్వాల, మధుజ్వాల, రక్తసంధ్య, గోదావరి నా ప్రతిబింబం,సంఘం శరణం గచ్ఛామి, మెరుపు పువ్వు, కాలం మీద సంతకం కవితా సంపుటాలు వెలువడ్డాయి. శ్రీశ్రీ కవితా ప్రస్థానం, విమర్శ వేదిక, సాహిత్య సమీక్ష, మహాకవి జాషువా ప్రగతిశీలత - కళాత్మకత, కుందుర్తి వచన కవితా వైభవం, మినీ కవిత, దృష్టి పథం, స్త్రీవాద కవిత్వం ఒక పరిశీలన వంటి విమర్శా గ్రంథాలు రాశారు. తెలుగునాట ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ నలుమూలలా పర్యటిస్తూ ఔత్సాహిక కవులను ప్రోత్సహించేవారు. కవిత్వాన్ని, సాహిత్యాన్ని ప్రజల్ని చైతన్య పరచడానికి సాధనాలుగా చేసుకోవాలని నిరంతరం ప్రచారం చేసిన ప్రజాకవి అద్దేపల్లి రామమోహనరావు.

Bci

...NAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
...f Posting : 1st &2nd of Every Month ▪ Date of Publication: 27.08.2018



If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor
Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M331 |
| పుస్తకం పేరు | సాహిత్య ప్రస్థానం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | 76 |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Madhu |
| పేజీలు విడదీసినది | MADHU |
| స్కాన్ చేసినది | K Daveeo |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |